# వేదాంతగ్రంథములు

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| అద్వైతసంగ్రహము, తెలుఁగువచనము | ... | 0 | 4 |
| ఆత్మబోధము, సాంధ్రటీకా | ... | 0 | 8 |
| ఆనందలహరి ఆంధ్రతాత్పర్యసహితము | ... | 0 | 12 |
| అపరోక్షానుభూతి ,, | ... | 0 | 8 |
| అద్వైతపంచరత్నములు ,, | ... | 0 | 4 |
| అద్వైతోపదేశపంచరత్నములు ,, | ... | 0 | 4 |
| అద్వైతవేదాంతపరిభాష, సవ్యాఖ్యానము | ... | 4 | 0 |
| అద్వైతానుభూతి, ఆంధ్రతాత్పర్య సహితము | ... | 0 | 4 |
| ఉపదేశసాహస్రి, ఆంధ్రతాత్పర్యము | ... | 6 | 0 |
| కామకలావిలాసము ,, | ... | 4 | 0 |
| నారదపురూరవసంవాదము, పద్యము | ... | 0 | 4 |
| మహావాక్యదర్పణము, ఆంధ్రతాత్పర్యము | ... | 2 | 8 |
| మహావాక్యరత్నావళి ,, | ... | 3 | 0 |
| వివేకచూడామణి, ఆంధ్రతాత్పర్య సహితము | ... | 2 | 8 |
| అష్టోత్తరశతోపనిషత్తులు, మూలము | ... | 10 | 4 |
| ఆత్మపూజ, ఆంధ్రతాత్పర్యసహితము | ... | 0 | 2 |
| ఆత్మవిద్యావిలాసము , | ... | 0 | 12 |
| ఆత్మానాత్మవివేకము ,, | ... | 0 | 8 |
| ఉత్తరగీతా, సటీక, చిన్నసైజు | ... | 1 | 0 |
| పంచదశీప్రకరణము, సవ్యాఖ్యానాంధ్ర టీకా తాత్పర్యసహితము | ... | 12 | 8 |
| విచారచంద్రోదయము, వచనము | ... | 1 | 0 |
| విచారసాగరము, జనార్దనచైతన్యకృతము | ... | 10 | 0 |
| శివగీతా, సాంధ్రతాత్పర్యము. చిన్నసైజు | ... | 1 | 8 |
| శ్రీవిద్యారణ్యకృతజీవన్ముక్తిప్రకాశిక, ఆంధ్రతాత్పర్యసహితము | ... | 3 | 0 |
| వేదాంతస్తోత్రపంచకము, తాత్పర్యసహితము | ... | 0 | 6 |
| సదాముక్తిసుధార్ణవము, సాంధ్రతాత్పర్యము, చిన్నసైజు | ... | 0 | 10 |
| రామగీతా ,, | ... | 0 | 8 |
| సనత్సుజాతీయము, సటీక | ... | 1 | 0 |
| శాంతివిలాసము, ఆంధ్రతాత్పర్యసహితము | ... | 0 | 8 |
| సౌందర్యలహరి, ఆంధ్రటీకాతాత్పర్యము | ... | 0 | 12 |

శ్రీ రస్తు.

మహూర్తదీపికాసహిత

# మహూర్తదర్పణము

సటీకము.



చెన్నపురి:

వావిళ్లరామస్వామిశాస్త్రులు అండ్ సన్సు వారిచేఁ

ప్రకటితము.

# ముహూర్తదీపిక విషయసూచిక

# ముహూర్తదర్పణ విషయసూచిక

శ్రీ ర స్తు

# ముహూర్తదీపిక

## నక్షత్రనిఘంటువు



యః కర్తా జగతాం భర్తా సంహర్తా మహసాం నిధిః,
ప్రణమామి త మాదిత్యం బహిర న్తస్తమోఽపహమ్. 1

టీ. జగతాం=లోకములకు, భర్తా=ప్రభువైనవాఁడును, సంహర్తా=లయకరుఁడును, మహసాం=తేజస్సులకు, నిధిః=స్థానభూతమైనవాఁడు, యః=ఎవఁడో, బహిరంతః = లోపల వెలుపల నున్న, తమః = అజ్ఞానాంధకారమును, అపహం = పోఁగొట్టునట్టి, తంఆదిత్యం = ఆసూర్యునిఁగూర్చి, అహం = నేను, ప్రణమామి = నమస్కరించుచున్నాను.

భవత్యశ్వినినక్షత్ర మశ్వీ దస్ర స్తురఙ్గమః,
ఆద్య స్తురఙ్గ స్తురగ అశ్వో వాజీ హయో హరిః. 2

టీ. అశ్వీ, దస్రః, తురంగమః, ఆద్యః, తురంగః, తురగః, అశ్వః, వాజీ, హయః, హరిః ౧౦-అశ్వినీనక్షత్రము పేళ్లు.

భరణీ స్యా ద్యమో యామ్య స్త్వ న్తకో యమసంజ్ఞికః,

టీ. యమః, యామ్యః, అంతకః, యమసంజ్ఞికః, ౪-భరణీనక్షత్రము పేళ్లు.

కృత్తికా బహుళా జ్ఞేయా హుతభుగ్వహ్నిసంజ్ఞికా. 3
షట్తారకః పావక శ్చానలోఽథ జ్వలన స్తథా,

టీ. కృత్తికా, బహుళా, హుతభుక్, వహ్నిసంజ్ఞికా, షట్తారకః, పావకః, అనలః, జ్వలనః ౮-కృత్తికానక్షత్రము పేళ్లు.

రోహిణీ చ విధిర్బ్రహ్మా ప్రాజాపత్య శ్చతుర్ముఖః. 4
ప్రజాపతిః ప్రజేశశ్చ విధాతా పఙ్కజాసనః,
ఆత్మభూః పద్మయోనిస్స్యా ద్ద్రుహిణో నామ తతః పరమ్. 5

టీ. రోహిణీ, విధిః, బ్రహ్మా, ప్రాజాపత్యః, చతుర్ముఖః ప్రజాపతిః, ప్రజేశః, విధాతా, పంకజాసనః, ఆత్మభూః, పద్మయోనిః, బ్రహ్మనామ ౧౨-రోహిణీనక్షత్రము పేళ్లు.

మృగశీర్షే మృగశ్చంద్ర ఐందవో హిమదీధితిః,
సౌమ్య శ్చంద్రశిశుభం సౌమ్యో నిశానాథో నిశాకరః. 6

టీ. మృగః, చంద్రః, ఐందవః, హిమదీధితిః, చంద్రశిశుభం, సౌమ్యః, నిశానాథః, నిశాకరః ౮ మృగశీర్షే = మృగశిరనక్షత్రమందు వర్తించును.

ఆర్ద్రా రౌద్రశ్చ పురజి చ్ఛర్వ స్థాణు ర్భవో హరః,

టీ. రౌద్రః, పురజిత్, శర్వః, స్థాణుః, భవః, హరః ౬-ఆర్ద్రానక్షత్రమందు వర్తించును.

పునర్వ స్వదితి ర్దేవమాతా ఆదిత్య మేవ చ. 7

టీ. పునర్వసుః, అదితిః, దేవమాతా, ఆదిత్యం ౪-పునర్వసు పేళ్లు.

ఇజ్యాద్య స్తిష్యపుష్యౌతు పూజితో గురునామకః,
వాగీశ శ్చామరేజ్యశ్చ జీవో దేవపురోహితః. 8

టీ. ఇజ్యః, ఆద్యః, తిష్యః, పుష్యః, పూజితః, గురునామకః, వాగీశః, అమరేజ్యః. జీవః, దేవపురోహితః ౧౦-పుష్యమి పేళ్లు.

ఆశ్రేషోరగసార్పాహి భుజంగవ్యాళసంజ్ఞికః,

టీ. ఆశ్రేషః, ఉరగః, సార్పః, అహిః, భుజంగః, వ్యాళః ౬ - ఆశ్రేషకు నామములు.

మఘా పితా చ పైత్రశ్చ మేఖలా పితృభం తథా. 9

టీ. మఘా, పితా, పైత్రః, మేఖలా, పితృభం ౫-మఖానక్షత్రము పేళ్లు.

భాగ్యం పూర్వాఫల్గునీ స్యాద్భగాఖ్యం భగసంజ్ఞికం.

టీ. భాగ్యం, పూర్వాఫల్గునీ, భగం 3 భగసంజ్ఞికం పూర్వఫల్గునీ (పుబ్బ) నక్షత్రము పేళ్లు.

అర్యమార్యమణం చైవ అర్యమ్ణం చోత్తరం తథా. 10

టీ. అర్యమా, అర్యమణం, అర్యమ్ణం, ఉత్తరం ౪-ఉత్తరఫల్గుని పేళ్లు. ఉత్తరనక్షత్రము.

హస్త స్సవితృసావిత్రావర్క స్సూర్యో దివాకరః,

టీ. హస్తః, సవితా, సావిత్రః, అర్కః, సూర్యః, దివాకరః ౬-హస్త నక్షత్రమునకు నామములు.

చిత్రాస్యా త్త్వష్ట్రదైవత్యం త్వాష్ట్రేంద్రే సురవర్ధకమ్. 11

టీ. త్వష్ట్రదైవత్యం, త్వాష్ట్రం, ఇంద్రం, సురవర్ధకం ౪ - చిత్రాస్యాత్ = చిత్తానక్షత్రమవును.

స్వాతీ సమీరణో వాయుః పవనశ్చానిలో మరుత్,

టీ. సమీరణః, వాయుః, పవనః, అనిలః, మరుత్ ౫ - స్వాతీ = స్వాతీ నక్షత్రమునకు నామము లగును.

విశాఖం శూర్ప మైంద్రాగ్నం ద్విదైవత్యం విశాఖభమ్. 12

టీ. విశాఖం, శూర్పం, ఐంద్రాగ్నం, ద్విదైవత్యం ౪ - విశాఖభం - విశాఖ నక్షత్రము, స్యాత్ = అవును.

మిత్రం మైత్ర మనూరాధ మనూరాధస్య సంజ్ఞికమ్,

టీ. మిత్రం, మైత్రం, అనూరాధం ౩ - అనూరాధస్య = అనూరాధకు, సంజ్ఞికం = పేళ్లు.

జ్యేష్ఠేంద్రః పురుహూతశ్చ ఐంద్ర శ్శతమఖ స్తథా. 13

టీ. జ్యేష్ఠా, ఇంద్రః, పురుహూతః, ఐంద్రః, శతమఖః ౫ - జ్యేష్ఠానక్షత్రము పేళ్లు.

మూలం నిశాచరం ప్రోక్త మాసురం నిరృతి స్తథా,

నక్తంచరం కోణపం చ రాక్షసం పిశితాశనమ్. 14

టీ. మూలం, నిశాచరం, అసురం, నిరృతిః, నక్తంచరం, కోణపం, రాక్షసం, పిశితాశనం ౮ - మూలానక్షత్రము పేళ్లు.

పూర్వాషాఢా జలం తోయ ముదకం చాప ఏవచ,

టీ. పూర్వాషాఢా, జలం, తోయం, ఉదకం, అపః ౫ - పూర్వాషాఢ పేళ్లు.

ఉత్తరాషాఢా విశ్వేచ అభిజిద్వాప్రకాశకమ్. 15

టీ. ఉత్తరాషాఢా, విశ్వం ఈ ౨ ఉత్తరాషాఢ పేళ్లు. అభిజిత్, అప్రకాశకం ౨ - అభిజిత్తు పేళ్లు.

శ్రవణం వైష్ణవం శ్రీశ శ్శ్రీకాంతో మురజి ద్ధరిః,

టీ. శ్రవణం, వైష్ణవం, శ్రీశః, శ్రీకాంతః మురజిత్, హరిః ౬ - శ్రవణ నక్షత్రము పేళ్లు.

శ్ర[illegible]ష్ఠా [illegible] ష్ఠాచ వసు ర్వాసవ ఏవచ. 16

టీ. శ్రవిష్ఠా, ధనిష్ఠా, వసుః, వాసవః ౪ - ధనిష్ఠానక్షత్రము పేళ్లు.

ప్రాచేతసో జలనిధి శ్శతతారశ్చ వారుణః,

టీ. ప్రాచేతసః, జలనిధిః, శతతారః, వారుణః ౪-శతభిషఙ్నక్షత్రము పేళ్లు.

అజైకపాత్ప్రోష్ఠపదా పూర్వాభాద్ర పదా తథా. 17

టీ. అజా, ఏకపాత్, ప్రోష్ఠపదా, పూర్వాభాద్ర, పదా ౫-పూర్వభాద్ర పేళ్లు.

ఉత్తరాభాద్రకంచైవ అహిర్బుధ్న్యం నిశాముఖమ్,

టీ. ఉత్తరాభాద్రకం, అహిర్బుధ్న్యం, నిశాముఖం ౩-ఉత్తరాభాద్రను నామములు.

రేవతీ పౌష్ణ ఇత్యాహు రంత్యః పూషా తథైవ చ. 18

టీ. రేవతీ, పౌష్ణః, అంత్యః, పూషా ౪,రేవతీనక్షత్రము పేళ్లు.

నక్షత్రనిఘంటువు సంపూర్ణము.

---

## రాశినిఘంటువు

శ్లో. అజా క్రియా ఛాగబస్తా తూబరా విశ్వభేషజీ,

మేష ఆద్యా క్రియాబస్తా ఛాగీ రాగీ రయ స్తథా. 1

టీ. అజా, క్రియా, ఛాగబస్తా, తూబరా, విశ్వభేషజీ, ఆద్యా, క్రియాబస్తా ఛాగీ, రాగీ, రయః ౧౦-మేషమునకు నామములు.

వృషభ స్తాబురి ర్గౌశ్చ వృష ఉక్షా తథైవ చ,

అనడ్వాన్ సౌరభేయశ్చ దూరతోభీ వృషాహ్వయః. 2

టీ. వృషభః, తాబురిః, గౌః, వృషః, ఉక్షా, అనడ్వాన్, సౌరభేయః, దూరతోభీ ౮-వృషాహ్వయః = వృషభరాశికి నామములు.

మిథునం యమళం యుగ్మం నృయుగ్మం జితమం తథా,

టీ. మిథునం, యమళం, యుగ్మం, నృయుగ్మం, జితమం ౫-మిథునరాశి పేళ్లు.

కుళీరకర్కికటకాః కర్కిణీ నిచళీ ఝుమాన్. 3

టీ. కుళీరః, కర్కి, కటకః, కర్కిణీ, నిచళీ, ఝుమాన్ ౬-కటకరాశి పేళ్లు.

సింహో మృగారి ర్మృగరా ణ్మృగేంద్రో మృగనాయకః,

హరిః పంచాననో రాజా లేయః కంఠీరవ స్తథా. 4

టీ. సింహః, మృగారిః, మృగరాట్, మృగేంద్రః, మృగనాయకః, హరిః, పంచాననః, రాజా, లేయః, కంఠీరవః ౧౦-సింహరాశికి నామములు.

అంగనా స్త్రీ ర్వధూః కన్యా పాథోనం కన్యకాఽబలా,

టీ. అంగనా, స్త్రీః, వధూః, కన్యా, పాథోనం, కన్యకా, అబలా ౭ - కన్యారాశి నామములు.

తులా తౌలీ వణి గ్జూకః తులాభృ ద్ఘటసంజ్ఞకః, 5

టీ. తులా, తౌలీ, వణిక్, జూకః, తులాభృత్, ఘటః ౬-తులారాశి నామములు.

అళి స్సరీసృపః కౌర్పిః కీటో వృశ్చికవాచకః,

టీ. అళిః, సరీసృపః, కౌర్పిః, కీటః, వృశ్చికః ౫ - వృశ్చికరాశినామములు.

శార్ఙ్గం శరాసనం ప్రోక్తం తౌక్షికం మార్గణాసనమ్. 6

చాపతూణీరబాణాశ్చ ధనుః కోదణ్డకార్ముకే,

టీ. శార్ఙ్గం, శరాసనం, తౌక్షికం, మార్గణాసనం, చాపః, తూణీరః, బాణః, ధనుః, కోదండం, కార్ముకం ౧౦ - ధనూరాశికి నామములు.

మకరస్స్యా న్మృగో నక్ర శ్చాకోకేరశ్చ కథ్యతే. 7

టీ. మృగః, నక్రః, ఆకోకేరః ౩ - మకరః = మకరము, స్యాత్ =అవును.

కుమ్భో ఘటో జలధరో హృద్రోగ ఇతి కీర్తితః,

టీ. కుంభః, ఘటః, జలధరః, హృద్రోగః ౪ - కుంభరాశికి పేళ్లు.

మీనోఽన్త్యోఽనిమిషో మత్స్య ఝషో వారిజోఽణ్డజః. 8

జలజః పృథురోమాచ మీనసంజ్ఞాః ప్రకీర్తితాః.

టీ. మీనః, అంత్యః, అనిమిషః, మత్స్యః, ఝషః, వారిజః, అండజః, జలజః, పృథురోమా ౯ - మీనరాశికి పేళ్లు.

రాశినిఘంటువు సంపూర్ణము.

---

## గ్రహనిఘంటువు

శ్లో. ఆదిత్యోఽర్కో రవి ర్భాను ర్భాస్కరశ్చ దివాకరః,

మార్తాండ స్సవితా హేళి స్తీక్ష్ణాంశు ర్మిహిరో రవిః. 1

టీ. ఆదిత్యః, అర్కః, రవిః, భానుః, భాస్కరః, దివాకరః, మార్తాండః, సవితా, హేళిః, తీక్ష్ణాంశుః, మిహిరః ౧౧ - సూర్యునికి పేళ్లు.

చంద్ర శ్శశీ శశాంకశ్చ విధు స్సోమో నిశాకరః,

శీతాంశు రుడునాథశ్చ ఇందు శ్చంద్రమసో విధుః. 2

టీ. చంద్రః, శశీ, శశాంకః, విధుః, సోమః, నిశాకరః, శీతాంశుః, ఉడునాథః, ఇందుః ౯ - చంద్రునియొక్క నామములు.

ఆరో వక్రో మహీజశ్చ రుధిరో రక్త ఏవచ,
అంగారకః కుజో భౌమో లోహితాంగో మహీసుతః. 3

టీ. ఆరః, వక్రః, మహీజః, రుధిరః, రక్తః, అంగారకః, కుజః, భౌమః, లోహితాంగః, మహీసుతః ౧౦ - అంగారకుని పేళ్లు.

సౌమ్యో విడ్జ్ఞో బుధో హేమ స్సోమజో బోధనః క్రమాత్,

టీ. సౌమ్యః, విట్, జ్ఞః, బుధః, హేమః, సోమజః, బోధనః ౭ - బుధునికిఁ బేళ్లు.

జీవ ఆంగీరసో వాచస్పతి శ్చిత్రశిఖండిజః. 4
ఆర్యో బృహస్పతి స్సూరి ర్వాగీశో వచసాంపతిః,

టీ. జీవః, ఆంగీరసః, వాచస్పతిః, చిత్రశిఖండిజః, ఆర్యః, బృహస్పతిః, సూరిః, వాగీశః, వచసాంపతిః ౯ - బృహస్పతినామములు.

శుక్రో భృగు ర్భృగుసుత స్త్వప్పుజశ్చ సితశ్చ సః. 5
ఉశనా దైత్యపూజ్యశ్చ కావ్యః కవి రితి స్మృతః,

టీ. శుక్రః, భృగుః, భృగుసుతః, అప్పుజః, సితః, ఉశనాః, దైత్యపూజ్యః, కావ్యః, కవిః ౯ - శుక్రునినామములు.

కోణో మన్ద శ్శనిః కృష్ణ స్సూర్యపుత్రో యమశ్చ సః. 6
పంగుశ్శనైశ్చర స్సౌరిః కాల శ్ఛాయాసుతశ్చ సః,

టీ. కోణః, మందః, శనిః, కృష్ణః, సూర్యపుత్రః, యమః, పంగుః, శనైశ్చరః, సౌరిః, కాలః, ఛాయాసుతః ౧౧ - శనికినామములు.

రాహు స్తమ స్సురోగ శ్చ స్వర్భానుశ్చ విధుంతుదః. 7
పాతశ్చ సైంహికేయశ్చ భుజగాఖ్య ఇతిస్మృతః,

టీ. రాహుః, తమః, సురోగః, స్వర్భానుః, విధుంతుదః, పాతః, సైంహికేయః, భుజగాఖ్యః ౮ - రాహువు నామములు.

కేతు శ్శిఖీ ధ్వజో ధూమ్ర ఉత్పాతో బహురూపకృత్. 8
శిరోహీనో ఘోరరూప శ్చిత్రవర్ణ స్సుకేతనః,

టీ. కేతుః, శిఖీ, ధ్వజః ధూమ్రః, ఉత్పాతః, బహురూపకృత్, శిరోహీనః, ఘోరరూపః, చిత్రవర్ణః, సుకేతనః ౧౦-కేతువునకు నామములు.

గ్రహనిఘంటువు సంపూర్ణము,

---

## స్థా న ని ఘ ం టు వు

శ్లో॥ క్షితీశ ఉదయో రాశి ర్లగ్నం హోరోదయ స్తనుః,
కల్యో విలగ్న మాత్మాచ భావోఽయం ప్రథమో భవేత్. 1

టీ. క్షితీశః, ఉదయః, రాశిః, లగ్నం, హోరోదయః, తనుః, కల్యః, విలగ్నం, ఆత్మా ౯-అయం=ఇది, ప్రథమః=మొదటి దగు, భావః=స్థానము, భవేత్=అగును.

ద్వితీయం ధనవా గ్విత్తం కుటుంబం నేత్రసంజ్ఞకం,

టీ. ద్వితీయం, ధనం, వాక్, విత్తం, కుటుంబం, నేత్రసంజ్ఞకం ౬-లగ్నమునకు రెండవయింటి నామములు.

తృతీయం విక్రమం భ్రాతా దుశ్చిక్యం సహజ స్తథా. 2

టీ. తృతీయం, విక్రమం, భ్రాతా, దుశ్చిక్యం, సహజః ౫-మూఁడవయింటికిఁ బేళ్లు.

చతుర్థం హిబుకం వేశ్మ బంధు రబ్ధి స్సుఖం జలమ్,
పాతాళం జననీ మాతా ఉదకం చ పయోఽమృతమ్. 3

టీ. చతుర్థం, హిబుకం, వేశ్మ, బంధుః, అబ్ధిః, సుఖం, జలం, పాతాళం, జననీ, మాతా, ఉదకం, పయః, అమృతం ౧౩-నాలవయింటికి నామములు.

పంచమం తనయో మంత్రీ హ్యాత్మాచ సుత వుచ్యతే,

టీ. పంచమం, తనయః, మంత్రీ, ఆత్మా, సుతః ౫,అయిదవయింటికిఁ బేళ్లు.

షష్ఠం చ రిపు రిత్యాహుః క్షత ఇత్యభిధీయతే. 4

టీ. షష్ఠం, రిపుః, క్షతః ౩-ఆఱవయింటికిఁ బేళ్లు.

సప్తమం ద్యూనమ స్తం చ ద్యూతం చ మదనస్మరః,
కామో వివాహో జామిత్రం భార్యేతి వినిదర్శితమ్. 5

టీ. సప్తమం, ద్యూనం, అస్తం, ద్యూతం, మదనః, స్మరః, కామః, వివాహః, జామిత్రం, భార్యా ౧౧-ఏడవయింటికిఁ బేళ్లు.

అష్టమం నిధనం రంధ్రం పాప మాయుర్మృతీ రుజా,

టీ. అష్టమం, నిధనం, రంధ్రం, పాపం, ఆయుః, మృతిః, రుజా ౮ - ఎనిమిదవయింటికి నామములు.

నవమంచ త్రికోణంచ సుకృతం గురు భాగ్యకమ్. 6
పిత్రు జ్ఞానోదయో భక్తి ర్దేవతోపాసనం తథా,

టీ. నవమం, త్రికోణం, సుకృతం, గురుః, భాగ్యకం, పితా, జ్ఞానోదయః, భక్తిః, దేవతోపాసనం ౯ - తొమ్మిదవయింటికిఁ బేళ్లు.

దశమో మాన ఆజ్ఞాపి కర్మస్థాన మితి స్మృతః. 7
వృద్ధిః కర్మాభిధానంచ వజ్రీ సంజ్ఞయ ఉచ్యతే,

టీ. దశమః, మానః, ఆజ్ఞా, కర్మస్థానం, వృద్ధిః, కర్మాభిధానం, వజ్రీ, సంజ్ఞయః ౧౦ - పదియవయింటికి నామములు.

ఏకాదశో భవేల్లాభః ఆయశ్చ విజయ శ్శుభః. 8

టీ. ఏకాదశః, లాభః, ఆయః, విజయః, శుభః ౫ - పదునొకండవ యింటికి నామములు.

ద్వాదశంచ వ్యయస్థానం పాపస్థానం ప్రశస్యతే.

టీ. ద్వాదశం, వ్యయస్థానం, పాపస్థానం ౩ - పండ్రెండవయింటికిఁ బేళ్లు.

స్థాననిఘంటువు సంపూర్ణము.

---

## భావనిఘంటువు.

శ్లో. లగ్నం స్యా దుదయో రాశిః కల్యం హోరోదయ స్తనుః,
ఆద్యో దేహ శ్శరీరం చ విలగ్నా ధారమూర్తయః. 1
స్వభావో జన్మ చాత్మాచ భావోఽయం ప్రథమః స్మృతః,

టీ. లగ్నం, ఉదయః, రాశిః, కల్యం, హోరోదయః, తనుః, ఆద్యః, దేహః, శరీరం, విలగ్నం, ఆధారః, మూర్తిః, స్వభావః, జన్మ, ఆత్మా ౧౫ - అయం=ఇది, ప్రథమః=మొదటిదగు, భావః=భావ మని, స్మృతః=చెప్పఁబడినది.

ద్వితీయం ద్రవిణం స్వార్థా కుటుంబో ధనవేశ్మకమ్, 2
సత్యవాచికవాక్ స్థానే యుగ్మం కోశో హిరణ్యకమ్,
కర్ణప్రయాణనేత్రంచ ముఖం దక్షిణనేత్రకమ్, 3

లోహం ముక్తా ఫలం స్వర్ణం విద్యా భుక్తిస్తు కంబళీః,
రత్నం ధాతుశ్చ విత్తంచ భావోఽయం చ ద్వితీయకః.

టీ. ద్వితీయం, ద్రవిణం, స్వం, అర్థః, కుటుంబః, ధనవేశ్మకం, సత్య వాచికం, వాక్స్థానం, యుగ్మం, కోశః, హిరణ్యకం, కర్ణః, ప్రయాణం, నేత్రం, ముఖం, దక్షిణ నేత్రకం, లోహం, ముక్తాఫలం, స్వర్ణం, విద్యా, భుక్తిః, కంబళీః, రత్నం, ధాతుః, విత్తం ౨౫-ద్వితీయభావమునకు నామములు.

తృతీయం భగినీ భ్రాతా సహజ శ్చాగ్రజోఽనుజః.
సహభావః క్రుధా యోగః దాస దాస్యాదివర్గకమ్. 5
సత్వం పరాక్రమః కోపో రౌద్రం శాంత ముపాయకమ్,
కార్యసంధానమిత్రే చ స్వరో గరళభక్షణమ్. 6
ఆపోక్లీబం ధరక్షేత్రం భావోఽయం చ తృతీయకః,

టీ. తృతీయం, భగినీ, భ్రాతా, సహజః, అగ్రజః, అనుజః, సహభావః, క్రుధాయోగః, దాసదాస్యాదివర్గకం, సత్వం, పరాక్రమః, కోపః, రౌద్రం, శాంతం, ఉపాయకం, కార్యసంధానం, మిత్రం, స్వరః, గరళభక్షణం, ఆపోక్లీబం, ధరక్షేత్రం ౨౧-తృతీయభావమునకు నామములు.

చతుర్థం జలపాతాళే బంధుశ్చ హిబుకం సుఖమ్. 7
వాపీకూపతటాకాశ్చ ప్రవాహో ద్వారమేదినీ,
పుస్తకం గృహశయ్యే చ పశు స్సస్యం చ ధాన్యకమ్. 8
విద్యా వాహనకార్యే చ మాతా చౌషధమంత్రకమ్,
వివాద సాక్షీ పౌరాణాం భావోఽయం చ చతుర్థకః. 9

టీ. చతుర్థం, జలం, పాతాళం, బంధుః, హిబుకం, సుఖం, వాపీ, కూపః, తటాకః, ప్రవాహః, ద్వారం, మేదినీ, పుస్తకం, గృహం, శయ్యా, పశుః, సస్యం, ధాన్యకం, విద్యా, వాహనకార్యం, మాతా, ఔషధం, మంత్రకం, వివాదః, సాక్షీ, పౌరాః ౨౬-చతుర్థభావమునకు పేర్లు.

పంచమం మంత్రిపుత్రౌ చ తనయః ప్రతిభాత్మజౌ,
పణాపరశ్చ శక్తిశ్చ భావోఽయం పంచమస్మృతః. 10

టీ. పంచమం, మంత్రి, పుత్రః, తనయః, ప్రతిభా, ఆత్మజః, పణాపరః, శక్తిః ౮-పంచమభావమునకు పేర్లు.

షష్ఠో వైరీ రిపు శ్శత్రుః క్షతారీ రోగభీతిదమ్,
జ్ఞాతిశ్శస్త్రపణే పాపం భావ షష్ఠోఽయ మీరితః. 11

టీ. షష్ఠః, వైరీ, రిపుః, శత్రుః, క్షతః, అరిః, రోగః, భీతిః, జ్ఞాతిః, శస్త్రం. ఆపణం. పాపం ౧౨-షష్ఠభావమునకు నామములు.

జామిత్రం జూక మస్తం చ కామో భార్యేతి చ స్మరః,
కటకో ద్యూతవాణిజ్యే క్రయవిక్రయసంగ్రహాః 12
కళత్ర సౌఖ్యవైవాహం భోగస్థానం మనోహరమ్,
అలంకృతిశ్చ సర్వేషాం భావోఽయం సప్తమస్స్మృతః. 13

టీ. జామిత్రం, జూకం, అస్తం, కామః, భార్యా, స్మరః, కటకః, ద్యూతం, వాణిజ్యం, క్రయవిక్రయసంగ్రహః, కళత్రం, సౌఖ్యం, వైవాహం, భోగస్థానం, మనోహరం, అలంకృతిః ౧౬-సప్తమభావమునకుఁ బేళ్ళు.

అష్టమం నిధనం రంధ్రం మృతి ర్నాశశ్చనైధనమ్,
ఆయుష్యం జీవనోపాయో మోక్షో లయనివారణే. 14
భక్ష్యభోజ్యాదినాశశ్చ భావోఽయం చాష్టమః స్మృతః,

టీ. అష్టమం, నిధనం, రంధ్రం, మృతిః, నాశః, నైధనం, ఆయుష్యం జీవనోపాయః, మోక్షః, లయః, నివారణం, భక్ష్యభోజ్యాదినాశః ౧౨-అష్టమభావమునకుఁ బేళ్ళు,

నవమం తపదీకం చ సుకృతం గురుభాగ్యకమ్. 15
పితృజ్ఞానం దయా భక్తిర్దేవతోపాసన స్తథా,
చిత్రానంద స్తథా స్వామీ భావోఽయం నవమస్స్మృతః. 16

టీ. నవమం, తపదీకం, సుకృతం, గురుః, భాగ్యకం, పితృజ్ఞానం, దయా, భక్తిః, దేవతోపాసనం, చిత్రం, స్వామీ ౧౨-నవమభావమునకు నామములు.

దశమం మానసం కర్మ వ్యాపారోఽంబరమేవ చ,
కార్యంచ వ్యోమ చాకాశః ఆజ్ఞా పుణ్యంచ రాజ్యకమ్. 17
వీర్యస్థానం చ సత్కర్మ భావోఽయం దశమస్స్మృతః,

టీ. దశమం, మానసం, కర్మ, వ్యాపారః, అంబరం, కార్యం, వ్యోమ, ఆకాశః, ఆజ్ఞా, పుణ్యం, రాజ్యకం, వీర్యస్థానం, సత్కర్మ ౧౩-దశమభావమునకు నామములు.

ఏకాదశం భవత్యాయ శ్చార్థలాభో జయ స్తథా. 18
అధఃపృష్ఠం చ పృష్ఠం చ భావశ్చైకాదశ స్స్మృతః,

టీ. ఏకాదశం, ఆయః, అర్థలాభః, జయః, అధఃపృష్ఠం, పృష్ఠం ౬-ఏకాదశభావమునకుఁ బేళ్లు.

ద్వాదశోఽంతో వ్యయో రిష్ఫః ఆపోక్లీబోఽపవర్గకః. 19

లాక్షీణో నరకో నాశో భావోఽయం ద్వాదశ స్మృతః,

టీ. ద్వాదశః, అంత్యః, వ్యయః, రిష్ఫః, అపోక్లీబః, అపవర్గకః, లాక్షీణః, నరకః, నాశః ౯-ద్వాదశభావమునకు నామములు.

భావనిఘంటువు సంపూర్ణము.

---

## కా ర క ని ఘ ం టు వు

ఆత్మా ప్రభావ శ్శక్తిశ్చ పిత్రుచిన్తా రవేః ఫలమ్,

టీ. ఆత్మా, ప్రభావః, శక్తిః, పిత్రుచింతా ఈ ౪-కారకత్వములు. రవేః = సూర్యునికిని, ఫలమ్ = ఫలము.

మనో బుద్ధిః ప్రసాదం చ మాతృచింతా చ చంద్రమాః. 1

టీ. మనః, బుద్ధిః, ప్రసాదం, మాతృచింతా ఈ ౪-కి, చంద్రమాః = చంద్రుఁడు కారకుఁడు.

భ్రాతా భృత్యగుణో భూమి ర్భౌమేనైవ విచింతయేత్,

టీ. భ్రాతా, భృత్యగుణః, భూమిః ఈ మూఁటికిని, భౌమేనైవ=అంగారకుని చేతనే, విచింతయేత్ = కారకత్వము తెలియవలెను.

ప్రజ్ఞాచ కర్మ విజ్ఞానం బుధేనైవ విచింతయేత్. 2

టీ. ప్రజ్ఞా, కర్మ, విజ్ఞానం ఈమూఁడును, బుధేనైవ = బుధునిచేతనే, విచింతయేత్ = కారకుఁడని తెలుసుకొనవలసినది.

గురుణా దేహపుష్టిశ్చ బుద్ధిః పుత్రార్థసంపదః,

టీ. దేహపుష్టిః, బుద్ధిః, పుత్రః, అర్థసంపదః ఈ ౪-కి, గురుణా = గురువు చేత కారకత్వమని తెలుసుకొనవలసినది.

శుక్రో వివాహో భాగ్యంచ భోగస్థానం చ వాహనమ్. 3

టీ. వివాహం, భాగ్యం, భోగస్థానం, వాహనం ఈ ౪-కి, శుక్రః = శుక్రుఁడు, కారకుఁడని తెలిసికొనవలసినది.

ఆయుష్యం జీవనోపాయం మరణం చ శనైశ్చరః,

టీ. ఆయుష్యం, జీవనోపాయం, మరణం ఈ 3-కి, శనైశ్చరః=శనైశ్చరుఁడు, కారకుఁడని తెలుసుకొనవలసినది.

తటాకారామవిశ్రామా రాహు ర్మాతామహో భవేత్. 4

టీ. తటాకః, ఆరామః, విశ్రామః, మాతామహః ఈ ౪-కి, రాహుః = రాహువు, భవేత్ = కారకుఁడవును.

కేతుః పితామహే చిన్తా బహుందానశ్చ మోక్షదః,

టీ. పితామహచింతా, బహుదానః, మోక్షదః ఈ ౩-కి, కేతుః = కేతువు కారకుఁడు.

కారకనిఘంటువు సంపూర్ణము.

---

## సంఖ్యానిఘంటువు

శ్లో. శశీ సోమ శ్శశాంకశ్చ ఇందు శ్చంద్రః కళానిధిః,
రాజా విధు స్సుధాంశుశ్చ యమ ఏకో జన స్తథా. 1

టీ. శశీ, సోమః, శశాంకః, ఇందుః, చంద్రః, కళానిధిః, రాజా, విధుః, సుధాంశుః, యమః, ఏకః, జనః, ౧౨-ఒకయంకెకు నామములు.

అక్షి చక్షుః కరో నేత్రం లోచనం బాహు కర్ణకాః,
పక్ష దృష్టి ద్వయం యుగ్మ మంబకౌ నయనేక్షణే. 2

టీ. అక్షి, చక్షుః, కరః, నేత్రం, లోచనం, బాహుః, కర్ణకః, పక్షః, దృష్టిః, ద్వయం, యుగ్మం, అంబకౌ, నయనే, ఈక్షణే ౧౪-రెండవయంకెకు నామములు.

వహ్ని రామ శ్శిఖి చాగ్నిః పావకో దహనానలౌ,
శంకరాక్షి పురీ లోకా స్త్రీణి కాల స్త్రయో గుణాః. 3

టీ. వహ్నిః, రామః, శిఖీ, అగ్నిః, పావకః, దహనః, అనలః, శంకరాక్షి, పురీ, లోకః, త్రీణి, కాలః, త్రయః, గుణః ౧౪-మూడవయంకెకు నామములు.

అబ్ధి సాగర చత్వారి వనరాశి ర్యుగో౽ంబుధిః,
చతు ర్వార్ధి ర్గతిశ్చాపి జలధి ర్నీరధి స్తథా. 4

టీ. అబ్ధిః, సాగరః, చత్వారి, వనరాశిః, యుగః, అంబుధిః, చతుః, వార్ధిః, గతిః, జలధిః, నీరధిః ౧౧-నాలవయంకెకు నామములు.

ఇంద్రియం పంచమం జ్ఞాన మిషు ర్బాణశ్చ మార్గణః,
వ్రతో భూతం శరః పర్వా ప్రాణశ్చ విషయ స్తథా. 5

టీ. ఇంద్రియం, పంచమం, జ్ఞానం, ఇషుః, బాణః, మార్గణః, వ్రతః, భూతం, శరః, పర్వా, ప్రాణః, విషయః ౧౨-అయిదవయంకెకు నామములు.

శాస్త్రం షట్చ రుచిశ్చైవ కాలశ్చ ఋతుసంజ్ఞకం,
రసద్రవ్యం చ కోశశ్చ షడ్దర్శనషడాగమా. 6

టీ. శాస్త్రం, షట్, రుచిః కాలః, ఋతుః, రసద్రవ్యం, కోశః, షడ్దర్శనః, షడాగమః ౬-ఆఱవయంకెకు నామములు.

శైలోఽద్రిర్ద్వీపవాయుశ్చ మునిస్సప్తాచలో గిరిః,
తురగాశ్వ నగా గోత్రా మహీధ్ర ఋషిసంజ్ఞకః. 7

టీ. శైలః, అద్రిః, ద్వీపః, వాయుః, మునిః, సప్త, అచలః, గిరిః, తురగః, అశ్వః, నగః, గోత్రః, మహీధ్రః, ఋషిః ౭-ఏడవయంకెకు నామములు.

అష్టమం గజః కర్ణీ చ దిగ్గజో దంతి హస్తినో,
సామజో మత్తమాతంగః దిక్పాల వసు వారణాః. 8

టీ. అష్టమం, గజః, కర్ణీ, దిగ్గజః, దంతీ, హస్తీ, సామజః, మత్తమాతంగః, దిక్పాలః, వసుః, వారణః ౮-యెనిమిదవయంకెకు నామములు.

నవమం నవరత్నం చ బ్రహ్మా చ కమలాసనః,
నిధిర్గ్రహాశ్చ ఖండం చ రంధ్రో భావశ్చ లబ్ధకః. 9

టీ. నవమం, నవరత్నం, బ్రహ్మా, కమలాసనః, నిధిః, గ్రహః, ఖండం, రంధ్రః, భావః, లబ్ధకః ౯-తొమ్మిదవయంకెకు నామములు.

ఆకాశం గగనం శూన్య మంతరిక్షం మరుత్పథమ్,

టీ. ఆకాశం, గగనం, శూన్యం, అంతరిక్షం, మరుత్పథం ౫-శూన్యమునకు (౦) పేళ్లు.

కాదిర్నవో టాదినవః పాదిపంచ చ యాద్యష్టకమ్. 10

టీ. కకారము మొదలు తొమ్మిదియక్షరముల పర్యంతమును, టకారము మొదలు తొమ్మిదియక్షరముల పర్యంతమును, పకారము మొదలు అయిదక్షరముల పర్యంతమును, యకారము మొదలెనిమిదియక్షరముల పర్యంతమును అక్షరసంజ్ఞ వర్గములని తెలిసికొనుట. యెట్లనిన: క ౧, ఖ ౨, గ ౩, ఘ ౪, ఙ ౫, చ ౬, ఛ ౭, జ ౮, ఝ ౯; ట ౧, ఠ ౨, డ ౩, ఢ ౪, ణ ౫, త ౬, థ ౭, ద ౮, ధ ౯; ప ౧, ఫ ౨, బ ౩, భ ౪, మ ౫; య ౧, ర ౨, ల ౩, వ ౪, శ ౫, ష ౬, స ౭, హ ౮. *

సంఖ్యానిఘంటువు సంపూర్ణము.

---

* ఇచట సంఖ్యానిఘంటువు పూర్తిగ లేదు. విద్యారణ్యపంచాననక విశాల రామచంద్రాచార్యవిరచితంబగు సంఖ్యానుశాసనమునపూర్తిగను సహేతుకముగను కనుగొనదగు.

## రాశిరాశ్యధిపతులు

క్రియతాబురిజితుమకులీరలేయపాథోనజూకకౌర్పా ఖ్యాః,
తౌక్షిక ఆకోకేరో హృద్రోగశ్చాంత్యభంచేతి. 1
క్షితిజ సిత జ్ఞ చంద్రో రవిసౌమ్యసితావనిజాః,
సురగురు మంద సౌరి గురవశ్చ గృహాంశకపాః. 2

టీ. మేషమునకు అంగారకుఁడు, వృషభమునకు శుక్రుఁడు, మిథునమునకు బుధుఁడు, కటకమునకు చంద్రుఁడు సింహమునకు సూర్యుఁడు, కన్యారాశికి బుధుఁడు, తులకు శుక్రుఁడు, వృశ్చికమునకు అంగారకుఁడు, ధనుస్సునకుఁ గురువు, మకరమునకు శని, కుంభమునకు శని, మీనమునకు గురువు ఈక్రమముగా రాశ్యధిపతుల దెలియంగవలయు.

## శత్రుత్వమిత్రత్వములు

సూత్రమ్. సుహృద స్త్రికోణభవనాత్స్వ త్స్వాంత్యధీధర్మ స్వో చ్చాయుస్సుఖపాః.

టీ. సూర్యునికి-శని, శుక్రుఁడు శత్రువులు బుధుఁడు సముఁడు. చంద్రుఁడు, కుజుఁడు, గురువు, మిత్రులు. ౨. చంద్రునికి-రవి, బుధుఁడు, మిత్రులు. శు, గు, కు, శ, సములు. 3. కుజునికి-గు, చం, ర, మిత్రులు. బు, శత్రువు. శు, శ, సములు. ౪. బుధునికి-ర, శు, మిత్రులు. చం, శత్రువు. కు, గు, శ, సములు. ౫. బృహస్పతికి-బు, శు, శత్రువులు. శ, సముఁడు. ర, చం, కు, మిత్రులు. ౬. శుక్రునికి-బు, శ, మిత్రులు. కు, గు, సములు. ర, చం, శత్రువులు. ౭. శనికి, శు, బు, మిత్రులు. గు, సముఁడు. ర, చం, కు, శత్రువులని తెలియవలెను.

## ఉచ్చనీచలు

అజోక్షనక్రపాథోన కర్కిమత్స్యతులాక్రమాత్,
రవ్యాదితుంగా నీచం తు తత్తత్సప్తమ మాహరేత్. 3

టీ. రవికి మేషము, చంద్రునికి వృషభము, కుజునికి మకరము, బుధునికి కన్య, గురునకు కటకము, శుక్రునికి మీనము, శనికి తుల ఇవి యుచ్చరాసులు. ఈరాసులకు నేడవరాశి నీచరాసులని తెలియవలెను.

## గ్రహదృష్టి

సూ. నగథామథజఢ నేక్షణమ్. *

టీ. శనికి 3, ౭, ౧౦. గురువునకు ౫, ౭, ౯. కుజునికి ౪, ౭, ౮. ర, చం, బు, శు, రా, కేతువులకు నేడవయింటను చూపు ప్రసరించును. శుభగ్రహముల చూపు మంచిది, పాపగ్రహములచూపు చెడ్డది.

## షడ్వర్గ

సూ. ఓజయుగ్మ రవిచంద్రా హోరేయం *

టీ. లగ్నము రెండుభాగములుచేయఁగా బేసిరాశి మొదటిభాగము రవి హోర. రెండవభాగము చంద్రహోర. సమరాశికి మొదలు చంద్రహోర. రెండవది సూర్యహోర యని తెలియవలెను.

సూ. లగ్నా త్త్రిభాగో ద్రేక్కాణః *

టీ. లగ్నము మూఁడుభాగములుచేసి చరరాశికి మొదటిభాగమునకు లగ్నము. రెండవభాగమునకు అయిదవయిల్లు. మూఁడవభాగమునకు తొమ్మిదవయిల్లు. స్థిరరాశి మొదటిభాగమునకు తొమ్మిదవయిల్లు. రెండభాగమునకు మొదటియిల్లు. మూఁడవభాగమునకు అయిదవయిల్లు. ద్విస్వభావరాశికి మొదటిభావమునకు అయిదవయిల్లు. రెండవభాగమునకు తొమ్మిదవయిల్లు. మూఁడవభాగమునకు లగ్నము. ఇట్లు తెలియవలెను.

సూ. నవాంశో నవమాంశపః, అజమృగతౌళిచంద్రభవనాదిః. *

టీ. నవాంశకు లగ్నము తొమ్మిదిభాగములుచేసి ఎన్నవభాగములో జననమో, ఆభాగము మేషసింహధనుస్సులకు మేషాదిగాఁ జూచుకొనునది. తులాకుంభమిథునములకు తులాదిగాఁ జూచుకొనునది. కన్యామకరవృషభములకు మకరాదిగాఁ జూచుకొనునది. మీన కర్కటవృశ్చికములకు కర్కాటకము మొదలుగా నాభాగమునకు నేరాశియగునో ఆరాశి నవాంశరాశియని తెలియఁదగు.

సూ. రయభాగో ద్వాదశాంశః. *

టీ. ద్వాదశాంశకు లగ్నము ౧౨ భాగములు చేయఁగా నేభాగమందు కాలము నిలుచునో లగ్నాదిగా నారాశ్యధిపతి ద్వాదశాంశాధిపతియని తెలియవలెను.

సూ. త్రింశాంశపాః భౌమమందగురుజ్ఞశుక్రాః మూమూదాసా మ ఓజేయుగ్మేతు వక్రమ్.

టీ. లగ్నము౩౦ భాగములుజేసి, ఆభాగములను కుజునికి ౫, శనికి ౫, గురునకు ౮, బుధునికి ౭, శుక్రునికి ౫ ఈక్రమమున నీయఁగా, ముహూర్తకాలమునకు నేగ్రహభాగములో నుండునో వాఁడు త్రింశాంశాధిపతియని తెలిసికొనునది. ఇది బేశిరాశి క్రమము. సమరాశికిశుక్రుఁడు మొదలుకొని కుజునివరకు వ్యుత్క్రమముగాఁ జూడవలెను.

## రాహుకాలము

సూ. విధుసౌరిభృగుసుతజ్ఞజీవభౌమార్కాః, త్రిపాదత్రిణివృద్ధిః.

టీ. సోమవారము ౩౻, శనివారము ౭౻, శుక్రవారము ౧౧।, బుధవారము ౧౫, గురువారము ౧౮౻, మంగళవారము ౨౨౺, ఆదివారము ౨౬।, ఈ వారములలో నీగడియలమీఁదట రాహుకాలము.

### నక్షత్ర త్యాజ్యములు

నైశం వీర నలం నభో భయ కరం నీలం నరం ఫాలినా,
గో నీరం హాయ కారి నీర భయ భోపా నేక భేకం తమః. 4

వారం నీర నకం నయం హాయ తపో వారం నగం దస్రతః,
సంఖ్యోర్ధ్వంవిషనాడికాహ్యాదధ యోలగ్నస్పృశో మృత్యుదాః. 5

టీ. అశ్విని ౫౦, భరణి ౨౪, కృత్తిక, ౩౦, రోహిణి ౪౦, మృగశిర ౧౪, ఆర్ద్ర ౨౧, పునర్వసు ౩౦, పుష్య ౨౦, ఆశ్లే ౩౨, మఖ ౩౦, పూఫ ౨౦, ఉఫ ౧౮, హ ౨౧, చి ౨౦, స్వా ౧౪, వి ౧౪, అనూ ౧౦, జ్యే ౧౪, మూ ౫౬, పూషా ౨౪, ఉషా ౨౦, శ్రవ ౧౦, ధ ౧౦, శత ౧౮, పూభా ౧౬, ఉభా ౨౪, రేవతి ౩౦. ఈనక్షత్రములకు నీగడియల మీఁద త్యాజ్యము ౪ ఘడియలవరకు నుండును. అప్పుడు ఏశుభకార్యములును చేయఁగూడదు. ఇచ్చట ౪ గడియలు వర్జ్యమనుట నక్షత్ర ప్రమాణములో పదునాఱవపాలు అని ఎన్నుకొనవలయును సిద్ధాంతశాస్త్రిక కంఠ్యముకొఱకై.

### పక్షచ్ఛిద్రములు.

అష్టమీ ద్వాదశీ షష్ఠీ చతుర్థీ చ చతుర్దశీ,
పక్షచ్ఛిద్రాశ్చ తిథయ శ్శుభకార్యేషు నిందితాః. 6

టీ. శుక్లకృష్ణపక్షములయందు ౮, ౧౨, ౬, ౪, ౧౪ ఈతిథులు పక్షచ్ఛిద్రములు. వీనిలో శుభకార్యములు చేయఁగూడదు.

### జాతకర్మ

తస్మిన్ జన్మముహూర్తేఽపి సూతకాంతేఽథవా శిశోః,
కుర్యాద్వై జాతకర్మాఖ్యం పితృపూజనతత్పరః. 7

టీ. జననకాలముహూర్తమందు మగశిశువునకుఁగాని, ఆఁడుశిశువునకుఁగాని జాతకర్మము చేయవలసినది.

### నామకరణము

ఉత్తరాత్రితయహస్తవారుణత్వాష్ట్రవైష్ణవపునర్వసుద్వయమ్,
పౌషమూలమృగవాసవాజిభైర్నామకర్మ శుభదంవిధుర్బుధాః. 8

టీ. ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, హస్త, శతభిష, చిత్ర, శ్రవణ, పునర్వసు, పుష్యమి, రేవతి, మూల, మృగశిర, ధనిష్ఠ, అశ్విని ఈనక్షత్రములు నామకరణమునకు మంచివి.

### అన్నప్రాశనము

ఆదిత్య సౌమ్య వసు తిష్య కరాని లాశ్వి
మైత్రాఖ్య విష్ణు వరుణోత్తర భాను చిత్రాః,

బాలాన్న భోజనవిధౌ దశమేచ శుద్ధే
ఛిద్రాన్విహాయ నవమీం తిథయశ్శుభాస్స్యుః. 9

టీ. పునర్వసు, మృగశిర, ధనిష్ఠ, పుష్యమి, హస్త, స్వాతి, అశ్వినీ, అనూరాధా, శ్రవణం, శతభిషం, ఉత్తర ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, చిత్త ౧౪ ఉత్తమనక్షత్రములు. ౮, ౧౨, ౬ ౪, ౧౪, ౧౫, ౩౦, ౯ ఈ తిథులుతప్ప మిగిలిన తిథులందును, దశమ శుద్ధిగల లగ్నమందును అన్నప్రాశనముఁ జేయవలసినది.

## చెవులుకుట్టుట

హరిహరకరచిత్రాసౌమ్యపౌష్ణోత్తరాద్యా
దితివసుషు ఘటాళీసింహలగ్నే వివర్జ్యే,
శశిబుధగురుశుక్రాణాం సితే పర్వరిక్తే
రహతిథిషు విశుద్ధే నైధనే కర్ణవేధః. 10

టీ. శ్రవణం, ఆర్ద్ర, హస్త చిత్త, మృగశిర, రేవతీ, ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, పుష్యమి, పునర్వసు, ధనిష్ఠ ఈ ౧౨ నక్షత్రములందును; కుంభ, వృశ్చిక, సింహరాసులు గాక మిగతరాసులయందును; సో, బు, గు, శు, ఈవారములందును; శుక్లపక్షమునందును; పంచపర్వములును; రిక్తతిథులును పోను మిగిలిన ౨, ౩, ౫, ౭, ౧౦, ౧౩ ఈతిథులలో అష్టమశుద్ధిగల లగ్నమందును కర్ణవేధము శుభము.

## పుట్టువెంట్రుకలు తీయుట

అశ్వి పుష్యపునర్వసూ మృగశిర స్వాత్యంత్యవిష్ణుత్రయమ్,
చంద్రజ్ఞామరపూజ్యశుక్ర సహితాః పూర్ణాజయాఖ్యాశ్శుభాః,
పూర్వాహ్ణే శుభలగ్నహోరదివసే యుగ్మేచ మాసే శిశోః
కేశచ్ఛేదన మిష్టదం మునివరై రుక్తం వరాహాదిభిః. 11

టీ. అశ్వినీ, పుష్యమీ, పునర్వసు, మృగశిర, స్వాతి, రేవతీ, శ్రవణం, ధనిష్ఠ, శతభిషము ఈ ౯ నక్షత్రములయందును; సో, బు, గు, శుక్రవారములయందును; ౨, ౩, ౫, ౭, ౮, ౧౦, ౧౩ ఈతిథులయందును; పూర్వాహ్ణమందును; శుభలగ్నములయందును; శుభహోరలయందును; యుగ్మమాసములయందును కేశఖండనము చేయవచ్చునని వరాహాదిమునులచేఁ జెప్పఁబడినది.

## క్షౌరమునకు

పుష్యపునర్వసు రేవతిహస్తాశ్రవణధనిష్ఠమృగాశ్వినిచిత్రా,
వాసవవారుణవాయుసమేతం ద్వాదశబుక్షం క్షౌరప్రశస్తమ్. 12

టీ. పుష్యమి, పునర్వసు, రేవతీ, హస్త, శ్రవణ, ధనిష్ఠ, మృగశిర, అశ్వినీ, చిత్త, జ్యేష్ఠ, శతభిషం, స్వాతీ ఈ ౧౨ నక్షత్రములయందు క్షౌరము చేసికొనవచ్చును.

మాతుశ్చతుర్థీ భగినీ చతుర్దశీ భ్రాతుశ్చ షష్ఠీ పితురేవ పర్వసు,
ఆదౌ నవమ్యాం ధనధాన్యనాశంకుటుంబహానిర్వ్యపనేన చాష్టమీ.

టీ. చవితియందు క్షౌరము మాతృహాని. చతుర్దశియందు క్షౌరము భగినీహాని, షష్ఠియందు భ్రాతృహాని. పితృదినములయందు పితృహాని. పాడ్యమియందు ధనహాని. నవమియందు ధాన్యహాని. అష్టమియందు కుటుంబహాని.

## అక్షరస్వీకరణము

హస్తాదిత్యసమీరమిత్రపురజిజ్జ్యేష్ణాశ్విచిత్రాచ్యుతే
ష్వారార్కార్కజవాసరాదిరహితే రాశౌ చరే చోభయే. 14
పక్షే పూర్ణనిశాకరే ప్రతిపదం రిక్తాం విహాయాష్టమీమ్
షష్ఠీ మష్టమశుద్ధిభాజి భవనే ప్రోక్తాక్షరస్వీకృతిః. 15

టీ. హస్త, పునర్వసు, స్వాతి, అనూరాధ, జ్యేష్ఠ, రేవతి, అశ్వినీ, చిత్త, శ్రవణం ఈ ౯ నక్షత్రములయందును, మంగళవారము, ఆదివారము, శనివారము ఈ 3 వారములు వదిలి చరరాసులయందును, ఉభయరాసులయందును, శుక్లపక్షమందును, పూర్ణచంద్రునియందును, ౯, ౧౪, ౪, ౬, ౧౫, ౩౦, ఈ తిథులనువదిలి అష్టమశుద్ధిగల లగ్నమందును మూఢదోషములు లేనప్పుడును అక్షరస్వీకారము చేయవచ్చును.

## ఉపనయన ప్రకరణము

చన్ద్రాదిత్యోత్తరాశ్వి శ్రవణవసుమరుత్త్వష్టృపౌష్ణార్కమిత్ర
ప్రాజేశార్ద్రేషు సౌమ్యగురుశశిభృగువారాంశకే షూపనీతః. 16
త్యక్త్వానధ్యాయరిక్తాః పితృతిథిషు యమారార్కయుక్తాన్యరాశౌ
గోజోపాన్త్యాఙ్గనాకర్కటతులమిథునే ష్వష్టమే ధామ్ని శుద్ధే. 17

టీ. మృగశిర, పునర్వసు, ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, అశ్వినీ, శ్రవణం, ధనిష్ఠ, స్వాతి, చిత్త, రేవతి, హస్త, అనూరాధ, రోహిణి, పుష్యమి ఈ ౧౫ నక్షత్రములయందును బుధ, గురు, శుక్ర, సోమవారములయందును, మేషము, వృషభము, మీనము, కన్య, కర్కాటకము, తుల, మిథునము ఈరాసులయందును, అష్టమశుద్ధియందును ఉపనయనము చేయవచ్చును. అనధ్యాయదినములందును, రిక్తతిథులందును, పితృదినములందును, శని, రవి, కుజులు గూడియుండు రాసులందును చేయఁగూడదు.

కేంద్రత్రికోణోపచయ శ్శుభై స్త్ర్యాయారిగైః పరైః,
లగ్నషష్ఠాష్టజాస్త్యేన చంద్రేణ ప్రశ మీరితమ్ 18

టీ. శుభగ్రహములైన గురు, శుక్ర, బుధ, పూర్ణచంద్రులు కేంద్రత్రికోణము లందును, పాపులైన కుజ, రవి, శనులు మూఁడవయింట, ఆఱవయింట, పదునొకొండవయింట ఉండవలసినది. చంద్రుఁడు లగ్నమందును, ఆఱవయింటను, పండ్రెండవయింటను ఉండఁగూడదు.

లగ్నాత్కేంద్రగతే రవౌ స్ఫుజిత ఇత్యాచార్యశిష్యౌ వ్రతే
భామే కూజితనామకస్తు జననీం హంత్యేవ మన్దే కులమ్. 19
దోషోఽయం రుధిరాభిధ స్తమసి చే దుగ్రాభిధో బాలకమ్
రంధ్రాఖ్యః పితరం ధ్వజే దశనగత్కోణ్యబ్ధికేంద్రాభిధా. 20

టీ. లగ్నాదికేంద్రములందు సూర్యుఁడుండిన స్ఫుజితదోషము. ఇది ఆచార్య శిష్యులను జంపును. అందు కుజుఁడుండిన కూజితదోషము. ఇది తల్లినిఁ జంపును. అందు శనియుండిన రుధిరదోషము. ఇది తనకులమునంతయు జంపును. అందు రాహువుండిన ఉగ్రదోషము. అది వటువును. జంపును. అందు కేతువుండిన రంధ్రదోషము. అది తండ్రినిఁజంపును. మొదటిరాశి, నాలవరాశి, యేడవరాశి, పదవరాశి ఇవి కేంద్రములు. కోణములనఁగా అయిదవరాశి, తొమ్మిదవరాశి యని యెఱుంగవలయును.

## వివాహపొంతనములు, దినపొంతనము.

కన్యాదివరభుక్తాంతం గణయే న్నవసంఖ్యయా,
సమాంత్యతారకం శ్రేష్ఠం దినకూటం ప్రశస్యతే. 21

టీ. స్త్రీనక్షత్రము మొదలు పురుషనక్షత్రమువరకు, తొమ్మిదితొమ్మిదిగా నెంచఁగా, అందు సమసంఖ్యగానుండిన శుభము తారాబలమువలె చూడవలయు,

## గణకూటము,

పునర్వసుద్వయం స్వాతీకరశ్రవణతారకాః,
పౌష్ణమైత్రేందుదస్రాఖ్యా స్తారా దేవగణా స్స్మృతాః. 22

టీ. పునర్వసు, పుష్యమి, స్వాతీ, హస్త, శ్రవణం, రేవతి, అనూరాధ, మృగశిర, అశ్వినీ ఈ ౯-దేవగణనక్షత్రములు.

రోహిణీ త్రీణి పూర్వాణి భరణీ రౌద్రమేవ చ;
త్రీణ్యుత్తరాశ్చ విజ్ఞేయా మానుషాః పరికీర్తితాః. 23
సూ. శేషాణి రాక్షసాని,

టీ. రోహిణీ, పుబ్బ, పూర్వాషాఢ, పూర్వాభాద్ర, భరణీ, ఆర్ద్ర, ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర ఈ ౯-మనుష్యగణనక్షత్రములు. మిగిలిన ౯-రాక్షసగణనక్షత్రములు. అందు ఏకగణ ముత్తమము. దైవమానుషము మధ్యమము. రాక్షసదైవము అధమము. మానుషరాక్షసములు దంపతులకు మృత్యువు నిచ్చును.

### మహేంద్రపొంతనము

వధ్వాదీనాం చతుస్సప్త దశమంచ త్రయోదశ,
షోడశైకోనవింశశ్చ ద్వావింశః పంచవింశతిః. 24
ఏతే మాహేంద్రయోగా స్స్యు ర్వివాహేషు ప్రశస్యతే,

టీ. స్త్రీనక్షత్రము మొదలు పురుషనక్షత్రమువరకు నెంచగా ౪, ౭, ౧౦, ౧౩, ౧౬, ౧౯, ౨౨, ౨౫ ఈ యంకెలు వచ్చినట్లైతే శుభము.

### స్త్రీదీర్ఘపొంతనము

త్రయోదశభవా దూర్ధ్వం స్త్రీదీర్ఘ మతిశోభనమ్. 25

టీ. స్త్రీనక్షత్రము మొదలు పదుమూఁడునక్షత్రములమీఁద పురుషనక్షత్రముండిన నతిశుభము.

### రాశిపొంతనము

ద్వికద్వాదశగే మృత్యు రాయు ర్ద్వాదశగే ద్విగే,
తృతీయైకాదశం దుఃఖం సుఖ మేకాదశం త్రికమ్. 26
నీచం చతుర్థదశమం ధనం దశచతుర్థకే,
శుభంచ పంచనవమమశుభం నవపంచకమ్. 27

షష్ఠాష్టకే పుత్రనాశః పుత్రలాభోఽష్టషష్ఠకే,
సమసప్తేతు మాంగల్యం దంపత్యోః ప్రీతివర్ధనమ్. 28

టీ. స్త్రీరాశి మొదలు ౨, పురుషరాశి మొదలు ౧౨, ఉండిన మృత్యువు నిచ్చును. స్త్రీరాశ్యాది ౧౨, పురుషరాశ్యాది ౨ ఉండిన ఆయుర్వృద్ధి. స్త్రీరాశ్యాది ౩, పురుషరాశ్యాది, ౧౧, ఉండిన దుఃఖము. స్త్రీరాశ్యాది ౧౧, పురుషరాశ్యాది ౩ ఉండిన సుఖము. స్త్రీరాశ్యాది ౪, పురుషరాశ్యాది ౧౦ ఉండిన నీచము. స్త్రీరాశ్యాది ౧౦, పురుషరాశ్యాది ౪ ఉండిన ధనప్రాప్తి. స్త్రీరాశ్యాది ౫, పురుషరాశ్యాది ౯ ఉండిన శుభము. స్త్రీరాశ్యాది ౯, పురుషరాశ్యాది ౫ ఉండిన అశుభము. స్త్రీరాశ్యాది ౬, పురుషరాశ్యాది ౮ ఉండినను పుత్రనాశనము. స్త్రీరాశ్యాది ౮, పురుషరాశ్యాది ౬ ఉండిన పుత్రలాభము. స్త్రీరాశ్యాది ౭, పురుషరాశ్యాది ౭ ఉండిన మాంగల్యవృద్ధి. దంపతుల కన్యోన్యానురాగమని తెలియవలయు.

రజ్జుకూటము.

అశ్విసార్పమఖాజ్యేష్ఠామూలాంత్యం పాదరజ్జవః,
యమార్యభాగ్యమైత్రాప్య మహిర్బుధ్న్యాః కటీరితాః. 29
అగ్న్యదితోత్తరాశూర్పావిశ్వప్రోష్ఠపదోదరే,
బ్రహ్మరుద్రకరస్వాతిశ్రవణా వారుణం తథా. 30
కంఠదేశే విజానీయా ద్వసుచిత్రేందుమస్తకమ్,
ముఖే పతిం గళే కన్యాం కుక్షౌ సస్యాత్మజాన్హరేత్. 31
దరిద్రతా భవేత్కట్యాం పాదే వా భ్రమణం తథా.

టీ. అశ్విని, ఆశ్రేష, మఖ, జ్యేష్ఠ, మూల, రేవతి ఈ ౬ పాదరజ్జునక్షత్రములు. భరణి, పుష్యమి, పుబ్బ, అనూరాధ, పూర్వాషాఢ, ఉత్తరాభాద్ర ఈ ౬ కటిరజ్జునక్షత్రములు. కృత్తిక, పునర్వసు, ఉత్తర, విశాఖ, ఉత్తరాషాఢ, పూర్వాభాద్రము ఈ ౬ ఉదరరజ్జునక్షత్రములు. రోహిణి, ఆర్ద్ర, హస్త, స్వాతి, శ్రవణం, శతభిషం ఈ ౬ కంఠరజ్జునక్షత్రములు. మృగశిర, చిత్త, ధనిష్ఠ, ఈ ౩-శిరోరజ్జునక్షత్రములు. ఫలము, శిరోరజ్జువు పతిని జంపును. కంఠరజ్జువు స్త్రీని జంపును. ఉదరరజ్జువు సస్యాదినాశనమును జేయును. కటిరజ్జువు దారిద్ర్యము నిచ్చును. పాదరజ్జువు వ్యభిచారమునుగలుగఁజేయును.

నాడీపొంతనము.

అశ్విన్యార్ద్రాపునర్వస్వ ఉత్తరా జ్యేష్ఠ హస్తభమ్. 32
మూలవారుణతోయంచ పార్శ్వనాడీ నవస్మృతమ్,

టీ. అశ్విని, ఆర్ద్ర, పునర్వసు, ఉత్తర, జ్యేష్ఠ, హస్త, మూల, శతభిషము, పూర్వాభాద్ర ఈ ౯-ప్రథమపార్శ్వ నాడీనక్షత్రములు.

భరణీందు ర్గురు ర్భాగ్యం చిత్రానూరాధ పూషభమ్, 33
శ్రవిష్ఠా చోత్తరాభాద్రా మధ్యనాడీ నవ స్మృతమ్,

టీ. భరణి, మృగశిర, పుష్యమి, పుబ్బ, చిత్త, అనూరాధ, పూర్వాషాఢ, ధనిష్ఠ, ఉత్తరాభాద్ర ఈ ౯-మధ్యైక నాడీనక్షత్రములు.

కృత్తికా విధి రాశ్రేషా పితృస్వాతీ విశాఖభమ్. 34
ఉత్తరాషాఢ విష్ణ్వృక్షే హ్యంత్యనాడీ తు పార్శ్వకే,

టీ. కృత్తిక, రోహిణి, ఆశ్రేష, మఖ, స్వాతి, విశాఖ, ఉత్తరాషాఢ, శ్రవణం, రేవతి ఈ ౯-ద్వితీయపార్శ్వనాడీనక్షత్రములు. ఇందుకు ఫలము.

ఏకనాడీ పతిం హన్తి పార్శ్వనాడీతు కన్యకామ్. 35

టీ. దంపతులనక్షత్రములు మధ్యైకనాడీనక్షత్రములలో నుండిన పురుషునిఁ జంపును. పార్శ్వనాడిలో నుండిన స్త్రీనిఁ జంపును.

వశ్యపొంతనము.

సింహాలీ కర్కివణిజౌ కన్యా వృశ్చికకార్ముకౌ,
తులా మీనయమౌ నక్ర కన్యే కర్కటక స్త్రియః. 36
మేషకుంభౌ వజో నక్రో మేషాదే ర్వశ్యరాశయః.

టీ. మేషరాశికి సింహవృశ్చికములు వశ్యములు. వృషభరాశికి కర్కాటక తులలు వశ్యములు. మిథునరాశికి కన్యారాశివశ్యము. కటకరాశికి వృశ్చికధనుస్సులు వశ్యములు. సింహరాశికి తుల వశ్యము. కన్యారాశికి మీనమిథునములు వశ్యములు. తులారాశికి మకర కన్యలు వశ్యములు. వృశ్చికరాశికి కటకరాశి వశ్యము. ధనూరాశికి, మీనరాశి వశ్యము. మకరరాశికి మేషకుంభములు వశ్యములు. కుంభరాశికి మేషరాశి వశ్యము. మీనరాశికి మకరరాశి వశ్యము.

వర్ణపొంతనము.

కర్క్యంత్య వృశ్చికా విప్రాః నృపా స్సింహధనుస్తులాః. 37
మేషయుగ్మఘటా వైశ్యా శ్శూద్రా వృషమృగాఙ్గనాః,

టీ. కర్కాటకము, మీనము, వృశ్చికము ఈ 3-బ్రహ్మజాతి. సింహధనుస్తులలు క్షత్రియజాతి. మేషమిథునకుంభములు వైశ్యజాతి. వృషభమకరకన్యారాసులు శూద్రజాతి. ఏకజాతి యుత్తమము.

యోనిపొంతనము.

అశ్వం గజ మజం సర్పం సర్పిణీ శున మార్జరీ. 38
అజా మార్జాల మూషశ్చ మూషికా వృష మాహిషీ,
వ్యాఘ్రశ్చ మహిషో వ్యాఘ్రీ మృగీ మృగ శునః కపిః. 39
గోషండో వానరీ సింహీ తురగీ సింహ గో గజీ,

టీ. గుఱ్ఱము, ఏనుఁగ, మేఁక, సర్పము, ఆఁడుసర్పము, శ్వానము, ఆఁడుపిల్లి, ఆఁడుమేక, మొగపిల్లి, మూషికము, ఆఁడుమూషికము, వృషభము, ఎనుము, పులి, దున్నపోతు, ఆఁడుపులి, ఆఁడుజింక, మొగజింక, శ్వానము, కోఁతి, ముంగిస, ఆఁడుకోతి, ఆఁడుసింహము, ఆఁడుగుఱ్ఱము, సింహము, ఆవు, ఆఁడుయేనుఁగు ఈ 27-అశ్వినీ నక్షత్రము మొదలు రేవతీనక్షత్ర పర్యంతము క్రమముగాఁ జూడవలయు. వీటియందు వైరవర్గజంతువులు కలిసిన విరోధము. వైరవర్గము కలియని యెడ శుభము, ఏకయోని శుభప్రదము. భిన్నయోని విరుద్ధము.

## వివాహమునకు మాసములు.

మాఘ ఫాల్గుణ వైశాఖ జ్యేష్ఠమాసాః శుభప్రదాః. 40
మధ్యమం కార్తికే మార్గశీర్షే వై నిందితాః పరే,

టీ. మాఘము, ఫాల్గునము, వైశాఖము, జ్యేష్ఠము ఈ ౪-మాసములు శుభములు. కార్తికము, మార్గశిరము ఈ ౨-మధ్యమములు. మిగిలినమాసములు అధమములు.

## నక్షత్రములు.

మూలమైత్రమృగరోహిణీకరైః పౌష్ణమారుతమఘోత్తరాన్వితైః,
వీర్యవద్భిరుడుభిర్మృగీదృశాంపాణిపీడనవిధిర్విధీయతే. 41

టీ. మూల, అనూరాధ, మృగశిర, రోహిణి, హస్త, రేవతి, స్వాతి, మఖ, ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర ౧౧-వివాహమునకు శ్రేష్ఠమయిన నక్షత్రములు.

## లగ్నబలము.

శుభేక్షితయుతాశ్శస్తా ఉద్వాహేఽఖిలరాశయః,
శుభషడ్వర్గకే లగ్నే మహాదోషవివర్జితే. 42

టీ. శుభగ్రహములచేఁ జూడఁబడినదియు, కూడినదియు, శుభషడ్వర్గయుతమును, మహాదోషరహితమగు లగ్నము శుభకరము.

శుక్రః పంచసహస్రాణి బుధః పంచశతాని చ,
లక్షమేకం తు దోషాణాం గురుః కేంద్రే వ్యపోహతి. 43

టీ. శుక్రుఁడు లగ్నాదికేంద్రములందుండిన నయిదువేల దోషములఁ బోఁగొట్టును. బుధుఁడు లగ్నాదికేంద్రములందుండిన నయిదునూఱులదోషములఁ బోఁగొట్టును. గురువు లగ్నాదికేంద్రములందుండిన లక్షదోషములఁ బోఁగొట్టును.

కావ్యే గురౌవా సౌమ్యేవా యథా కేంద్రత్రికోణగే,
నశ్యన్తి సకలా దోషాః పాపానీవ హరిస్మృతేః. 44

టీ. శుక్ర, గురు, బుధులు కేంద్రత్రికోణములందుండిన, సకలదోషములు హరిస్మరణవల్ల పాపము లేతీరునఁ బోవునో ఆరీతిని నశించును.

## నిషిద్ధదినములు.

మాసాన్తే పంచ దివసాఁ త్యజే ద్రిక్తా మమాష్టమీమ్,
షష్ఠీంచ పరిఘార్ధ్వం వ్యతీపాతం సవైధృతిమ్. 45

టీ. మాసములోఁ గడపటి యయిదుదినములును, రిక్తతిథులును, అమావాస్య, అష్టమి, షష్ఠి, పరిఘాయోగపూర్వభాగము, వ్యతీపాత, వైధృతి వీనియందు వివాహము చేయఁగూడదు.

జామిత్రా ద్యేకవింశద్భిర్మహాదోషై ర్వివర్జితమ్. 47

టీ. సప్తమశుద్ధిలేమియు. నేకవింశతిమహాదోషములు నుండఁగూడదు.

వధూగృహప్రవేశము.

వివాహ మారభ్య వధూప్రవేశో యుగ్మేతిథౌ షోడశవాసరాన్తే,
పంచాఙ్గశుద్ధించ దినం వినాపి తిథౌ న సద్గోచరగేపి కార్యః. 48

టీ. వివాహదివసము మొదలు పదియారుదినముల పర్యంతము సమదినములం దనేకదోషములతోఁ గూడిన తిథులయందును, వధూగృహప్రవేశము చేయవచ్చును. ఈ విషయము ముహూర్తదర్పణమునందు విశదము.

రజస్వలానిర్ణయము.

కరాది పంచోత్తర మూల పౌష్ణ విష్ణుత్రయాశ్వీజ్యవిధీందుభేషు,
ఆద్యంరజస్సౌఖ్యసుతాయురర్థసౌభాగ్యవృద్ధిం కురుతేఽంగనానాం.

టీ. హస్త, చిత్త, స్వాతి, విశాఖ, అనూరాధ, ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, మూల, రేవతి, శ్రవణం, ధనిష్ఠ, శతభిషము, అశ్విని, పుష్యమి, రోహిణి, మృగశిర ఈనక్షత్రములందు రజస్వలయైనట్టయితే, సౌఖ్యమును సంతానమును ఆయుస్సును అర్థలాభమును సౌభాగ్యమును యశోవృద్ధియును కలుగును.

అమాఽర్కాష్టమీ షష్ఠీ ద్వాదశీ వ్రత పర్వసు,
పరిఘస్యచ పూర్వార్ధే వ్యతీపాతేచ వైధృతౌ. 50
సంధ్యో రుపప్లవే విష్ట్యా మశుభం ప్రథమార్తవం.

టీ. ౮, ౬, ౮, ౯, ౧౨, ౧౪, ౧౫, ౩౦ ఈతిథులందును వ్రతదినములయందును పరిఘయోగపూర్వార్ధమందును వ్యతీపాతవైధృతులందును భద్రకరణమందును సంధ్యాకాలమందును సూర్యచంద్రగ్రహణకాలములందును ప్రథమరజోదర్శనము అశుభము.

బుధశుక్రేందుజీవానాం వారేషు శుభదం భవేత్,
శుభానాం సంశకం శ్రేష్ఠ మార్తవే ప్రథమే శుభమ్. 51

టీ. బుధ, శుక్ర, చంద్ర, గురువారములను వారియొక్క రాశ్యంశములును ప్రథమార్తవమందు శుభకరములు.

నిషేకము.

విష్ణు ప్రజేశ రవి మిత్ర సమీర పౌష్ణ
మూలోత్తరా వరుణభాని నిషేకకార్యే,
పూజ్యాని పుష్య వసు శీతకరాశ్వి చిత్రా
దిత్యాశ్చ మధ్యమఫలా విఫలా స్స్వ్యరన్యే. 52

టీ. శ్రవణ, రోహిణి, హస్త, అనూరాధ, స్వాతి, రేవతి, మూల, ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, శతభిషము ఈ ౧౧ నక్షత్రములు నిషేకమందుత్తమములు. పుష్యమి, ధనిష్ఠ, మృగశిర, అశ్విని, చిత్త, పునర్వసు ఈనక్షత్రములు మధ్యమములు. మిగిలిననక్షత్రము లధమములు.

షష్ఠ్యష్టమీం పంచదశీం చతుర్థీం చతుర్దశీమప్యుభయత్ర హిత్వా,
శేషాశ్శుభాస్స్యుస్తిథయో నిషేకే వారాశ్శశాంకార్యసితేన్దుజానాం.

టీ. ౮, ౬, ౭, ౧౪, ౧౫, ౩౦ ఈతిథులువిడిచి తక్కినతిథులందును చంద్ర, బుధ, గురు, శుక్రవారములయందు నిషేకకార్యము శుభము.

వృషభమిథునకర్కిసింహకన్యాతులఘటచాపఝషాశ్శుభం వహన్తి,
యది శుభఫలశాలినోనుకూలేనిధనవిశుద్ధయుతే నిషేకకార్యే. 54

టీ. వృషభము, మిథునము, కర్కాటము, సింహము, కన్యా, తులా, కుంభము, ధనస్సు, మీనము ఈరాసులు శుభగ్రహములు. కేంద్రాదిస్థానములందు బలవంతులై కూడియుండఁగా అష్టమశుద్ధిగల లగ్నమున నిషేకము జేయుట శుభకరము.

పుంసవనము

కుర్యాత్పుంసవనం ప్రసిద్ధవిషమే మాసే తృతీయేఽథవా
గర్భస్పష్టతనౌ తుషారకిరణే పుష్యేఽథవా వైష్ణవే,
హిత్వా కర్కటకన్యయుగ్మమఖిలే ష్వన్యేష్వరిక్తే తిథౌ
శుద్ధే నైధనధామ్ని శుక్రశశభృద్విజ్ఞాంత్రిణాం వాసరే. 55

టీ. మూఁడవనెలయందు గాని గర్భము స్పష్టమైనమీఁదట నొక బేసినెలయందుగాని మృగశిర, పుష్యమి, శ్రవణము, ఈనక్షత్రములయందును, కటక కన్యామిథున రాసులను విడిచి మిగిలినరాసులయందును, రిక్తతిథులను వదలి యష్టమశుద్ధిగల లగ్నమందు శుక్ర సోమ బుధ గురువారములయందు చేయవలెను.

సీమంతము

చతుర్థషష్ఠాష్టమమాసభాజి సారేణ గర్భం ప్రథమం విధేయమ్,
సీమంతకర్మ ద్విజభామినీనాం మాసేఽష్టమే విష్ణుబలించకుర్యాత్.

టీ. బ్రాహ్మణస్త్రీలకు ప్రథమగర్భము ప్రకాశించుచుండఁగా ౪, ౬, ౮ ఈమాసములయందు సీమంతము జేయఁదగినది. అష్టమమాసమునందు విష్ణుపూజ చేయవలెను.

సీమంతే తిష్యహస్తా దితిహరి శశభృత్పౌష్ణవిధ్యుత్తరాఖ్యాః
పక్షచ్ఛిద్రాంశ్చరిక్తా పిత్రుతిథి మపహాయాపరే స్యుః ప్రశస్తాః,

సింహాలీ వర్జయిత్వా శుభఫలబహుళా రాశయోఽప్యంశకాని,
శ్రేష్ఠా స్స్యుశ్శీతరోచి ర్భృగుబుధధిషణా అష్టమే శుద్ధియుక్తే. 56

టీ. సీమంతమందు పుష్యమి, హస్త, పునర్వసు, శ్రవణము, మృగశిర, రేవతి, రోహిణి, ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర ఈనక్షత్రము లుత్తమములు. పక్షచ్ఛిద్రములును రిక్తతిథులును పితృతిథులును సింహావృశ్చికరాసులును విడిచి తక్కినరాశ్యంశలందును తిథులందును సోమ, బుధ, గురు, శుక్రలు ప్రబలులై యుండఁగాను, అష్టమ శుద్ధియందును సీమంతముఁజేయుట శుభము. జాతకభావము ప్రత్యేకమైయున్నందున నీముహూర్తశాస్త్రమునందు జెప్పఁబడలేదు.

## యాత్రాప్రకరణము, తిథిశూలలు

ప్రతిపన్నవమీ పూర్వే ద్వితీయే దశమోత్తరే,
తృతీయైకాదశాగ్నేయే చతుర్ద్వాదశ నైరృతే. 57
పంచత్రయోదశీ యామ్యే జలే షష్ఠీ చతుర్దశీ,
సప్తమీ పూర్ణవాయవ్యా మమావాస్యాష్టమీశయోః. 58

టీ. ౧, ౯ తూర్పుదిక్కునుగూర్చి పోఁగూడదు. ౨, ౧౦ ఉత్తరదిక్కునుగూర్చి పోఁగూడదు. ౩ ౧౧ ఆగ్నేయదిక్కునుగూర్చి పోఁగూడదు. ౪, ౧౨ నిర్పతి దిక్కునుగూర్చి పోఁగూడదు. ౫, ౧౩ దక్షిణదిక్కునుగూర్చి పోఁగూడదు. ౬, ౧౪ పశ్చిమదిక్కునుగూర్చి పోఁగూడదు. ౭, ౧౫, వాయువ్యదిక్కునుగూర్చి పోఁగూడదు. ౩౦, ౮ ఈశాన్యదిక్కునుగూర్చి పోఁగూడదు.

## వారశూలలు

శనౌ సోమేచ న ప్రాచీం న గురౌ దక్షిణాం తథా,
భానౌ శుక్రే న ప్రతీచీం బుధే భౌమే న చోత్తరామ్. 59

టీ. శనిసోమవారములయందు తూర్పుదిక్కునుగూర్చియు, గురువారమున దక్షిణదిక్కుగూర్చియు, ఆదిత్యశుక్రవారములయందు పశ్చిమదిక్కునుగూర్చియు, మంగళ బుధవారములయం దుత్తరదిక్కునుగూర్చియు పోఁగూడదు.

## ప్రయాణమునకు ముఖ్యనక్షత్రములు

మృగోఽశ్వినీ పుష్యపునర్వసూచహస్తానురాధా శ్రవణాచమూలా,
ధనిష్ఠ రేవత్యగతే ప్రయాణే ఫలం లభే చ్ఛీఘ్రనివర్తనంచ. 60

టీ. మృగశిర, అశ్విని, పుష్యమి, పునర్వసు, హస్త, అనూరాధ, శ్రవణం, మూల, ధనిష్ఠ, రేవతి ఈ ౧౦ నక్షత్రములు ప్రయాణమునకు మిక్కిలి శుభ ఫలము నిచ్చును.

## యోగిని

* తమఖఇందుహుతాశనరక్షసాం యమజలేశసమీరణశూలినామ్,
దివి భువి క్రమశః పరివర్తతే సితతిథి ప్రథమాదిషు యోగినీ. 62

టీ. శుద్ధ ౧, ౧౧ బహుళ ౬ ఈతిథులలో యోగిని తూర్పుదిక్కునను ండును. శుద్ధ ౨, ౧౨ బహుళ ౭ ఈతిథులలో నుత్తరదిక్కున నుండును. శుద్ధ ౩, ౧౩ బహుళ ౮ ఈతిథులయందు ఆగ్నేయదిక్కున యోగిని యుండును. శుద్ధ ౪, ౧౪, బహుళ ౯ ఈతిథులయందు నైరృతిదిక్కున యోగిని యుండును. శుద్ధ ౫, ౧౫ బహుళ ౧౦ ఈతిథులయందు దక్షిణదిక్కున యోగిని యుండును. శుద్ధ ౬, బ ౧, ౧౧ ఈతిథులయందు పశ్చిమదిక్కున యోగిని యుండును. శు ౭, బ ౨, ౧౨ ఈతిథులయందు వాయవ్యదిక్కున యోగిని యుండును. శు ౮, బ ౩, ౧౩ ఈతిథులయందీశాన్యదిక్కున యోగిని యుండును. శు, ౯ బ ౪, ౧౪ ఈతిథులయం దాకాశమునందు యోగినియుండును. శు ౧౦, బ ౫, ౩౦ ఈతిథులయందు భూమియందు యోగినియుండును. కనుక ఏతిథుల యందేదిక్కుల యోగిని యుండునో ఆతిథులయం దా దిక్కునకు యాత్ర పోఁగూడదు.

## రాసులు

అజాళికన్యాఘటకీటభేషు యాత్రాం నరో యఃకురుతే౽స్తిమృత్యుః,

టీ. మేషము, కర్కటకము, కన్యా, కుంభము, వృశ్చికము-ఈరాసులయం దెవరు యాత్ర చేయుదురో వారికి మృత్యువు కలదు (ఇది చింత్యము.)

## నక్కకూఁత, తుమ్ము, గోఁకుతములకు ఫలము

ప్రాగాదౌ శనివాసరాది గదితా సూర్యాదయోఽష్టౌ గ్రహాః
నాగా నాగ నగా నిధీ నిశి నభో నాదో నసో నాడికాః,
హాని ప్రీతి దురుక్తి బంధు కనక స్నిగ్ధాన్నతాపార్తిదా
శ్లోకితుః క్రోష్టురుతేక్షుతే ఫల మిదం మ్యుత్క్వాస్సదా గోక్షుతమ్.

టీ. సూర్య చంద్రాంగారక బుధ బృహస్పతి శనైశ్చరరాహువులు శనివారాదిగ శుక్రవారమువరకు దివారాత్రులు తూర్పుమొద లీశాన్యదిక్కువరకు గడియలు ౩౦ ౩౦, ౩౦, ౯౦ ౫౦, ౪౦, ౮౦, ౭౦ ఈ సంఖ్యాక్రమంబుగ నొక్కొక్కగ్రహ మొక్కొక్కదిక్కునందు సంచరించుచుండుఁగాన నీసూర్యాదిగ్రహంబు లాయా దిక్కులయం దుండునపుడు తుమ్ముగాని, నక్కకూఁత గాని వినఁబడె నేని ప్రయాణాదులు పోవువారికి హాని. ప్రీతి, దుర్వార్తాశ్రవణము, బంధులాభము, స్వర్ణలాభము, సౌఖ్యాన్న భోజనము, తాపము, మనఃపీడయు నీఫలంబులు క్రమంబుగఁ గలుగును.

ముహూర్తదీపిక సంపూర్ణము.

---

* ఈశ్లోకమున 'తమఖ' అని ప్రయోగింపంబడినది. అది నామైకదేశగ్రహణ న్యాయముచేత శమఖశబ్దముగ నెన్నుకొనవలయును. ఛందస్సౌకర్యమునకై 'తమఖ' యని ప్రయోగింపఁబడియె.

శ్రీరస్తు

# ముహూర్తదర్పణము

---

## సంజ్ఞాప్రకరణము

యశ్శేష స్సతతం సహస్రఫణవా నేకేన మూర్ధ్నా వహన్
బ్రహ్మాణ్డాని బహూని పంకజదళప్రాయేణ విభ్రాజతే,
తం శేషం దధతం స్వవామచరణే సన్నూపురాభం ముదా
తార్క్ష్యాంగోపరి సంస్థితం సురయుతం శ్రీవేఙ్కటేశం భజే. 1

త్రిమూర్తిరూపిణం దేవం త్రయీవేద్యం శుభావహమ్,
త్రిగుణాతీత మవ్యక్తం వందే సూర్యం సదా విభుమ్. 2

నారదేన కృతో యశ్చ ముహూర్తాహ్వయదర్పణః,
తట్టీకాం ప్రారభే బాలబోధాయ సుమనోహరామ్. 3

### నామనక్షత్ర వివేకము

చూచేచోలాస్తు చాశ్విన్యో లీలూలేలోభరణ్యపి,
ఆఈఊఏ కృత్తికాచ ఓవావీవూచ రోహిణీ. 4

వేవోకాకీ మృగశిరః కూఖంఙఛాచ రౌద్రకమ్,
కేకోహాహీ పునర్వస్వః హూహేహోడాచ పుష్యభమ్. 5

డీడూడేడోచ ఆశ్రేషా మామీమూమే మఘా తథా,
మోటాటీటూ పూర్వభంచ టేటోపాపీతు చార్యభమ్. 6

పూషంణాఢాచ హస్తశ్చ పేపోరారీచ చిత్రభమ్,
రూరేరోతా వాయుభుక్షం తీతూతేతో విశాఖభమ్. 7

నానీనూనేచ మిత్రర్క్షే నోయాయీయూతు చైత్రభమ్,
యేయో బాబీచ మూలర్క్షే బూధాభాఢాచ తోయభమ్. 8

బేబోజాజీచ విశ్వేచ జూజేజో ఖాచ విష్ణుభమ్,
గాగీగూగే వాసవేచ గోసాసీసూచ వారుణమ్. 9

సేసోదాదీ ప్రోష్ఠభేచ దుశ్శంఛా థాహిర్బుధ్న్యభే.
దేదోచాచీచ పౌష్ణేచ ఇత్యేతా **నామతారకాః.** 10

టీ. సర్వజనసామంబులననుసరించిన నక్షత్రములను దెలుసుకొనువివరమెట్లనిన, నామధేయాద్యక్షరము, చూచేచోలాశ్విని అనునశ్విన్యాదియిరువదియేడు నక్షత్రముల అక్షరము-లో నే దగుచున్నదో ఆయక్షరముయొక్క నక్షత్రమును దెలుసుకొనునది. వాక్యములయొక్క మొదటియక్షరము, మొదటిపాదము, రెండవయక్షరము రెండవపాదము, మూఁడవయక్షరము మూఁడవపాదము, నాలవయక్షరము నాలవపాదమని ఈక్రమముగా నిరువదియేడునక్షత్రములకును జూచుకోవలయు. ఇందుకు సూత్రార్థము. చూచేచోలా అశ్విని, లీలూలేలోభరణి, అఈఉఏ కృత్తిక, ఓవావీవో రోహిణీ, వేవోకాకీ మృగశిర, కూఘంఙఛా ఆర్ద్ర, కేకోహాహీ పునర్వసు, హూహేహోఢా పుష్యమి, డీడూడేడో ఆశ్లేష, మామీమూమే మఖ, మోటాటీటూ పుబ్బ, టేటోపాపీ ఉత్తర, పూషంణాఢా హస్త, పేపోరారీ చిత్త, రూరేరోతా స్వాతి, తీతూతేతో విశాఖ, నానీనూనే అనూరాధ, నోయాయీయూ జ్యేష్ఠ, యేయోబాబీ మూల, బూధాభాఢా పూర్వాషాఢ, బేబోజాజీ ఉత్తరాషాఢా, జూజేజోఖూ శ్రవణము, గాగీగూగే ధనిష్ఠ, గోసాసీసూ శతభిషము, సేసోదాదీ పూర్వాభాద్ర, దుశ్శంఛాథా ఉత్తరాభాద్ర, దేదోచాచీ రేవతి - ఈక్రమముగాఁ దెలియవలెను.

అక్షరసంధిగల నామంబులకు గ్రంథాంతరమునుండి యుదాహరణము.

కాలవిధానమందు.

కృష్ణో హ్యాష్ణ శ్శ్రీధరః క్షేత్రపాలో
జ్ఞానో భీమో భైరవ శ్చేతి నామ్నామ్,
ఇందు ర్వాయుత్వష్టృహస్తార్ద్రపూషాః
పూర్వాషాఢా చేతి ఋక్షాణి సప్త. 11

టీ. కృష్ణుఁ డనుపేరునకు మృగశిరానక్షత్రమునందు మూఁడవపాదము, హ్యాష్ణుఁ డనుపేరునకు స్వాతీనక్షత్రమునందు ప్రథమపాదము, శ్రీధరుఁడనుపేరునకు చిత్తానక్షత్రమునందు నాలవపాదము, క్షేత్రపాలకుఁడనే పేరునకు హస్తనక్షత్రమునందు రెండవపాదము, జ్ఞానుఁడనే పేరునకు ఆర్ద్రానక్షత్రమునందు మూఁడవపాదము, భీముఁడనే పేరునకు పూర్వాషాఢనక్షత్రమునందుఁ మూఁడవపాదము, భైరవుఁడనే పేరునకు పూర్వాషాఢానక్షత్రమునందు మూఁడవపాదమని తెలిసికొనునది. ఈక్రమము అవకహడాదిచక్రమునందు జెప్పఁబడియున్నది.

చరస్థిరక్షిప్రమృదూగ్రదారుణసాధారణనక్షత్రములు :—

కాలామృతమందు

క్షిప్రం దస్రరవీజ్య మూ సురశివజ్యేష్ఠోరగం దారుణం
చిత్రాంత్యేందుభమైత్రభం మృదుభవేద్బ్రాహ్మోత్తరాభంస్థిరమ్,
ఉగ్రం కాలమఖాత్రిపూర్వ మనలేంద్రాగ్నీతు సాధారణం
స్వాత్యాదిత్యహరిత్రయం చరమిదం దద్యాత్స్వసంజ్ఞాఫలమ్. 12

టీ. అశ్వని, హస్త, పుష్యమి ఈమూఁడును క్షిప్రనక్షత్రములు. మూల, ఆర్ద్ర, జ్యేష్ఠ, ఆశ్రేష ఈ ౪ ను దారుణనక్షత్రములు. చిత్త, రేవతి, మృగశిర, అనూరాధ ౪ ను మృదునక్షత్రములు. రోహిణీ, ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరభాద్ర ఈ ౪ ను స్థిరనక్షత్రములు. భరణి, మఖ, పుబ్బ, పూర్వాషాఢ, పూర్వాభాద్ర ఈ ౫ ను ఉగ్ర నక్షత్రములు. కృత్తిక, విశాఖ ౨ ను సాధారణనక్షత్రములు. స్వాతి, పునర్వసు, శ్రవణం, ధనిష్ఠ, శతభిషం ఈ ౫ ను చరనక్షత్రములు. ఈనక్షత్రములు తమతమ సంజ్ఞానుగుణమగు ఫలముల నిచ్చుచున్నవి.

నక్షత్రాధిపతులు

ఋక్షేశా అథ దస్ర కాలహుతభుగ్బ్రహ్మేందురుద్రాదితి
జ్యానాగాః పితరో భగార్యమరవిత్వష్ట్రాశుగాఖ్యాః క్రమాత్,
ఇంద్రాగ్నీ అపి మిత్రశక్రదనుజా స్తోయాఖ్యవిశ్వాత్మభూః
శ్రీశాఖ్యా వసు తోయపాజచరణాహిర్బుధ్న్యపూషాభిధాః. 13

టీ. దస్రకాలహుతభుగ్బ్రహ్మేందురుద్రాదితీజ్యాః, అశ్విన్యాః = అశ్వినీనక్షత్రమునకు, దస్రౌ=అశ్వినీదేవతలధిపతులు, భరణ్యాః = భరణీనక్షత్రమునకు, కాలః = యమధర్మరాజధిపతి, కృత్తికాయాః=కృత్తికానక్షత్రమునకు, హుతభుక్=అగ్నిహోత్రుఁడధిపతి, రోహిణ్యాః=రోహిణీనక్షత్రమునకు, బ్రహ్మ=బ్రహ్మయధిపతి, మృగశీర్షస్య=మృగశిరానక్షత్రమునకు ఇందుః=చంద్రుఁడధిపతి, ఆర్ద్రాయాః=ఆర్ద్రానక్షత్రమునకు, రుద్రః=శివుఁడధిపతి, పునర్వస్వాః=పునర్వసూనక్షత్రమునకు, అదితిః=దేవమాతయధిపతి, పుష్యస్య=పుష్యమీనక్షత్రమునకు, ఇజ్యః=బృహస్పతియధిపతి, ఆశ్రేషాయాః=ఆశ్రేషానక్షత్రమునకు, నాగాః=సర్పములధిపతులు, మఘాయాః=మఘానక్షత్రమునకు, పితరః=పితృదేవతలధిపతులు, పూర్వఫల్గున్యాః=పుబ్బనక్షత్రమునకు, ఆర్యభగః=భగుఁడను సూర్యుఁడధిపతి, ఉత్తరఫల్గున్యాః = ఉత్తరనక్షత్రమునకు, అర్యమా = అర్యముఁడనుసూర్యుఁడధిపతి, హస్తస్య=హస్తనక్షత్రమునకు, రవిః=సూర్యుఁడధిపతి, చిత్రాయాః = చిత్తనక్షత్రమునకు, త్వష్టా = ఇంద్రుఁ డధిపతి, స్వాత్యాః = స్వాతీనక్షత్రమునకు, ఆశుగః = వాయుదేవుఁడధిపతి, విశాఖా

యాః=విశాఖనక్షత్రమునకు, ఇంద్రాగ్నీ=ఇంద్రాగ్నులధిపతులు, అనూరాధాయాః=అనూరాధానక్షత్రమునకు, మిత్రః = మిత్రుఁడను పేరుగల సూర్యుఁడధిపతి, జ్యేష్ఠాయాః = జ్యేష్ఠానక్షత్రమునకు, శక్రః = దేవేంద్రుఁడధిపతి, మూలస్య = మూలానక్షత్రమునకు, దనుజః = రాక్షసుఁడధిపతి, పూర్వాషాఢాయాః = పూర్వాషాఢానక్షత్రమునకు, తోయం=గంగయధిపతి, ఉత్తరాషాఢాయాః = ఉత్తరాషాఢానక్షత్రమునకు, విశ్వే=విశ్వేదేవతలధిపతులు, అభిజిన్నక్షత్రమునకు, ఆత్మభూః=బ్రహ్మదేవుఁడధిపతి, శ్రవణస్య = శ్రవణనక్షత్రమునకు, శ్రీశాఖ్యః = విష్ణువధిపతి, ధనిష్ఠానక్షత్రమునకు, వసవః = అష్టవసువులధిపతులు, శతతారాయాః = శతభిషనక్షత్రమునకు తోయపః=వరుణుఁడధిపతి, పూర్వాభాద్రాయాః = పూర్వాభాద్రానక్షత్రమునకు, అజచరణః=అజైకపాదుఁడధిపతి, ఉత్తరాభాద్రాయాః = ఉత్తరాభాద్రనక్షత్రమునకు, అహిర్బుధ్న్యాఖ్యః=అహిర్బుధ్న్యుఁడను శివుఁడధిపతి, రేవతీనక్షత్రమునకు, పూషాహ్వయః = పూషా అను సూర్యుఁడధిపతి యని ఈక్రమముగా నా నక్షత్రమునకు, నాయా యధిపతులని తెలియునది.

## అంధకాదినక్షత్రములు

అర్కస్థితర్క్షాది చతస్ర అంధాః షట్చ ద్వినేత్రం నవచైకనేత్రమ్,
నేత్రాణి యుగ్మాని తథైవ పంచత్రీణ్యాహురంధాః క్రమశః ఫలాని. 14

టీ. అర్కస్థితర్క్షాది=సూర్యుఁడున్ననక్షత్రము మొదలు చతస్రః=౪ నక్షత్రములు, అంధాః = గ్రుడ్డితనముగల నక్షత్రములు, తర్వాత, షట్ =ఆరునక్షత్రములు, ద్వినేత్రం=౨ నేత్రములుగల నక్షత్రములు, తర్వాత, నవ=తొమ్మిది నక్షత్రములు, ఏకనేత్రం=ఒకనేత్రముగల నక్షత్రములు, తర్వాత, పంచ=అయిదునక్షత్రములు, తథైవ=ఆప్రకారముగానే, నేత్రాణియుగ్మాని=రెండునేత్రములుగల నక్షత్రములు, తర్వాత, త్రీణి=మూఁడునక్షత్రములు, అంధాః=గుడ్డినక్షత్రములని యీ ౨౭ నక్షత్రములను, క్రమశః=వరుసగా, ఆహుః=చెప్పుదురు. ఈ నక్షత్రములు, ఫలాని=తమతమ స్వభావఫలముల నిచ్చును.

## జీవనిర్జీవనక్షత్రములు

అర్కేణముక్తస్థితగమ్యతారా స్తిస్రోమృతా స్సప్తతు చార్ధజీవాః,
ఏకో మృతోఽష్టౌచ సుపూర్ణజీవా ఏకో మృత స్సప్తచపాదజీవాః.

టీ. సూర్యునిచే విడువఁబడిననక్షత్రమును, ఆసూర్యుఁడున్న నక్షత్రమును, ఆసూర్యుఁడు ప్రవేశింపఁబడిననక్షత్రమును, ఇట్లు సూర్యునిచే విడువఁబడిననక్షత్రము మొదలు ౩ నక్షత్రములు మృతస్వభావముగలవి. తర్వాత, ౭ నక్షత్రములు సగము జీవముగలవి. తర్వాత, ౧ నక్షత్రము నిర్జీవస్వభావముగలది. తర్వాత, ౮ నక్షత్రములు సంపూర్ణజీవముగలవి. తర్వాత, ౧ నక్షత్రము నిర్జీవస్వభావముగలది. తర్వాత, ౭ నక్షత్రములు పాదజీవముగలవని తెలియునది.

## నక్షత్రత్యాజ్యఘుటికాప్రమాణములు

ఖాఙ్కా జినా వ్యోమగుణాః ఖవేదా శ్శక్రాఃకుదస్రాఃఖగుణానఖాశ్చ,
దంతాః ఖరామాశ్చ నఖాఃపురాణా భూబాహవో వ్యోమకరాస్తు
శక్రాః, ఇంద్రాదిశో దుశ్చ్యవనో రసాఙ్కా జినా నఖాదిగ్దశనాగచం
ద్రాః, నృపాశ్చ సిద్ధాః.ఖగుణా విషాఖ్యా నాడ్య శ్చతస్ర స్తదుప
ర్యఘుస్స్యాత్.

టీ. అశ్విన్యాః = అశ్వినీనక్షత్రమునకు, ఖాఙ్కాః = ౫౦ ఘడియలమీఁదట త్యాజ్యప్రవేశము, భరణ్యాః=భరణీనక్షత్రమునకు,జినాః=౨౪ ఘడియలమీఁదను, కృత్తికాయాః=కృత్తికానక్షత్రమునకు, వ్యోమగుణాః = ౩౦ ఘడియలమీఁదను, రోహిణ్యాః = రోహిణీనక్షత్రమునకు, ఖవేదాః = ౪౦ ఘడియలమీఁదను, మృగశీర్షస్య=మృగశిరనక్షత్రమునకు, శక్రాః = ౧౪ ఘడియలమీఁదను, ఆర్ద్రాయాః = ఆర్ద్రానక్షత్రమునకు, కుదస్రాః=౨౧ ఘడియలమీఁదను, పునర్వస్వాః=పునర్వసూనక్షత్రమునకు, ఖగుణాః=౩౦ ఘడియలమీఁదను, పుష్యస్య=పుష్యనక్షత్రమునకు, నఖాః=౨౦ ఘడియలమీఁదను, ఆశ్రేషాయాః=ఆశ్రేషానక్షత్రమునకు, దంతాః = ౩౨ ఘడియలమీఁదను, మఖాయాః = మఖానక్షత్రమునకు, ఖరామాః=౩౦ ఘడియలమీఁదను, పూర్వఫల్గున్యాః=పుబ్బనక్షత్రమునకు, నఖాః=౨౦ ఘడియలమీఁదను, ఉత్తరఫల్గున్యాః=ఉత్తరానక్షత్రమునకు, పురాణాః౧౮ ఘడియలమీఁదను, హస్తస్య=హస్తానక్షత్రమునకు, భూబాహవః=౨౧ ఘడియలమీఁదను,చిత్రాయాః=చిత్రానక్షత్రమునకు, వ్యోమకరాః=౨౦ ఘడియలమీఁదను, స్వాత్యాః=స్వాతీనక్షత్రమునకు, శక్రాః=౧౪ ఘడియలమీఁదను, విశాఖాయాః=విశాఖానక్షత్రమునకు, ఇంద్రాః=౧౪ ఘడియలమీఁదను, అనూరాధాయాః=అనూరాధనక్షత్రమునకు,దిశః=౮ ఘడియలమీఁదను, జ్యేష్ఠాయాః=జ్యేష్ఠానక్షత్రమునకు, దుశ్చ్యవనః = ౧౪ ఘడియలమీఁదను, మూలస్య=మూలానక్షత్రమునకు,రసాఙ్కాః=౫౬ ఘడియలమీఁదను, పూర్వాషాఢాయాః=పూర్వాషాఢానక్షత్రమునకు, జినాః=౨౪ ఘడియలమీఁదను, ఉత్తరాషాఢాయాః=ఉత్తరాషాఢానక్షత్ర మునకు, నఖాః ౨౦ ఘడియలమీఁదను , శ్రవణస్య=శ్రవణనక్షత్రమునకు,దిక్=౧౦ ఘడియలమీఁదను, ధనిష్ఠాయాః=ధనిష్ఠానక్షత్రమునకు, దశ=౧౦ ఘడియలమీఁదను, శతభిషజః = శతభిషానక్షత్రమునకు, నాగచంద్రాః=౧౮ ఘడియలమీఁదను, పూర్వాభాద్రాయాః=పూర్వాభాద్రానక్షత్రమునకు, నృపాః=౧౬ ఘడియలమీఁదను, ఉత్తరాభాద్రాయాః=ఉత్తరాభాద్రానక్షత్రమునకు, సిద్ధాః = ౨౪ ఘడియలమీఁదను, రేవత్యాః = రేవతీనక్షత్రమునకు, ఖగుణాః=౩౦ ఘడియలమీఁదను, క్రమాత్ = వరుసగా, విషాఖ్యాః=విషఘడియలు, నాడ్యశ్చతస్రః = నాలుగు ఘడియల పర్యంతము, స్యాత్ = ఉండును.

## నక్షత్రాంశలచే నేర్పడినరాశిస్వరూపము.

సప్తవింశతిభంజ్యోతిశ్చక్రం తిమిరవాయుజమ్,
తదుష్ణాంశోర్భవే ద్రాశి ర్నవర్క్ష చరణాంకితః. 18

టీ. తిమిరవాయుజం - తిమిర=గోళాంధకారమందు, వాయు=వాయువల్ల, జం=పుట్టిన, సప్తవింశతిభం = ఇరువదియేడునక్షత్రములుగలిగిన, జ్యోతిశ్చక్రం= శింశుమారచక్రము, తత్=ఆచక్రము, నవర్క్షచరణాంకితః - నవ = తొమ్మిదియగు, ఋక్షచరణ=నక్షత్రపాదములచేతను, అంకితః = గురుతుగలిగి, ఉష్ణాంశోః=సూర్యునికి, రాశిః= మేషాదిరాశిగా, భవేత్=అగుచున్నది. అనఁగా, అశ్విన్యాది ౨౭ నక్షత్రములకు ౧౦౮ పాదములుగనుక రాశి యొకటికి తొమ్మిదిపాదములు చొప్పున మేషరాశిమొదలు మీనరాశిపర్యంతము క్రమముగాఁ జూచుకోఁదగినవి. ఎట్లనిన: అశ్విని నాలుగుపాదములు, భరణి నాలుగుపాదములు, కృత్తికలో నొక పాదము వరకు మేషరాశి - ఇందుకు గ్రంథాంతరమం దుదాహరణము.

అశ్విని భరణీ కృత్తికాః పాదం మేషం, కృత్తికా త్రయః పాదాః రోహిణీ మృగశిరార్థం వృషభం, మృగశిరార్థం తార్ద్రాపునర్వస్వాస్త్రయో మిథునం, పునర్వసుపాదం పుష్యమి ఆశ్రేషాంత్యం కర్కాటకం, మఖ పూర్వఫల్గున్యుత్తరాః పాదం సింహం, ఉత్తరాత్రయః పాదాః హస్త చిత్తార్థం కన్యా, చిత్తార్థం స్వాతివిశాఖాత్రయ స్తులా, విశాఖ పాదం అనూరాధా జ్యేష్ఠాంత్యం వృశ్చికం, మూలపూర్వాషాఢ, ఉత్తరాషాఢపాదంధనుః, ఉత్తరాషాఢత్రయఃపాదాః శ్రవణధనిష్ఠార్థం మకరం, ధనిష్ఠార్థం శతభిషపూర్వాభాద్రాత్రయః కుంభం, పూర్వాభాద్రపాదం ఉత్తరాభాద్ర రేవత్యంతం మీనం.

ఈక్రమముననే తెలుసుకొనునది. అందు అంశలక్రమము, ఇరువదియేడు నక్షత్రములకు ౧౦౮ పాదములు గనుక తొమ్మిదియావృత్తులు మేషాదిరాసులగుచున్నవి. ఉదాహరణము: అశ్విని మొదటిపాదమునకు మేషాంశము, రెండవ పాదమునకు వృషభాంశము, మూఁడవపాదమునకు మిథునాంశము. నాలుగవపాదమునకు కటకాంశము. భరణిమొదటిపాదమునకు సింహాంశము ఈక్రమముగా ౧౦౮ పాదములకు తొమ్మిది ఆవర్తులు జూచుకొనునది.

## మేషాదిరాసులు.

మేషో గౌ ర్మిథునం కర్కి హరిః కన్యా వణిక్తతః.
కౌర్పిచాపౌ నక్రకుంభౌ మీనో మేషాదితో భవేత్. 19

టీ. మేషః=మేషము, గౌః = వృషభము, మిథునం = మిథునము, కర్కీ = కర్కాటకము హరిః=సింహము, కన్యా=కన్య, వణిక్=తుల, కౌర్పిః=వృశ్చికము, చాపం=ధనుస్సు, నక్రః=మకరము, కుంభః=కుంభము, మీనః=మీనము. మేషాదితః - మేష = మేషమే, ఆదితః = మొదలుకొని, భవేత్ = అగును.

రాశ్యధిపతులు

సింహస్యాధిపతిస్సూర్యః కర్కటస్య నిశాకరః,
మేషవృశ్చికయో ర్భౌమః కన్యామిథునయో ర్బుధః, 20
కోదండమీనయోర్మంత్రీ తులావృషభయో ర్భృగుః,
నక్రస్య కుంభరాశేశ్చ నాయకస్సూర్యనందనః. 21

టీ. సింహస్య=సింహమునకు, సూర్యః = సూర్యుఁడు, అధిపతిః = ప్రభువు. కర్కటస్య = కర్కాటకమునకు, నిశాకరః = చంద్రుఁడు, అధిపతిః = ప్రభువు. మేషవృశ్చికయోః - మేష= మేషమునకును, వృశ్చికయోః=వృశ్చికమునకును, భౌమః= అంగారకుఁడు, అధిపతిః=ప్రభువు, కన్యామిథునయోః - కన్యా=కన్యారాశికిని, మిథునయోః=మిథునరాశికిని, బుధః = బుధుఁడు, అధిపతిః = ప్రభువు. కోదండమీనయోః - కోదండ=ధనుస్సునకును, మీనయోః=మీనరాశికిని, మంత్రీ = బృహస్పతి, అధిపతిః=ప్రభువు. తులావృషభయోః - తులా=తులకును, వృషభయోః = వృషభమునకును, భృగుః=శుక్రుఁడు, అధిపతిః=ప్రభువు. నక్రస్య=మకరరాశికిని, కుంభరాశేశ్చ=కుంభరాశికిని, సూర్యనందనః=శనైశ్చరుఁడు, నాయకః=ప్రభువు. ఈ మేషాదిరాసులకు క్రమముగా నీయధిపతులను జూచుకొనునది.

మేషాదిరాశిఘటికాప్రమాణములు

ప్రతిదేశములయందు ఘటికాప్రమాణములు వేఱువేఱై యున్నవి. ఎట్లనిన: భూమి నిమ్నోన్నతమైనందున ఆయాప్రాంతములయందు మేషతులామాసప్రవేశముల మధ్యాహ్నకాలనూర్యుఁ డుచ్చుఁడై యుండఁగా నపుడు సూర్యసిద్ధాంతప్రకారము ద్వాదశాంగుళప్రమాణమైన శంకువు నేర్పాటుసేసి గణితము చేయఁగా ఆయాదేశములకు విషువచ్ఛాయ బుట్టును. విషువచ్ఛాయవలన నాయాదేశములకు మేషాదిఘటికాప్రమాణములు వేఱువేఱై యున్నవి. ఈకల్యాణనగరమందు విషువచ్ఛాయాప్రమాణము ౨, ౪, ౫, 'నఖమ్నా విషువచ్ఛాయా' అనుశాస్త్రరీతిచే విషువచ్ఛాయనుండి గణితముచేసి చూడఁగా నీదేశములకు నిశ్చయమైన మేషాదిఘటికాప్రమాణములు.

వస్వబ్ధిదస్రాః శరశైలపక్షా గుణేందురామా గుణదైవతాని,
కృశానుదంతాపసుఖాగ్న యస్స్యుర్మేషాదిషట్కస్య తత్క్రమతః పరేస్యుః

టీ. మేషరాశికి ౪, ౮, వృషభరాశికి ౪, ౩౫, మిథునరాశికి ౫, ౧౩, కటకరాశికి ౫, ౩౩, సింహరాశికి ౫, ౨౨, కన్యారాశికి ౫, ౭, తులారాశికి ౫, ౭,

వృశ్చికరాశికి ౫, ౨౨, ధనూరాశికి ౫, ౩౩, మకరరాశికి ౫, ౧౩, కుంభరాశికి ౪, ౩౫, మీనరాశికి ౪, ౦ అని యీరీతిగానే మేషాదిలగ్నప్రమాణములను తెలియతగ్గది.

ఈలగ్నప్రమాణములు విషువచ్ఛాయ మూడంగుళములు గలదేశమునకు మాత్రము సరిపడియుండును. ఇతరదేశములకు సిద్ధాంతశాస్త్ర ప్రకారము వేఱు వేఱుగ నేర్పఱచుకొనవలయును. మద్రాసు, చెంగల్పట్టు, చిత్తూరు, నెల్లూరు ప్రదేశములకు సరివచ్చును.

మీనమేషౌ చతుర్దండీ గోకుంభౌ చతురర్ధకమ్.
పంచపాదో యుగ్మమృగౌ పంచార్ధం చాపకర్కిణౌ. 23
కౌర్పిసింహౌచ పంచార్ధం పంచపాద స్తులాఙ్గనే,
మేషాదీనాంతు లగ్నానాం మాన మేవం విదుర్బుధాః. 24

టీ. మీనమేషములు ౪ ఘడియలు, వృషభకుంభములు ౪-౩౦ ఘడియలు, మిథునమకరములు ౫-౧౫ ఘడియలు, ధనుఃకటకములు ౫-౩౦ ఘడియలు, వృశ్చికసింహములు ౫-౩౦ ఘడియలు, తులాకన్యాలగ్నములు ౫-౧౫ ఘడియలు అని యీ ప్రకారముగా మేషాదిలగ్నప్రమాణము నెరుంగుదురు, ఇది ఈశ్లోకోక్తలగ్నప్రమాణములు నాలుగంగుళములు విషువచ్ఛాయ గల ప్రదేశమునకు సరివచ్చును.

### చరస్థిరద్విస్వభావ రాసులు.

చరస్థిరద్విస్వభావో మేషాది క్రమశో భవేత్.

టీ. మేషాదిః= మేషము మొదలైనలగ్నము, క్రమశః=వరుసగా, చరస్థిరద్విస్వభావః-చర= చరము, స్థిర=స్థిరము, ద్విస్వభావః=ద్విస్వభావమను పేరుగలవి, భవేత్ = అగును. అనగా మేషము చరము, వృషభము స్థిరము, మిథునము ద్విస్వభావము. ఈ విధముగా మేషము మొదలు మీనపర్యంతము మూఁడుమూఁడు రాసులు గణన చేయఁగా చరస్థిరద్విస్వభావరాసులసంజ్ఞ తెలియుచున్నది.

### లగ్నత్యాజ్యములు.

అజవృషభధనుఃకన్యకాదౌ భుజంగః
ఝషమకరకుళీరే వృశ్చికాన్తేచ రాహుః,
మిథునఘటతులానాం సింహమధ్యేతు గృధ్ర
స్సకలమునిమతం స్యాత్సర్వకార్యేషు వర్జ్యమ్. 25

టీ. అజవృషభధనుః కన్యకాదౌ= మేష, వృషభ, ధనుః, కన్యాలగ్నములకు లగ్నముదయించినది మొదలరఘడియవఱకు, భుజంగః = భుజంగమనెడి వర్జ్యము, ఝష మకరకుళీరేవృశ్చికాంతే = మీనమకరకర్కటవృశ్చికరాసులకు, అంతే = కడపట నరఘడియకలదనఁగా, రాహుః = రాహుత్యాజ్యము. మిథునఘటతులానాం=మిథునకుంభ తులాలగ్నములకు, సింహమధ్యే-సింహ=సింహమునకు, మధ్యే=

ఈరాసులుదయించిన సగభాగమునకు, గృధ్రః = గృధ్రమనెడి త్యాజ్యము, సర్వకార్యేషు = సకలకార్యములయందు, వర్జ్యం = త్యాజ్యము, సకలమునిమతం= అందఱిఋషీశ్వరులమతము, స్యాత్ = అగును.

ఉచ్ఛనీచరాసులును పరమోచ్ఛ పరమనీచభాగములును.

అజవృషభమృగాఙ్గనాకుళీరా ఝషవణిజౌచదివాకరాదితుంగాః
దశశిఖిమనుయుక్తిథీన్ద్రియాంశై స్త్రినవకవింశతిభిశ్చతేఽస్తనీచాః.

టీ. అజ=మేషము, వృషభ=వృషభము, మృగ=మకరము, అంగనా=కన్య, కుళీరా=కర్కాటకము, ఝష=మీనము. వణిక్=తుల, ఈ ఏడు రాసులు, దివాకర= సూర్యుఁడే, ఆది=మొదలుగాఁగలిగిన చంద్ర, కుజ, బుధ, గురు, శుక్ర, శనులకు, తుంగాః=ఉచ్ఛస్థానములు, దశ=మేషమునందు ౧౦ భాగములు, సూర్యునికి ఉచ్ఛములు. అందు ౧౦-వ భాగము పరమోచ్ఛభాగము. తక్కిన ౨౦ భాగములు మిత్రభాగములు. వృషభయందు చంద్రునికి శిఖి మూఁడుభాగములు ఉచ్ఛభాగములు. అందు 3-వ భాగము పరమోచ్ఛభాగము. తక్కిన ౨౭ భాగములు మూలత్రికోణభాగములు. మకరమునందు కుజునికి మనుయుక్ - ౨౮ భాగములు ఉచ్ఛభాగములు. అందు ౨౮ దవ భాగము పరమోచ్ఛభాగము. తక్కిన ౨ భాగములు మిత్రభాగములు. బుధునికి కన్యా రాశిలో తిథి ౧౫ భాగములు ఉచ్ఛభాగములు. అందు ౧౫-వ భాగము పరమోచ్ఛభాగము. తర్వాత ౫ భాగములు మూలత్రికోణభాగములు. తర్వాత ౧౦ భాగములు స్వక్షేత్రభాగములు. బృహస్పతికి కటకరాశియందు ఇంద్రియ ౫ భాగములు ఉచ్ఛభాగములు. అందు ౫-వ భాగము పరమోచ్ఛభాగము తక్కువ ౨౫ భాగములు మిత్రభాగములు. శుక్రునికి మీనరాశియందు ౨౭ భాగములు. ఉచ్ఛభాగములు. అందు ౨౭-వ భాగము పరమోచ్ఛభాగము. తక్కినభాగములు మిత్రభాగములు. శనైశ్చరునికి తులారాశియందు ౨౦ భాగములు ఉచ్ఛ 3 భాగములు. అందు ౨౦-వ భాగము పరమోచ్ఛభాగము. తక్కిన ౧౦ భాగములు మిత్రభాగములని క్రమముగాఁ దెలియునది. తర్వాత, తత్ = ఆ చెప్పిన ఏడు రాసులయొక్క, అస్త=ఏడవస్థానము, నీచాః=సూర్యాది గ్రహములకు నీచస్థానము. అందు దశాదిభాగములు పరమనీచాదిభాగములు. యెట్లున్నను - సూర్యునికి తులారాశియందు ౧౦ భాగములు నీచభాగములు. అందు ౧౦-వ భాగము పరమనీచభాగము. తక్కిన ౨౦ భాగములు శత్రుభాగములు. చంద్రునికి వృశ్చికరాశియందు 3 భాగములు నీచభాగములు.అందు3-వ భాగము పరమనీచభాగము. తక్కిన ౨౭ భాగములు శత్రుభాగములు. కుజునికి కటకరాశియందు ౨౮ భాగము. నీచభాగములు. అందు ౨౮-వ భాగము పరమ నీచభాగము తక్కిన ౨ భాగములు. శత్రుభాగములు. బుధునికి మీనరాశియందు ౧౫ భాగములు నీచభాగములు. అందు౧౫- భాగము పరమనీచభాగము తక్కిన ౧౫ భాగములు శత్రుభాగములు. బృహస్పతికి మకరరాశి యందు ౫ భాగములు నీచ

భాగములు. అందు ౫-వ భాగము పరమనీచ భాగము. తక్కిన ౨౫ శత్రుభాగములు. శుక్రునికి కన్యారాశియందు ౨౭ భాగములు నీచములు. అందు ౨౭-వ భాగము పరమనీచము. తక్కినమూఁడు శత్రు భాగములు. శనైశ్చరునికి మేష రాశియందు ౨౦ భాగములు నీచములు. అందు ౨౦-వ భాగము పరమనీచము. తక్కిన ౧౦ భాగములు శత్రుభాగములని తెలియనది,

మూలత్రికోణరాసులు.

సింహోగో మేషవాథోనధనుస్తౌలీఘటేషుచ,
రవ్యాదే ర్నఖ ఋత్వంచ రవి ర్బాణో దిశ స్తథా. 27
త్రిపంచ వింశతి స్సంఖ్యా భాగో మూలత్రికోణగః,

టీ. రవేః=సూర్యునికి, సింహ=సింహమందు, నఖ=౨౦ భాగములు మూలత్రి కోణములు. తక్కిన ౧౦ స్వక్షేత్ర భాగములు. చంద్రునికి, గో=వృషభమందు మందు చెప్పిన 3 భాగములు ఉచ్చములు. తర్వాత ౨౭ భాగములు మూలత్రికోణ ములు. కుజస్య=కుజునికి, మేష=మేషమందు, రవిః=౧౨ భాగములు మూలత్రికోణ ములు. తర్వాత ౧౮ భాగములు స్వక్షేత్రములు. బుధస్య=బుధునికి, పార్థోన = కన్యారాశి యందు ముందుజెప్పిన ౧౫ భాగములు ఉచ్చములు తర్వాత ౫ భాగ ములు మూలత్రికోణములు. తర్వాతి ౧౦ భాగములు స్వక్షేత్రములు. గురోః = బృహస్పతికి, ధనుః=ధనూరాశియందు, దిశః=౧౦ భాగములు మూలత్రికోణములు. తర్వాత ౨౦ భాగములు స్వక్షేత్రములు. శుక్రస్య = శుక్రునకు. తౌలీ=తులయందు, త్రిపంచ = ౧౫ భాగములు మూలత్రికోణములు. తిక్కన ౧౫ భాగములు స్వక్షే త్రములు. శనేః=శనైశ్చరునికి, ఘట=కుంభరాశియందు, వింశతిః=౨౦ భాగములు మూలత్రికోణములు. తక్కిన ౧౦ భాగములు స్వక్షేత్రభాగములని యాక్రమ ముగా విదుః = తెలియుదురు.

మిత్రశత్రు సమగ్రహములు,

శత్రూ మందసితౌ సమ శ్శశిసుతో మిత్రాణి శేషా రవే
స్తీక్ష్ణాంశు ర్హిమరశ్మిజశ్చ సుహృదౌ శేషా స్సమాః శీతగోః,
జీవేందూష్ణకరాః కుజస్య సుహృదో జ్ఞోఽరి స్సితార్కిసమౌ
మిత్రే సూర్యసితౌ బుధస్య హిమగు శ్శత్రు స్సమాశ్చాపరే. 28

టీ. రవే=సూర్యునికి, మందసితౌ=శనిశుక్రులు, శత్రూ = శత్రువులు, శశి సుతః=బుధుఁడు, సమ=సముఁడు, శేషాః=మిగిలిన చంద్ర కుజ గురువులు, మిత్రాణి= మిత్రులు, శీతగోః=చంద్రునికి తీక్ష్ణాంశుః=సూర్యుఁడు, హిమరశ్మి జః = బుధుఁడు, సుహృదౌ = స్నేహితులు, శేషాః=మిగిలిన కుజగురు శుక్రశనులు, సమాః=సములు, కుజస్య=కుజునికి, జీవేందూష్ణకరాః-జీవ = బృహస్పతియు, ఇందుః=చంద్రుఁడును, ఉష్ణకరాః=సూర్యుఁడును, సుహృదః= స్నేహితులు, జ్ఞః=బుధుఁడు, అరిః=శత్రువు,

సితార్కీ=శుక్రశనులు, సమా=సములు, బుధస్య = బుధునికి, సూర్యసితౌ=సూర్య శుక్రులు, మిత్రే=మిత్రులు, హిమగుః=చంద్రుఁడు, శత్రుః = శత్రువు, అపరే = మిగిలిన కుజ గురు శనులు, సమాః = సములు,

సూరేః సౌమ్యసితావరీ రవిసుతో మధ్యః పరే త్వన్యథా
సౌమ్యార్కీ సుహృదౌ సమౌ కుజగురూ శుక్రస్య శేషావరీ,
శుక్రజ్ఞౌ సుహృదౌ సమః సురగురుః సౌరస్య చాన్యేఽరయో
యే ప్రోక్తాస్సుహృదస్త్రికోణభవనాత్తేఽమీ మయా కీర్తితాః. 29

టీ. సూరేః=బృహస్పతికి, సౌమ్యసితౌ=బుధ శుక్రులు, అరీ=శత్రువులు, రవిసుతః= శనైశ్చరుఁడు, మధ్యః=సముఁడు, పరేతు=మిగిలిన రవి చంద్ర కుజులు, అన్యథా=మిత్రులు, శుక్రస్య=శుక్రునికి, సౌమ్యార్కీ=బుధ శనులు, సుహృదౌ = స్నేహితులు, కుజగురూ = కుజ గురువులు, సమౌ=సములు, శేషాః = మిగిలిన రవి చంద్రులు, అరీ=శత్రువులు, సౌరస్య = శనైశ్చరునికి, శుక్రజ్ఞౌ=శుక్రబుధులు, సుహృదౌ=స్నేహితులు, సురగురుః=బృహస్పతి, సమః=సముఁడు, అన్యే=మిగిలిన రవి చంద్రకుజులు, అరయః=శత్రువులు, ఇతి=ఇట్లని, త్రికోణభవనాత్=త్రికోణ రాసులవలన, అమీ=ఈ, సుహృదః=మిత్రులని, యేప్రోక్తాః = ఏగ్రహములు పెద్దలచేఁ జెప్పఁబడినవో, తే=ఆమిత్రాదిగ్రహములు, మయా=నాచేతను, కీర్తితాః= చెప్పఁబడినవి. ఈరెండుశ్లోకములు లఘుజాతకములోనివి.

## గ్రహముల క్రూర సౌమ్య పురుష స్త్రీ నపుంసక జాతి భేదములు కాలామృతమున.

క్రూరా భానుతమశ్శనిధ్వజకుజాశ్శుక్రార్యసౌమ్యేందవ
సౌమ్యాస్తేపురుషాః కుజార్కగురవో రాహ్వేందుశుక్రాః స్త్రియః,
తచ్ఛేషాస్తు నపుంసకా గురుభృగూ విప్రా కుజార్కౌ నృపౌ
వైశ్యౌ చంద్రబుధౌ తదన్యకులజో మందస్తు వర్ణేశ్వరః. 30

టీ. భానుతమశ్శనిధ్వజకుజాః=సూర్యరాహుశనికేత్వంగారకులు, క్రూరాః= పాపగ్రహములు, శుక్రార్యసౌమ్యేందవః = శుక్రగురుబుధచంద్రులు, సౌమ్యాః = శుభగ్రహములు, కొందఱిమతమునందు బుధునకు పాపగ్రహముతోఁ జేరినప్పుడు పాపిత్వమును, క్షీణచంద్రునకు పాపిత్వమును, పూర్ణచంద్రునికి శుభత్వమును జెప్పఁ బడియున్నది. ఇందునకు బాలబోధినియం దుదాహరణము.—'శ్లో. బుధః పాప యుతః పాపః క్షీణచంద్రస్తథైవచ' కుజార్కగురవః=కుజరవి గురువులు, పురుషాః= పురుషగ్రహములు, రాహ్వేందుశుక్రాః = రాహుచంద్రశుక్రులు, స్త్రియః = స్త్రీ స్వభావగ్రహములు, తచ్ఛేషాస్తు=తక్కిన బుధశనికేతువులు, నపుంసకాః=నపుంసక గ్రహములు, గురుభృగూ = గురుశుక్రులు, విప్రౌ = బ్రాహ్మణగ్రహములు,

కుజార్కౌ = రవికుజులు, నృపౌ = క్షత్రియగ్రహములు, చంద్రబుధౌ=చంద్రబుధులు, వైశ్యౌ = వైశ్యగ్రహములు, మందస్తు=శనైశ్చరుఁడైతే, తదన్యకులజః= ఆబ్రహ్మక్షత్రియ వైశ్యకులములకంటె, అన్యకులజః = అన్యమైనకులమందుబుట్టిన, వర్ణేశ్వరః = శూద్రకులాధిపతి.

నవగ్రహములయొక్క వర్ణములు-బృహజ్జాతకమందు.

రక్తశ్యామో భాస్కరో గౌర ఇన్దు
ర్నాత్యుచ్చాఙ్గో గురు రక్తగౌరశ్చ వక్రః,
దూర్వాశ్యామో జ్ఞో గురు ర్గౌరగాత్రః
శ్వేత శ్శుక్రో భాస్కరిః కృష్ణదేహః, 31
రాహుస్తు ధూమ్రవర్ణశ్చ చిత్రవర్ణో ధ్వజస్స్మృతః

టీ. భాస్కరః = సూర్యుఁడు, రక్తశ్యామః = పాటలవర్ణముగలవాఁడు, ఇందుః = చంద్రుఁడు, గౌరః = శ్వేతవర్ణముగలవాఁడు, వక్రః = అంగారకుఁడు, నాత్యుచ్చాంగః = అతిదీర్ఘమైనవాఁడుగాక, రక్తగౌరః = పద్మపత్రమువంటి యొలుపుగలవాఁడు, జ్ఞః=బుధుఁడు, దూర్వాశ్యామః=గఱికవలె శ్యామలవర్ణము గలవాఁడు, గురుః=బృహస్పతి, గౌరగాత్రః = పసపుచాయగలవాఁడు, శుక్రః = శుక్రుఁడు, శ్వేతః=తెలుపువర్ణముగలవాఁడు, భాస్కరిః=శనైశ్చరుఁడు,కృష్ణదేహః= నలుపువన్నెగలవాఁడు, రాహుస్తు = రాహువైతే, ధూమ్రవర్ణః = కృష్ణలోహిత వర్ణముగలవాఁడు, ధ్వజః = కేతువు, చిత్రవర్ణః = చిత్రవర్ణముగలవాఁడు.

## గ్రహదృష్టి.

త్రిదశత్రికోణచతురశ్రసప్తగా నవలోకయన్తి చరణాభివృద్ధితః,
రవిజామరేడ్యరుధిరాః పరేచయే క్రమశో భవన్తిసకలేక్షణాధిపాః,

టీ. శనైశ్చరుఁడు తానున్నరాశికి ౩-వ యింటిని, ౧౦-వ యింటిని అందలి గ్రహములకు పాదదృష్టిచేత విశేషముగాఁజూచును. గురువు తానున్నరాశికి ౫-వ యింటిని, ౯-వ యింటిని అందలిగ్రహములను అర్ధదృష్టిచే విశేషముగాఁజూచును. అంగారకుఁడు తానున్నరాశికి ౪-వ రాశిని ౮-వరాశికిఅందలిగ్రహములకు త్రిపాద దృష్టిచేతవిశేషముగాఁజూచును. ఈశని గుర్వంగారకులు మిగిలిన సూర్యచంద్రబుధశుక్రులునుగూడ తామున్నరాశికి ౭-వ రాశిని అందున్నగ్రహములకు నాలుగుపాదములుగల సంపూర్ణదృష్టిచే జూతురు. శనిగురుఅంగారకులకు క్రమముగా పాద అర్ధత్రిపాదదృష్టి బలీయము. మిగిలినవారికి సంపూర్ణదృష్టిబలీయమని యొఱుంగునది.

### అంధకబధిరపంగురాసులు.

మేషాది చాన్ధకం షట్కం చత్వారో బధి రా_స్తథా,
ద్వౌచ్చ పంగూ తు విజ్ఞేయా తద్భేదాః పరికీర్తితాః. 31

టీ. మేషాది = మేషము మొదలు షట్కం = ఆఱురాసులు, అంధకం = గ్రుడ్డిరాసులు, తథా=అటుతర్వాత, చత్వారః = నాలుగురాసులు, బధిరాః= చెవిటి రాసులు, తథా = అటుతర్వాత, ద్వౌచ = రెండురాసులును, పంగూ = కుంటి రాసులని, విజ్ఞేయాః= తెలియఁదగినవి. తద్భేదాః=ఆరాసుల భేదములు. పరికీర్తితాః= చెప్పఁబడినవి. మేషము మొదలు కన్యారాశివఱకు గ్రుడ్డిరాసులు. పిమ్మట తులా వృశ్చిక ధనుర్మకరరాసులు చెవిటిరాసులు. పిమ్మట కుంభమీనములు కుంటిరాసులు. ఈరాసుల భేదములఁ దెలియఁ జేయుచున్నాఁడు.

అజో వృషో మృగేన్ద్రశ్చ అర్ధరాత్రే మహాంధకాః,
యుగ్మాంగనాకులీరాశ్చ మధ్యాహ్నే చాంధకాస్స్మృతాః. 34
ఇత్యేవం కాలభేదేన శుభదాశ్చ ప్రకీర్తితాః,
తులాచ వృశ్చికశ్చైవ బధిరౌ చాపరాహ్ణకే. 35
రాత్రౌచ బధిరౌ ప్రోక్తౌ మకరశ్చ ధనుర్గ్రిహామ్,
ఉభయోస్సంధ్యయోః పంగూ కుంభమీనౌ ప్రకీర్తితౌ. 30

టీ. అజః=మేషము, వృషః=వృషభము, మృగేంద్రశ్చ=సింహమును, అర్ధరాత్రే = మధ్యరాత్రియందు, మహాంధకాః=మిక్కిలి గ్రుడ్డిరాసులు, యుగ్మాంగనాకులీరాః = మిథునకన్యాకర్కాటకములు, మధ్యాహ్నేచ = మధ్యాహ్న కాలమందును, అంధకాః=గ్రుడ్డిరాసులని, స్మృతాః=చెప్పఁబడినవి. ఇతి = ఇట్లని, ఏవం = ఈ, కాలభేదేన = కాలభేదము చేత, శుభదాః = శుభఫలదములని, ప్రకీర్తితాః=చెప్పఁబడినవి. తులాచ = తులయును, వృశ్చికశ్చ = వృశ్చికమును, అపరాహ్ణకే = పగటియందు, బధిరౌ=చెవిటిరాసులుగా, ప్రోక్తౌ=చెప్పఁబడినవి. మకరః= మకరము. ధనుర్గ్రిహం = ధనస్సును, రాత్రౌచ = రాత్రియందును, బధిరౌ=చెవిటి రాసులుగా, ప్రోక్తౌ = చెప్పఁబడినవి. కుంభమీనౌ = కుంభమీనరాసులు, ఉభయోస్సంధ్యయోః = ప్రాతస్సాయంసంధ్యలయందు, పంగూ = కుంటివియని, ప్రకీర్తితౌ= చెప్పఁబడినవి.

### షడ్వర్గలక్షణము.

త్రింశద్భాగాత్మకం లగ్నం హోరా తస్యార్ధ ముచ్యతే,
రాశి త్రిభాగో ద్రేక్కాణః నవాంశో నవభాగకః. 37

ద్వాదశాంశో ద్వాదశాంశ స్త్రింశాంశ స్త్రింశదంశకః,
షడ్వర్గలక్షణం ప్రోక్తం సర్వలగ్నే ష్వయం క్రమః. 38

టీ. లగ్నం=లగ్నము, త్రింశద్భాగాత్మకం=30 భాగములుగలది. హోరా=హోర, తస్య = ఆలగ్నముయొక్క, అర్ధం = సగముగా, ఉచ్యతే = చెప్పఁబడుచున్నది. ద్రేక్కాణః = ద్రేక్కాణమనునది, రాశిత్రిభాగః = రాశిలగ్నముయొక్క, త్రిభాగః=మూఁడవభాగము, నవాంశః = నవాంశమనునది. నవభాగకః= తొమ్మిదవభాగము, ద్వాదశాంశః = ద్వాదశాంశమనునది, ద్వాదశాంశః = పదిరెండవభాగము, త్రింశాంశః త్రింశాంశమనునది, త్రింశదంశకః = ముప్పదవభాగము, షడ్వర్గలక్షణం=షడ్వర్గలక్షణము, సర్వలగ్నేషు=సర్వలగ్నములయందు, ప్రోక్తం = చెప్పఁబడినది, సర్వలగ్నేషు = సర్వలగ్నములయందు, అయం=ఇదియె, క్రమః = క్రమము.

హోరాద్రేక్కాణములు,

హోరార్కచంద్రయోరోజే యుగ్మభే చంద్రసూర్యయోః,
లగ్నపంచనవక్షేత్రనాథా ద్రేక్కాణపాః క్రమాత్. 39

టీ. ఓజే = ఓజరాశియందు, అర్కచంద్రయోః = సూర్యచంద్రులయొక్క, హోరా=హోర, యుగ్మభే = యుగ్మరాశియందు, చంద్రసూర్యయోః = చంద్రసూర్యులయొక్క, హోర = హోర, అనఁగా లగ్నము రెండుభాగములుచేసిన బేసిరాశికి మొదటిభాగము సూర్యహోర, రెండవభాగము చంద్రహోర, సమరాశికి మొదటిభాగము చంద్రహోర, రెండవభాగము సూర్యహోరయు, లగ్న పంచనవక్షేత్రనాథాః = లగ్నపంచమనవమాధిపతులు, క్రమాత్ = వరుసగా, ద్రేక్కాణాధిపాః = ద్రేక్కాణాధి పతులు, స్యుః = అగుదురు.

చరే స్వపుత్రనవపాః స్థిరే ధర్మ స్వపుత్రపాః,
పుత్రధర్మస్వపా ద్విస్వే ద్రేక్కాణస్య ప్రకీర్తితాః. 40

టీ. చరే=చరరాశియందు, స్వపుత్రనవపాః = లగ్నపంచమాధిపతులు ద్రేక్కాణాధిపతులు, స్థిరే=స్థిరరాశియందు, ధర్మస్వపుత్రపాః=నవమలగ్నపంచమాధిపతులు ద్రేక్కాణాధిపతులు, ద్విస్వే = ద్విస్వభావరాశియందు, పుత్రధర్మస్వపాః = పంచమనవమలగ్నాధిపతులు ద్రేక్కాణాధిపతులని, ప్రకీర్తితాః=చెప్పఁబడిరి. లగ్నము మూఁడుభాగములు చేసి చరస్థిరద్విస్వభావరాసులను దెలుసుకొని అందు చరరాశి మొదటిభాగమునకు స్వరాశ్యధిపతి ద్రేక్కాణాధిపతి, రెండవభాగమునకు తనరాశికి ౫ రాశ్యాధిపతి ద్రేక్కాణాధిపతి మూఁడవభాగమునకు స్వనవమాధిపతి ద్రేక్కాణాధిపతి. స్థిరరాశికి మొదటిభాగమునకు తన రాశికి ౯ రాశ్యధిపతి ద్రేక్కాణాధిపతి,

రెండవభాగమునకు తనరాశ్యధిపతి ద్రేక్కాణాధిపతి. మూఁడవభాగమునకు తన రాశికి ౫ రాశ్యధిపతి ద్రేక్కాణాధిపతి, ద్విస్వభావరాశికి మొదటిభాగమునకు తన రాశికి ౫ రాశ్యధిపతి ద్రేక్కాణాధిపతి. రెండవభాగమునకు తనరాశికి ౯ రాశ్యధిపతి ద్రేక్కాణాధిపతి మూఁడవభాగమునకు తనరాశ్యధిపతి ద్రేక్కాణాధిపతి యని క్రమముగా పండ్రెండురాసులకు ద్రేక్కాణాధిపతులను దెలిసికొనునది.

కేచిత్తుహోరాం ప్రథమాంభవస్యవాంఛన్తిలాభాధిపతేర్ద్వితీయాం,
ద్రేక్కాణసంజ్ఞామపి వర్ణయన్తి స్వద్వ్యాదశైకాదశరాశిపానామ్,

దీనియర్థము ముందుగ్రంథమునందు విశదము కాఁగలదు.

## నవాంశక్రమము.

మేషసింహధనుష్షు త్వజాదయ స్తౌళికుంభమిథునే తులాదయః,
కన్యకామృగవృషేమృగాదయో మీనకర్క్యలిషుకర్కటాదయః.

టీ. మేషసింహధనుష్షు = మేషసింహధనువులయందు, అజాదయః= మేషము మొదలుకొని నవాంశలు, తౌళికుంభమిథునే=తులాకుంభమిథునములయందు, తులాదయః=తుల మొదలుకొని నవాంశలు, కన్యకామృగవృషే=కన్యామకరవృషభముల యందు, మృగాదయః = మకరము మొదలుకొని నవాంశలు, మీనకర్క్యలిషు = మీన కటకవృశ్చికములయందు, కర్కటాదయః = కర్కాటము మొదలుకొని నవాంశలు - అనఁగా లగ్నము ౯ భాగములుచేసి ముహూర్తకాలఘడియల కే నవాంశకాల మగునో ఆనవాంశను మేషసింహధనువులైన త్రికోణరాసులకు మేషము మొదలుకొని మేష నవాంశమొదలని తెలుసుకొనునది. అందు తులాకుంభమిథునము లైన త్రికోణరాసులకు తులారాశి నవాంశమొదలుకొని చూచుకొనవలసినది. కన్యామకరవృషభములైన త్రికోణరాసులకు మకరనవాంశమొదలుకొని చూచుకో వలెను. మీనకటకవృశ్చికములైన త్రికోణరాసులకు కర్కాటకము మొదలుకొని చూచుకోవలసినది.

## ద్వాదశాంశక్రమము.

లగ్నాదిషు ద్వాదశాంశభవనా ద్వాదశాంశపాః,

టీ. లగ్నాదిషు=లగ్నాదిద్వాదశరాసులయందును, ద్వాదశాంశపాః=ద్వాదశాంశాధిపతులైనగ్రహములు, ద్వాదశాంశభవనాః=ద్వాదశాంశరాసులుగలవారు, భవంతి= అగుచున్నారు. అనఁగా లగ్నము ౧౨ భాగములుచేసి నిశ్చయమైన ముహూర్తకాలమునకు యీభాగములలో యేభాగమందుండునో లగ్నాది ఆసంఖ్య ద్వాదశాంశయనియు, ఆద్వాదశాంశాధిపతియనియు తెలియవలెను. మేషరాశి మొదలు మీనరాశిపర్యంతమును, వృషభరాశిమొదలు మేషరాశివరకు, మిథునరాశి మొదలు వృషభరాశివరకును ఈక్రమముగా తక్కినరాసులకును చూచుకొనునది,

## త్రింశాంశలక్షణము

కుజరవిజగురుజ్ఞ శుక్రభాగాః పవనసమీరణకౌర్పిజూకలేయాః,
అయుజియుజి తు తే విపర్యయస్థాశ్శశిభవనాళిఝషాంత్యమృక్షసంధిః.

టీ. కుజరవిజగురుజ్ఞశుక్రభాగాః = కుజశనిగురుబుధశుక్రులయొక్క భాగములు, పవనసమీరణకౌర్పిజూకలేయాః = ౫, ౫, ౮, ౭, ౫, అయుజి = బేసిరాశియందు, క్రమస్థాః = క్రమముగానుండును. తే = ఆగ్రహభాగములు, యుజితు = సమరాశియందైతే, విపర్యయస్థాః = విపర్యాసముగానుండును. శశిభవనాళిఝషాంత్యమృక్షసంధిః = కర్కాటకవృశ్చికమీనరాసులయొక్క అంత్యకాలము రాశిసంధియనియు నక్షత్రసంధియనియు ననఁబడును. అనఁగా లగ్నము ౩౦ భాగములుచేసి, ఆభాగములను కుజునికి ౫ భాగములు, శనైశ్చరునకు ౫ భాగములు, బృహస్పతికి ౮ భాగములు, బుధునికి ౭ భాగములు, శుక్రునికి ౫ భాగములు ఈప్రకారము పంచఁగా, ముహూర్తఘటిక యెవనిభాగములోనుండునో ఆగ్రహమును లగ్నము బేసిరాశియైనట్లైతే, కుజునిభాగములు మొదలుకొని క్రమముగా నాభాగముగలవాఁడు త్రింశాంశాధిపతి యని తెలుసుకొనునది. ఆలగ్నము సమరాశియైనట్లైతే శుక్రునిభాగము మొదలుకొని వ్యుత్క్రమముగా నాభాగముగలవాఁడు. త్రింశాంశాధిపతి యని తెలుసుకోఁదగిన దనిభావము. కటకరాశ్యంత్యభాగమును, సింహరాశిపూర్వభాగమును, వృశ్చికరాశ్యంత్య భాగమును, ధనూరాశిపూర్వభాగమును, మీనరాశ్యంత్యభాగమును, మేషరాశిపూర్వ భాగమును రాశిసంధులనియు. నక్షత్రసంధులనియు తెలిసికొనునది. నక్షత్రసంధుల కుదాహరణము —'ఆశ్రేషాంత్యం మఖాత్పూర్వం జ్యేష్ఠాంత్యం మూలపూర్వకమ్, రేవత్యశ్వినయోర్మధ్యే గండదోషాః ప్రకీర్తితాః.'

## పక్షచ్ఛిద్రములు

అష్టమీ ద్వాదశీ షష్ఠీచతుర్థీ చ చతుర్దశీ,
పక్షచ్ఛిద్రాశ్చ తిథయః శుభకార్యేషు నిందితాః. 45

టీ. అష్టమీ = అష్టమియు, ద్వాదశీ = ద్వాదశియు, షష్ఠీ = షష్ఠియు, చతుర్థీ = చతుర్థియు, చతుర్దశీ = చతుర్దశియు, పక్షచ్ఛిద్రాః = పక్షచ్ఛిద్రములు, తాః = ఆతిథులు శుభకార్యేషు = శుభకార్యములయందు, నిందితాః = నిందితములు, అనఁగా నీతిథులు పక్షచ్ఛిద్రములని పేళ్లు గలవియు, శుభకార్యములయందు కొఱగానివియు ననుట.

## పంచపర్వములు

కృష్ణాష్టమీ చతుర్దశ్యప్యమావాస్యా చ పూర్ణిమా,
సంక్రాంతిః పర్వతిథయో మునిభిః పరికీర్తితాః. 46

టీ. కృష్ణపక్షాష్టమియు, కృష్ణపక్షచతుర్దశియు, అమావాస్యయు, పున్నమయు, సంక్రమణప్రవేశతిథియును, పంచపర్వతిథులని ఋషీశ్వరులచేఁ జెప్పఁబడినవి.

పాదచ్ఛాయలచే ఘటికాప్రమాణము దెలిసికొనుట.

యావత్యశ్చరణప్రభాః ప్రతిదినం మేషాదిషట్సుక్రమా
ద్యోజ్యాశ్చైవతులాదిషట్సు జలధిత్రిద్వ్యక్షీ రామాబ్ధయః,
అర్ధీకృత్య దినప్రమాణఘటికా స్వస్తాహతా నాడికా
స్తావత్యః పరపూర్వయోః స్థితగతా యత్పూర్వసంఖ్యాభిధాః. 47

టీ. తననీడ తనయడుగులచేఁ గొలిచి, ఆయడుగులసంఖ్యతోడ, మేషకన్యా తులామీనమాసములయందు ౪ ను, వృషభసింహవృశ్చిక కుంభమాసములయందు ౩ ను, మిథున కర్కాట ధను ర్మకరమాసములయందు ౨-ను జేర్చి, అహఃప్రమాణ ఘటికల ౨ భాగములుఁజేసి, యందొకభాగము నేడింట గుణించి పూర్వోక్తం బగు నధిక సంఖ్యతోఁజేరిన పాదచ్ఛాయలసంఖ్యచే భాగించఁగ నేర్పడినన్నిగడియల ప్రొద్దు, మధ్యాహ్నమునకు ముందుగనైన జరిగినదనియు, మధ్యాహ్నమునకు పిమ్మట నైన నున్నదనియు నెఱుంగవలయును.

సులభముగా నహస్ప్రమాణముఁ దెలియుటకు
వరరుచివాక్యములు

"మేషేగిరిపు, వృషభేటనట, మిథునేకరిలి, కటకేకరుబ, తులాలసశ, వృశ్చికేదూతాస, ధనుషిసిజల, మకరందదాసి, కుంభేసితశ, మీనేశుభగ" ఈ ౧౨ టిలో మేషమాసమునందు మొదట పదిదినములవరకు తాను తననీడను గొలిచిన యడుగులసంఖ్యలో నరయడుగు తీసివేసి మిగిలినవానిలో మేష మాసవాక్యమందున్న మొదటియక్షరమునకుగల ప్రమాణము తీసివేసి మిగిలినప్రమాణము నుంచుకొనునది. మేషమాసమునందు రెండవపదిదినములకు రెండవ అక్షర ప్రమాణము తీసివేయునది. మూఁడవపదినినములలోను మూఁడవయక్షరప్రమాణమును తీసివేయవలయు. వృషభమాసమునందు మూఁడక్షరములును, పదిదినముల కొకయక్షరము చొప్పున నొక్కొకయక్షరమునకుగలప్రమాణమును తీసివేసి తక్కిన యడుగులకుగల ఘటికా ప్రమాణములు ముందుజెప్పఁబోవుప్రకారము నిశ్చయము చేసుకొనవలయు. ఈక్రమముగాఁ బండ్రెండుమాసములకును జూచుకొనవలయు. అక్షరప్రమాణమనఁగా సాంకేత నిఘంటువునందుఁ జెప్పినప్రకారము అక్షరమునకు యేసంఖ్యవచ్చునో అన్ని పరకలను తీసివేయునది. ఎట్లన్నను 'గి' యను నక్షరమునకు మూఁడు సంఖ్య, అందు మూఁడుపరకలు పాతికాపరక ఈ క్రమముగాఁ దెలియునది.

మఱియొకవిధము

నవత్యష్టపదా దేకా నాడికా తత్ర చోచ్యతే,
పంచార్ధచత్వారింశద్ద్వే అష్టావింశ త్త్రయ స్తథా. 48
ఏకోనవింశ శ్చత్వారి చతుర్దశ్యాంతు పంచకమ్,
దశార్ధే నాడికా షట్చ అష్టకే సప్తనాడికాః, 49
షట్పదే చాష్టకం వింద్యా చ్చతురర్ధే నవ స్మృతమ్,
త్రికార్ధే దశకం వింద్యా ద్వ్యర్ధ ఏకాదశ స్తథా. 50
ఏకత్రిపాదో ద్వాదశ్యాం పాద మేకం త్రయోదశ,
చతుర్థిశార్ధ పాదేన శూన్యే పంచదశ స్మృతాః. 51

టీ. ౯౮ అడుగులకు నొకగడియ, ౪౪½ అడుగులకు రెండుగడియలు, ౨౮ అడుగులకు మూఁడుగడియలు, ౧౯ అడుగులకు నాలుగుగడియలు, ౧౪ అడుగులకు అయిదుగడియలు, ౧౦½ అడుగులకు ఆఱుగడియలు, ౮ అడుగులకు యేడుగడియలు ౬ అడుగులకు ఎనిమిదిగడియలు, ౪½ అడుగులకు తొమ్మిదిగడియలు, ౩½ అడుగులకు పదిగడియలు, ౨½ అడుగులకు పదునొకొండుగడియలు, ౧¾ అడుగుకు పండ్రెండు గడియలు, ౧ అడుగుకు పదమూఁడుగడియలు, ½ అడుగుకు పదునాలుగుగడియలు. శూన్యచ్ఛాయ అయితే పదునైదుగడియలని తెలిసికొనునది.

ఇంత్రియంను ఘటికాప్రమాణకాలములను దెలిసికొనుటకై నక్షత్రస్వరూపములను జెప్పుచున్నాఁడు:—

వరరుచివాక్యములు

తురగముఖాశ్విని త్రీణి, భరణీ యోని త్రీణి, కృత్తికా క్షురా షట్కం, శకటం పంచ రోహిణీ, మృగశిరా శీర్షం త్రయం, ఆర్ద్రా ప్రవాళ మేకం, పునర్వసూ కులాలచక్రంపంచ, సరటా (సరళా) పుష్యమి త్రీణి, ఆశ్రేషా సర్పా ఋతు, మఖాందోళికా పంచ, పుబ్బ ఉత్తర నేత్రద్వయోః హస్తా పాణినా పంచ, చిత్రా ముక్తిక మేకం, స్వాతీ మాణిక్య మేకం, విశాఖా కులాలచక్రం పంచ, అనూరాధా జ్యేష్ఠాం గుళచ్ఛత్రాకార త్రయం, మూలాంకుశ్య త్కేసరీ పంచ, పూర్వాషాఢా ఉత్తరాషాఢా ద్వే ద్వే చౌకం, శ్రవణేచుత్వాస్యకార త్రయం, ధనిష్ఠా శీర్ష త్రయం, శతభిష క్ఛతం తారాః, పూర్వాభాద్ర ఉత్తరాభాద్ర ద్వే ద్వే ఖట్వాం, రేవతీ మత్స్యాకార త్రయం. ఈ ౨౭ ను నక్షత్రస్వరూపములు.

అశ్వినీనక్షత్రము అశ్వముఖమువలె మూఁడుపొట్టినక్షత్రములు గలదై యుండును, భరణీనక్షత్రము యోనివలె మూఁడునక్షత్రములుగలదై యుండును, కృత్తికానక్షత్రము మంగలకత్తివలె నాఱు నక్షత్రములు గలదై యుండును, రోహిణీనక్షత్రము బండివలె నైదునక్షత్రములు గలదై యుండును, మృగశిరానక్షత్రము శిరస్సువలె మూఁడు నక్షత్రములు గలదై యుండును. ఆర్ద్రానక్షత్రము పగడపువర్ణము గలిగిన యొంటినక్షత్రము గొప్పదై యుండును, పునర్వసునక్షత్రము కుమ్మరసారెవలె నయిదునక్షత్రములు గలదై యుండును, పుష్యమినక్షత్రము (పొట్లపూవు) తొండవలె మూఁడునక్షత్రములు గలదై యుండును, ఆశ్లేషానక్షత్రము సర్పమువలె నాఱునక్షత్రములు గలదై యుండును, మఘానక్షత్రము పాలకివలె అయిదునక్షత్రములుగలదై యుండును, పుబ్బనక్షత్రము నేత్రములవలె రెండునక్షత్రములు గలదై యుండును, ఉత్తరనక్షత్రమును నేత్రములవలె రెండు నక్షత్రములు గలదై యుండును, హస్తనక్షత్రము చేతివేళ్లవలె అయిదునక్షత్రములు గలదై యుండును, చిత్తానక్షత్రము ముత్యమువలె నొకనక్షత్రము గలదై యుండును, స్వాతీనక్షత్రము మాణిక్యమువలె నొకనక్షత్రము గలదై యుండును. విశాఖనక్షత్రము కుమ్మరసారెవలె అయిదునక్షత్రములు గలదై యుండును, అనూరాధాజ్యేష్ఠలు అంకుశమువలె ఛత్రాకారమై మూఁడునక్షత్రములుగలదై యుండును, మూలానక్షత్రము గొంటి సింహమువలె అయిదునక్షత్రములు గలదై యుండును, పూర్వాషాఢ ఉత్తరాషాఢలు రెండును రెండురెండునక్షత్రములు ఒకచౌకమువలె నుండును, శ్రవణనక్షత్రము మత్స్యమువలె మూఁడునక్షత్రములుగలదై యుండును, ధనిష్ఠానక్షత్రము శిరస్సువలె మూఁడునక్షత్రములుగలదై యుండును, శతభిషనక్షత్రము నూఱునక్షత్రములు నొకపుష్పమువలె నుండును, పూర్వాభాద్ర ఉత్తరాభాద్రలు రెండును రెండురెండునక్షత్రములుగలిగి మంచపుకోళ్లవలె నుండును, రేవతీనక్షత్రము మత్స్యమువలె మూఁడునక్షత్రములుగలదై యుండును.

### ఉచ్చనక్షత్రములను దెలిసికొనుక్రమము

జ్యేష్ఠాదీనా మతిక్రమ్య పౌష్ణాదీనాం త్వనాగమే,
ఆర్ద్రాదీనాం సమం జ్ఞేయం నవ షడ్ద్వాదశ క్రమాత్. 52

టీ. జ్యేష్ఠ మొదలు ౯ నక్షత్రములను మించినదుమనుండి వాలుచుండగా నుచ్చము. రేవతి మొదలు ౬ లను మించి నడిమి కొక్కుచుండఁగా నుచ్చము. ఆర్ద్ర మొదలు ౧౨ లను మించినదుమ నుండఁగా నుచ్చమని తెలియునది.

### ఉచ్చనక్షత్రములను కనిపెట్టి మేషాదిరాసుల ప్రమాణములలో చెల్లినగడియలను దెలిసికొనువివరము

### వరరుచివాక్యములు

శ్రోణా మేషే రతా, శ్రవిష్ఠా వృషభే నభ, శతభిషగ్వృషభే ధామః, ప్రోష్ఠపాన్మిథునే పరః, అహిర్బుధ్న్యే మిథునే భానుః, రేవతీ

కర్కీ యజ్ఞః, అశ్వినీ కర్కీ రూప, భరణీ కర్కీ శాబ, కృత్తికా సింహే కాయ, రోహిణీ సింహే గురుః, మృగశిరాః కన్యా నేయ, ఆర్ద్రా కన్యా యుతా, పునర్వసూతులా నీలా, పుష్య స్తులా రామః, ఆశ్రేషా తులా భోగి, మఖా వృశ్చిక కల, ఫల్గునీ వృశ్చిక లతా, ఉత్తరా ధను ర్నామ, హస్తా ధను ర్బలా, చిత్తా ధను శ్శర, స్వాతీ మకరే కామ, విశాఖా మకరే వనం, అనూరాధా కుంభేనాభిః, జ్యేష్ఠా కుంభే కథా, మూల కుంభే గచ్ఛ, పూర్వాషాఢా మీనే కవిః, ఉత్తరాషాఢా మీనేగాథా.

టీ. శ్రోణా మేషే రతా=శ్రవణనక్షత్ర ముచ్చయందుంటే మేషలగ్నము నందు ౩౫ఘడియ చెల్లును. శ్రవిష్ఠా వృష భేనభ=ధనిష్ఠానక్షత్ర ముచ్చయుందుంటె వృషభ లగ్నమునందు ౪ ఘడియ చెల్లును, శతభిషగ్వృష భేరామః = శతభిషనక్షత్ర ముచ్చయందుంటే వృషభలగ్నమునందు ౩౪౨ ఘడియ చెల్లును. ప్రోష్ఠపా న్మిథునే పరః = పూర్వాభాద్ర నక్షత్ర ముచ్చయందుంటే మిథునలగ్నమునందు ౧౹ ఘడియ చెల్లును. అహిర్బుధ్న్యో మిథునే భానుః=ఉత్తరాభాద్రనక్షత్ర ముచ్చయుంటుంటే మిథునలగ్నములందు ౮ ఘడియలుచెల్లును. రేవతీ కర్కీ యజ్ఞః = రేవతీనక్షత్ర ముచ్చయందుంటే కర్కాటకలగ్నమందు ౧౮౨ ఘడియ చెల్లును. అశ్వినీకర్కీ రూప = అశ్వినీనక్షత్ర ముచ్చయుందుంటే కర్కాటలగ్నమునందు ౩౨ ఘడియ చెల్లును. భరణి కర్కీ శాబ=భరణి నక్షత్రముచ్చయందుంటే కర్కాటకలగ్నము నందు ౫౹౨ ఘడియ చెల్లును. కృత్తికా సింహే కాయ = కృత్తికానక్షత్ర ముచ్చ యందుంటే సింహాలగ్నమునందు ౧౨ ఘడియ చెల్లును. రోహిణీ సింహే గురుః= రోహిణీనక్షత్ర ముచ్చయందుంటే సింహాలగ్నమునందు ౩౹ ఘడియ చెల్లును. మృగ శిరాః కన్యా నేయ = మృగశిరానక్షత్ర ముచ్చయందుంటే కన్యాలగ్నమునందు ౨ ఘడియ చెల్లును. ఆర్ద్రాకన్యాయుతా = ఆర్ద్రానక్షత్ర ముచ్చయందుంటే కన్యా లగ్నమునందు ౧౫ ఘడియచెల్లును పునర్వసు తులా నీలా = పునర్వసునక్షత్ర ముచ్చయందుంటే తులాలగ్నమునందు ౹౨ ఘడియచెల్లును. పుష్యస్తులా రామః = పుష్యమీనక్షత్ర ముచ్చయందుంటే తులాలగ్నమునందు ౩౪౨ ఘడియ చెల్లును. ఆశ్రేషాతులాభోగి = ఆశ్రేషానక్షత్ర ముచ్చయుందుంటే తులాలగ్నమునందు ౮౹౨ ఘడియచెల్లును. మఖావృశ్చికకల=మఖానక్షత్ర ముచ్చయందుంటే వృశ్చికలగ్నము నందు ౧౹౨ ఘడియచెల్లును. ఫల్గునీ వృశ్చిక లతా=పుబ్బానక్షత్ర ముచ్చయం దుంటే వృశ్చికలగ్నమునందు ౩౫ ఘడియ చెల్లును. ఉత్తరా ధను ర్నామ=ఉత్తరా నక్షత్రముచ్చయంగుంటేధనుర్లగ్నమునందు ౪౨ ఘడియ చెల్లును. హస్తాధనుర్బలా= హస్తనక్షత్రముచ్చయందుంటే ధనుర్లగ్నమునందు ౩౹౨ ఘడియ చెల్లును. చిత్తాధను శ్శరః=చిత్తానక్షత్రముచ్చయందుంటే ధనుర్లగ్నమునందు ౫ ఘడియ చెల్లును. స్వాతీ

మకరేకామ=స్వాతీనక్షత్రముచ్చయందుంటే మకరలగ్నమునందు ౧౪౨ ఘడియ చెల్లును. విశాఖామకరేవసం = విశాఖానక్షత్రముచ్చయందుటే మకరలగ్నమునందు ౮ ఘడియలు చెల్లును. అనూరాధా కుంభే నాభిః=అనూరాధానక్షత్రముచ్చయందుంటే కుంభలగ్నమునందు ౪ ఘడియచెల్లును. జ్యేష్ఠా కుంభే కథా=జ్యేష్ఠా నక్షత్రముచ్చయందుంటే కుంభలగ్నమునందు ౧౫౨ ఘడియచెల్లును. మూలా కుంభేగచ్ఛ=మూలానక్షత్రముచ్చయందుంటే కుంభలగ్నమందు ౩౫౪ ఘడియ చెల్లును, పూర్వాషాఢా మీనే కవిః = పూర్వాషాఢానక్షత్రముచ్చయందుంటే మీనలగ్నమునందు ౧౪ ఘడియ చెల్లును. ఉత్తరాషాఢా మీనేగాథా=ఉత్తరాషాఢా నక్షత్రముచ్చయుందుంటే మీనలగ్నమునందు ౩౫౨ఘడియ చెల్లును. ఈక్రమముగాఁ దెలిసికొనునది. ఈవాక్యములయందు అంత్యాక్షరములైన రెంటిలోను మొదటియక్షరమునకు ఘడియలును, రెండవయక్షరమునకు పరకలు నని తెలియనగును.

సంజ్ఞాప్రకరణము సంపూర్ణము

---

ముహూర్తప్రకరణము జాతకర్మములు

ముఖావలోకేన సుతస్య జీవతః పితా విముచ్యేత యత స్తదర్ణతః,
తతః క్షణాదీ న్విగణయ్య తత్క్షణం విధీయతే జన్మవిధి స్సుతోదయే.

టీ. జీవతః=జీవించుచున్న. సుతస్య = కుమారునియొక్క, ముఖావలోకేన= మోముచూచుటచేత, పితా=తండ్రి, తదర్ణతః=పితృఋణమునుండి, యతః=ఏకారణమువలన, విముచ్యేత=విడువఁబడునో. తతః=అందువలన, క్షణాదీన్ = క్షణాది కాలములను, విగణయ్య=ఎంచి, తత్క్షణం=అపుడు, సుతోదయే=కొమారునిపుట్టుకయందు, జన్మవిధిః=జాతకర్మ, విధీయతే = విధింపఁబడుచున్నది. అనఁగా తండ్రి పుట్టి జీవించియున్న కొమారునిముఖము జూచుటవలన తాను పితృఋణవిముక్తుఁడగును గనుక కుమారుఁడు గలిగినవార్త వినిన వెంటనే శీఘ్రముగా జాతకర్మ జేయవలెను,

పుత్రజన్మని యజ్ఞే చ తథా సంక్రమణే రవేః,
రాహోః ప్రదర్శనే స్నానం ప్రశస్తం నాన్యథా నిశి. 2

టీ. పుత్రజన్మని=పుత్రోత్పత్తియందును, యజ్ఞే=యజ్ఞమందును, తథా = ఆప్రకారము, రవేః=సూర్యునియొక్క, సంక్రమణేచ = సంక్రమణకాలములందును, రాహోః ప్రదర్శనే=గ్రహణమునందును, స్నానం=రాత్రిస్నానము, ప్రశస్తం=ప్రశస్తము, అన్యథా=తక్కిన కాలమందు, నిశి = రాత్రియందు, స్నానం=స్నానము,న=ప్రశస్తముగాదు. అనఁగా కొమారుఁడు కొమార్తె బుట్టినకాలములయందును,

యజ్ఞాంత కాలమునందును, సంక్రమణ ప్రవేశపుణ్యకాలములయందును, సూర్యచంద్రగ్రహణముల యందును స్నానముముఖ్యము. ఇవిరాత్రియందు ప్రాప్తమైనయెడల నప్పుడే స్నానము జేయవలయును, వీనియందుదక్క నితరసమయములలో రాత్రి స్నానము చేయరాదు.

గ్రహణోద్వాహసంక్రాన్తి యాత్రాసు ప్రసవేషుచ,
దానం నైమిత్తికం జ్ఞేయం రాత్రావపి నదూష్యతి, 3

టీ. గ్రహణోద్వాహసంక్రాంతి యాత్రాసు - గ్రహణ = గ్రహణకాలమందును, ఉద్వాహ=వివాహములయందును, సంక్రాంతి = మేషాదిసంక్రమణ కాలములయందును, యాత్రాసు = యాత్రలయందును, ప్రసవేషు = పుత్రపుత్రికోత్పత్తి కాలములయందును, నైమిత్తికం = నిమిత్తమువలన వచ్చునదని, జ్ఞేయం= తెలియఁదగినది. రాత్రావపి = రాత్రియందును, నైమిత్తికందానం=నిమిత్తమువలన వచ్చిన దానము, నదూష్యతి = దూషింపఁ దగినదికాదు. అనగా నైమిత్తికదానములకు రాత్రియందు దోషములేదు.

యావన్న చ్ఛిద్యతే నాళం తావ న్నాప్నోతి సూతకమ్,
ఛిన్నే నాళే తతః పశ్చా త్సూతకంతు విధీయతే. 4

టీ. నాళం=బొడ్డుతీఁగె, యావన్నచ్ఛిద్యతే=ఎంతకాలము కోయఁబడదో, తావత్=అంతపర్యంతము, సూతకం = జాతాశౌచమును, నాప్నోతి = చెందఁడు. నాళేఛిన్నేసతి=బొడ్డుతీఁగె కోయఁబడి యుండగా, తతః పశ్చాత్=అటుతర్వాత, సూతకంతు=జాతాశౌచము, విధీయతే = విధింపఁబడుచున్నది. అనఁగా శిశువు పుట్టిన పిమ్మట యెంతపర్యంతము బొడ్డుఁదీగె కోయరో అంతపర్యంతము పురుఁడులేదు గనుక అంతవరకు పుత్రజన్మయందు జేయఁదగిన స్నానదానాదుల జేయఁదగు.

దృష్ట్వా తతశ్చ విధివత్సచేలస్నాన మాచరేత్,
దత్వా గోభూహిరణ్యాది పశ్చా ల్లగ్నం నిరీక్షయేత్. 5

టీ. దృష్ట్వా=శిశువునుజూచి, తతః=అటుతర్వాత. విధివత్=యథాశాస్త్రముగా, సచేలస్నానం = వస్త్రముతోటిస్నానమును, ఆచరేత్ = చేయఁదగినది. గోభూహిరణ్యాది = గోదానభూదానస్వర్ణదానము మొదలయినదానములను, దత్వా = ఇచ్చి, పశ్చాత్ = పిమ్మట, లగ్నం = జననకాలలగ్నమును, నిరీక్షయేత్ = చూడఁదగినది. అనఁగా శిశువు బుట్టిన పిమ్మట జాతకునియొక్క భావఫలముల జూడవలసినది.

తస్మిన్ జన్మముహూర్తేఽపి సూతకాంతేఽథవా శిశోః,
జాతకర్మచ కర్తవ్యం పితృపూజనతత్పరైః. 6

టీ. తస్మిన్=ఆ ప్రసిద్ధమయిన, జన్మముహూర్తేఽపి = జననకాలముహూర్తమందైన, అథవా=అటుగాక, శిశోః=శిశువుయొక్క సూతకాంతే = పురుడుతీరిన కాలమందైనా, పితృపూజనతత్పరైః = మాతృపితృపూజాసక్తిగలవారిచేత, జాతకర్మచ = జాతకర్మము, కర్తవ్యం = చేయఁదగినది. అనగా శిశువు పుట్టినప్పుడైనను పురుడుతీరిన పిమ్మటనైనను నామకరణకాలమందైనను జాతకర్మము చేయవచ్చును.

## నామకరణము

నామకర్మ దశమేఽథవా హని ద్వాదశే శుచిషువా విధీయతే,
స్వోచ్చమిత్రభవనేషు సద్గ్రహైస్తాదృశై ర్యదివిలోకితాశ్శుభాః.

టీ. దశమేఽహని=దశమదివసమునందైనా, అథవా=అటుగాక. ద్వాదశేఽహని=పదిరెండవదివసమునందైనా,శుచిషువా = శుభదివసములయందైనా, శుభాః= శుభఫల ప్రదులైన, సద్గ్రహైః=శుభగ్రహములు, స్వోచ్చమిత్రభవనేషు=తమతమ యుచ్చమిత్ర క్షేత్రములయందుండఁగాను, తాదృశైః = అటువంటిశుభగ్రహముల చేతను, విలోకితాయది = చూడఁబడినను, నామకర్మ=నామకరణము, విధీయతే = చేయఁదగినది. అనగా నామకరణము దశమదివసమందైనను పదిరెండవదివసమందైనను జేయుట మంచిది, అటుగాకున్న శుభదినములయందు సూర్యాదిగ్రహములు తమతమ యుచ్చమిత్రస్వక్షేత్ర కేంద్రకోణములలోఁ గూడియున్న కాలముల యందు నామకరణము జేయుట మంచిది. (ఈశ్లోకార్థమందు నామకరణము దశమ దివసమందైనను ద్వాదశ దివసమందైనను జేయుట మంచిదని చెప్పఁబడియున్నది గదా, ఈయర్థ మితర గ్రంథములకు విరుద్ధమైయున్నందున యీవచనము పూర్వ పక్షవచనమని నిర్ణయముచేసి సిద్ధాంతవచనములను వ్రాయుచున్నాఁడు.)

## కాలామృతమందు

జాతానంతర మేవ నామకరణం త్వేకాద ఒహ్నిస్ఫుటం
పుత్రస్యైవ సమాక్షరంతు యువతేః కార్యం తతో వ్యత్యయమ్,
శుద్ధిర్బ్రాతకవచ్చ నామ్ని సకలై స్తద్ద్వాదశే షోడశే
ద్వావింశేఽప్యథవింశకేఽహ్ని విహితం జాతివ్యవస్థాం వినా, 8

టీ. పుత్రుఁడు గలిగినక్షణంబున నక్షత్రనామమనఁగా రోహిణీనక్షత్రమందు బుట్టినవానికి రౌహిణుఁడు ఈమొదలగు నక్షత్రనామకరణము రహస్యముగాఁ జేసి ౧౧వ దివసమందు కుమారవిషయమై సమానవర్ణములుగల పేరనఁగా; కృష్ణః, శివః మహేశ్వరః - ఇట్టి వ్యవహారనామములును, కూఁతురివిషయమై బేసియక్షరములుగల నామ మనగా; జానకీ, పార్వతీ, భవానీ-ఇట్టినామములునిశ్చయించవలెను, ఈనామ కరణవిషయమయి లగ్నాదిశుద్ధి పూర్వశ్లోకమునందు జాతకర్మమునకు నిర్ణయించిన

ప్రకార మని తెలియవలయు. ౧౧-వ దివసమందుఁ జేయనిపక్షమున బ్రాహ్మణులు మొదలుగాఁగల ౪ వర్ణములకు ౧౦ దివసముల పర్యంతము జాతాశౌచమని విశేష వచనములుండుటవలన జాతిభేదములేక నాలుగువర్ణములవారును పుట్టినదినము మొదలు ౧౨-వ దివసమందును, ౧౬-వ దివసమందును, ౨౧-వ దివసమందును, ౨౨-వ దివసమందును నామకరణము చేయవచ్చును.

మిత్రాదిత్య మఖోత్తరాశతభిషక్స్వాతీధనిష్ఠాచ్యుత
ప్రాజేశాశ్వశశాంక పౌష్ణదినకృత్పుష్యేషు రాశౌ స్థిరే,
ఛిద్రా న్పంచదశీం విహాయ నవమీం శుద్ధేఽష్టమే భార్గవ
జ్ఞాచార్యామృత పారవార దివసే నామాని కుర్యాచ్ఛిశోః. 9

టీ. మిత్రాదిత్యమఖోత్తరాశతభిషక్స్వాతీ ధనిష్ఠాచ్యుతప్రాజేశాశ్వశశాంకపౌష్ణదినకృత్పుష్యేషు-మిత్ర=అనూరాధ, అదిత్య=పునర్వసు, మఖ=మఖ, ఉత్తర=ఉత్తరోత్తరాషాఢోత్తరాభాద్రలు, శతభిషక్=శతభిషము, స్వాతీ=స్వాతి, ధనిష్ఠా=ధనిష్ఠ, అచ్యుత=శ్రవణము, ప్రాజేశ=రోహిణి, అశ్వ=అశ్విని, శశాంక = మృగశీర్ష, పౌష్ణ=రేవతి, దినకృత్=హస్త, పుష్య=పుష్యమి, ఈనక్షత్రములయందును, స్థిరే=స్థిరమైన, రాశౌ=రాశియందును, ఛిద్రాన్=పక్షచ్ఛిద్రతిథులను, పంచదశీం=పూర్ణిమ అమావాస్యలను, నవమీం=నవమిని, విహాయ=విడిచిపెట్టి, అష్టమే=ఎనిమిదవస్థానము, శుద్దేసతి=గ్రహవర్జితమగుచునుండఁగా, భార్గవజ్ఞాచార్యామృతపారవారదివసే=శుక్ర బుధగురుసోమ కుజవారములయందును, పితా=తండ్రి, శిశోః=శిశువునకు, నామాని=మాసనామ నక్షత్రనామవ్యవహారనామములను కుర్యాత్=చేయవలసినది.

దైవపూర్వం కరాల్లేఖ్యం శర్మ వర్మానుభావతః,
సుశ్రీయుతం నామపూర్వం రేఖాంతం సుమనోక్షరైః. 10

టీ. దైవపూర్వం = దేవతావాచకశబ్దము పూర్వమందు గలుగునట్లుగా, పూర్వం=వ్యవహారనామంబునకాదియందు, సుశ్రీయుతం=సుఅను అక్షరముతోఁగాని శ్రీకారముతోఁగానిగూడినట్టి, నామ=నామధేయము, సుమనోక్షరైః=సంస్కృత భాషావర్ణములచేత, రేఖాంతం = పంక్తిరుదనుక, శర్మవర్మానుభావతః = బ్రాహ్మణ క్షత్రియ వైశ్యశూద్రజాతుల కుచితంబులైన శర్మ వర్మ గుప్తదాస యనుపదముల నుంచి, కరాల్లేఖ్యం=హస్తముచేత వ్రాయఁదగిన దనుట.

కృష్ణోఽనంతోఽచ్యుత శ్చక్రీ వైకుంఠోఽథ జనార్దనః,
ఉపేంద్రో యజ్ఞపురుషో వాసుదేవ స్తథా హరిః, 11
గోవిందః పుండరీకాక్షో మాసనామాన్యనుక్రమాత్,
కేచి న్నక్షత్రనామాని కుర్వన్తి విదితాగమాః. 12

టీ. కృష్ణః=కృష్ణుఁడు, అనంతః = అనంతుఁడు, అచ్యుతః = అచ్యుతుఁడు, చక్రీ = చక్రి, వైకుంఠః=వైకుంఠుఁడు, జనార్దనః=జనార్దనుఁడు, ఉపేంద్రః = ఉపేంద్రుఁడు, యజ్ఞపురుషః = యజ్ఞపురుషుఁడు, వాసుదేవః = వాసుదేవుఁడు, హరిః = హరి, గోవిందః = గోవిందుఁడు, పుండరీకాక్షః = పుండరీకాక్షుఁడు, ఈపండ్రెండును, అనుక్రమాత్ = వరుసగా, మాసనామాని=చైత్రాదిద్వాదశమాస నామంబులనియెఱుంగవలయు. కేచిత్=కొందఱు, విదితాగమాః = శాస్త్రవేత్తలు, నక్షత్రనామాని = నక్షత్రనామంబులను, కుర్వంతి = చేయుచున్నారు, అనఁగా తండ్రి కుమారునికి నామకరణము సేయునపుడు ముందుగా నిందు చెప్పియున్న కృష్ణుఁడు మొదలయిన పండ్రెండు నామధేయములను తెలుసుకొని చైత్రాదిమాసంబులలో నేమాసంబగునో ఆమాసమును వ్రాయవలసినది. ఈప్రకారముగా నె నక్షత్రనామ వ్యవహారనామంబులను వ్రాయవలసినదనుట.

మార్గశీర్షేచ వాగ్దేవీ పుష్యే పద్మావతీ భవేత్,
శ్రీదేవీచైవ సావిత్రీ భూమీ కళ్యాణికా స్మృతా. 13
సత్యభామా పుణ్యవతీ రూపిణీ చేందుమత్యపి,
చంద్రావతీచ లక్ష్మీచ స్త్రీనామకరణే విదుః, 14

టీ. మార్గశీర్షే = మార్గశిర్షమాసమునందు, వాగ్దేవి=వాగ్దేవి. పుష్యే=పుష్యమాసమునందు, పద్మావతీ=పద్మావతి, శ్రీదేవీ=మాఘమాసమునందు శ్రీదేవి, సావిత్రీ= ఫాల్గునమాసమునందు సావిత్రి, భూమీ = చైత్రమాసమునందు భూదేవి, కళ్యాణికా = వైశాఖమాసమునందు కళ్యాణి, సత్యభామా = జ్యేష్ఠమాసమునందు సత్యభామ, పుణ్యవతీ = ఆషాఢమాసమునందు పుణ్యవతి, రూపిణీ=శ్రావణమాసమునందు రూపిణి, ఇందుమతీ=భాద్రపదమాసమునం దిందుమతి, చంద్రావతీ = అశ్వయుజ మాసమునందు చంద్రావతి, లక్ష్మీః=కార్తికమాసమునందు లక్ష్మి, వీటిని, స్త్రీనామ కరణే = స్త్రీయొక్క నామకరణమందు, మాసనామానీతి = మాసనామంబులని, విదుః = పెద్దలు తెలియుదురు.

కుమారస్యాభివృద్ధ్యర్థం కుర్యాద్బ్రాహ్మణభోజనమ్.

టీ. కుమారస్య=కుమారునకు. అభివృద్ధ్యర్థం=ఉత్తరోత్తరాభివృద్ధి గలుగుట కొరకు, బ్రాహ్మణభోజనం = బ్రాహ్మణభోజనంబును, పితా=తండ్రి, కుర్యాత్ = చేయవలయును.

ద్వ్యక్షరం వా చతురక్షరం వా వివర్జితో పాంత్యలకార రేఫమ్,
తన్నామనామాదిక మేకచిత్తస్స్ఫుటం వదే ద్దక్షిణకర్ణరంధ్రే. 15

టీ. తండ్రియగువాఁడు, ఏకచిత్తః=నిశ్చలచిత్తుఁడై, వివర్జితోపాంత్యలకార రేఫం వ్యవహారముయొక్క అంతిమాక్షరమునకు పూర్వమునందు వర్జింపఁబడిన లకార

రేఫములు గలిగినట్టియు, ద్వికాక్షరం వా = రెండువర్ణములు గలదియైనను, చతురక్షరం వా = నాలుగువర్ణములుగలదియైనను, వ్యవహారనామమును, తన్మాసనామాదికం = ఆశిశువుయొక్క మాసనక్షత్రనామపూర్వకంబుగా, దక్షిణకర్ణరంధ్రే = శిశువుయొక్క కుడిచెవి రంధ్రమున, స్ఫుటం = వ్యక్తమగునట్లు, వదేత్ = చెప్పవలయును.

అష్టమస్థా గ్రహాస్సర్వే నేష్టా స్తే నామకర్మణి,
ధనపుత్రసుహృద్భ్రాతృనవమేతు శుభశ్శశీ. 15
పాపాస్త్రిషష్ఠలాభస్థాః నామకర్మణి పూజితాః,
ద్వాదశేఽహాని కర్తవ్యం శిశోర్నిష్క్రమణం గృహాత్. 17

టీ. నామకర్మణి = నామకరణమందు, సర్వే గ్రహాః = సూర్యాదినవగ్రహములు, అష్టమస్థా = అష్టమస్థానమందున్నవారై, నేష్టాః = ఇష్టఫలంబుల నిచ్చువారుగారు. శుభః = శుభగ్రహాయుక్తుఁడై, ధనపుత్రసుహృద్భ్రాతృనవమే = ద్వితీయపంచమచతుర్థతృతీయనవమస్థానములయందు, స్థితః = ఉన్న, శశీ = చంద్రుఁడును, త్రిషష్ఠలాభస్థాః = తృతీయషష్ఠలాభస్థానములందున్న, పాపాః = రవ్యంగారకశనిరాహుకేతువులును, నామకర్మణి = నామకరణమందు పూజితాః = పూజింపఁబడినవారు (అనఁగా శుభఫలంబుల నిచ్చువారనుట) ద్వాదశేఽహాని = పదిరెండవదినమునందు, గృహాత్ = సూతికాగృహమునుండి, శిశోః = చిన్నవానియొక్క, నిష్క్రమణం = బయలు వెడలించుట, కర్తవ్యం = చేయఁదగినది.

## కంచుకధారణము

అశ్వినీత్వాష్ట్రపౌష్ణేజ్యమిత్రోత్తరకరానిలే,
సితసౌమ్యేజ్యవారేషు చంద్రతారాబలాన్వితే. 18
శుభే ముహూర్తే పూర్వాహ్ణే జయే పూర్ణదినే తథా,
కేంద్రత్రికోణగాస్సౌమ్యాః పాపాస్త్ర్యాయారిరాశిగాః, 19
శిశూనాం ధారయేత్తత్ర కంచుకం చిత్రవర్ణకమ్,

టీ. అశ్వినీత్వాష్ట్రపౌష్ణేజ్యమిత్రోత్తరకరానిలే = అశ్విని చిత్త రేవతి పుష్యమి అనూరాధోత్తరోత్తరాషాఢోత్తరాభాద్రాహస్తస్వాతులయందు, సితసౌమ్యేజ్యవారేషు = శుక్ర బుధ గురువారములయందు, చంద్రతారాబలాన్వితే = చంద్రతారాబలములతోఁగూడినట్టి, శుభే ముహూర్తే = శుభముహూర్తమునందు, పూర్వాహ్ణే = పగటి మొదటిభాగమునందు, జయే = జయతిథియందు, పూర్ణదినే = సంపూర్ణదినమందు, సౌమ్యాః = శుభగ్రహములు, కేంద్రత్రికోణగాస్సంతః = కేంద్రత్రికోణస్థానములను బొందియుండఁగాను, పాపాః = పాపగ్రహములు, త్ర్యాయారిరాశిగాస్సంతః = తృతీయై

కావలసమష్టస్థానములను బొందియుండగాను, శిశూనాం=బాలురకు, చిత్రవర్ణకం=నానావర్ణములుగల, కంచుకం=చొక్కాయిని, ధారయేత్ = తొడిగింపవలయు.

## డోలారోహణము

తృతీయే పంచమే మాసి తస్మాసేవా శుభే దినే. 20
ధాతృమూలోత్తరత్రీణి తిర్యగ్భేషు ద్విదైవభే,
చంద్రతారాబలయుతే చాష్టమే శుద్ధిసంయుతే. 21
డోలా మారోపయే ద్బాలం ద్విజపుణ్యాంగనాదిభిః,

టీ. తృతీయే=మూడవమాసమునందైనను, పంచమేమాసి=ఐదవమాసమునందైనను, తస్మాసేవా = ఆశిశువుజనించినమాసమునందైనను, శుభేదినే = శుభదివసమునందు, ధాతృమూలోత్తరత్రీణి తిర్యగ్భేషు=రోహిణీమూలోత్తరాషాఢోత్తరాభాద్ర తిర్యఙ్ముఖనక్షత్రములయందును, (తిర్యఙ్ముఖనక్షత్రంబు లనగా, రేవతి పునర్వసు హస్త చిత్త స్వాతి అశ్విని మృగశీర్షానురాధా జ్యేష్ఠలనుట,) ద్విదైవభే = విశాఖానక్షత్రమునందును, చంద్రతారాబలయుతే = చంద్రతారాబలసంపన్నంబైన శుభముహూర్తంబునందును, అష్టమే=ఎనిమిదవస్థానము, శుద్ధిసంయుతేసతి = గ్రహావర్జితంబగుచుండగాను, ద్విజపుణ్యాంగనాదిభిః=బ్రాహ్మణముత్తైదువలు మొదలగువారిచేత, బాలం=శిశువును, డోలాం = ఉయ్యాలను, ఆరోపయేత్ = ఎక్కింపవలయు (అనగా, శిశువును ఉయ్యాలమీద గూర్చుండబెట్టి యూచవలయుననుట).

## నవాన్నప్రాశనము

షష్ఠేఽష్టమేవా దశమేచ మాసి సంవత్సరేవా దివసే ప్రవృద్ధే,
పక్షేసితేవ్యోమ్ని విశుద్ధిభాజి బాలాన్నభుక్తి ర్విహితా మునీంద్రైః,

టీ. షష్ఠే = ఆఱవమాసమందైనను, అష్టమేవా = ఎనిమిదవమాసమందైనను, దశమేచమాసి=పదియవమాసమందైనను, సంవత్సరేవా=వర్షాంతమునందైనను, దివసే=పగటియందును, ప్రవృద్దే పక్షే=శుక్లపక్షమునందును, సితే=శుక్రుడు, వ్యోమ్ని=ఆకాశమునందు, విశుద్ధిభాజిసతి = మిక్కిలిపరిశుద్ధుడై ప్రకాశించుచుండగాను, బాలాన్నభుక్తిః = బాలురకు నవాన్నప్రాశనము, మునీంద్రైః = ఋషీశ్వరులచేత, విహితా = చెప్పబడినది.

దేవతాపురత స్తస్య జాతు రుత్సంగగస్యచ,
అలంకృతస్య భూషాభి రన్నపాత్రేచ వాంఛితే. 23
మధ్వాజ్యకనకోపేతే ప్రాశయే త్పాయసం శుభమ్,

టీ. దేవతాపురతః = దేవతాసన్నిధియందు, దాతురుత్సంగగస్యచ = అన్నప్రాశనముచేయువాని తొడయందు కూర్చున్నట్టియు, భూషాభిః = ఆభరణములచేత, అలంకృతస్య = అలంకరింపఁబడిన, తస్య = ఆశిశువునకును, మధ్వాజ్యకనకోపేతే = తేనె నెయ్యి బంగారుతోఁగూడిన, వాంఛితే = ప్రియమైన, అన్నపాత్రే = సువర్ణరజితాది వికారంబైన భోజనపాత్రంబునందు, స్థితం = ఉంచిన, శుభం = శుభకరమైన, పాయసం = క్షీరాన్నమును, ప్రాశయేత్ = భక్షింపఁ జేయవలయును. అనఁగా బాలురకు నవీనాన్నప్రాశనము సేయునెడల మేనమామను మొదలగువారు శిశువును దమతొడమీఁద కూర్చుండఁ బెట్టికొని సువర్ణాదివికారంబైనపాత్రంబునందు పాయసంబునుంచి దానియందు నెయ్యి తేనెయును మిశ్రముచేసి అట్టిపాయసంబును సువర్ణాభరణాదులచేత దేవతా ప్రతిమయెదుర నాశిశువునకు నూతనాన్నప్రాశనము సేయవలయును.

ఆదిత్య సౌమ్యవసుతిష్యకరానిలాశ్వి మైత్రాఖ్య విష్ణువరుణోత్తరభాని చిత్రా, బాలాన్నభోజనవిధౌ దశమే చ శుద్ధే ఛిద్రాన్విహాయ నవమీం తిథయ శ్శుభాస్స్యుః. 25

టీ. ఆదిత్యసౌమ్యవసుతిష్యకరానిలాశ్విమైత్రాఖ్య విష్ణువరుణోత్తరభాని - ఆదిత్య = పునర్వసు, సౌమ్య = మృగశీర్ష, వసు = ధనిష్ఠ, తిష్య = పుష్యమి, కర = హస్త, అనిల = స్వాతి, అశ్వి = అశ్విని, మైత్రాఖ్య = అనూరాధ, విష్ణు = శ్రవణము, వరుణ = శతభిషము, ఉత్తరాభాని = ఉత్తరోత్తరాషాఢోత్తరాభాద్రలును, చిత్రా = చిత్తానక్షత్రము, దశమేచ = అన్నప్రాశనలగ్నమునకు బదియవది యగుస్థానము, శుద్ధేసతి = గ్రహరహితంబగుచుండఁగాను, ఛిద్రాన్ = ఛిద్రతిథులను, నవమీంచ = నవమిని, విహాయ = విడిచి, తిథయః = మిగిలినతిథులు బాలాన్నభోజనవిధౌ - బాల = బాలురయొక్క, అన్నభోజనవిధౌ = అన్నప్రాశనవిధియందు శుభాః = శుభఫలంబునిచ్చునవి, స్యుః = అగుచున్నవి.

వారాశ్శుభాశ్చ గురుచంద్రసితేందుజానాం మేషాళిమీనరహితాని హితాని భాని, భుక్తౌ శిశోశ్శుభకరాః పరిహృత్య సౌమ్యం భౌమం సితం నవమనైధనసప్తమేషు.

టీ. శిశోః = శిశువుయొక్క, భుక్తౌ = అన్నప్రాశనవిధియందు, గురుచంద్రసితేందుజానాం = గురు సోమ శుక్ర బుధులయొక్క, వారాశ్చ = వారములును, శుభాః శుభ = కరములైనవి, మేషాళిమీనరహితాని = మేషవృశ్చికమీనరాసులచేత వర్జితములైన, భాని = రాసులును, హితాని = ఇష్టఫలములనిచ్చునవి, నవమనైధనసప్తమేషు = నవమాష్టమ సప్తమస్థానములయందు, సౌమ్యం = బుధుని, భౌమం = అంగారకుని, సితం = శుక్రుని, క్రమముగా, పరిహృత్య = విడిచిపెట్టి, ఇతరస్థానములయందున్న సూర్యాదినవగ్రహములును, శుభకరాః = శుభములను జేయువారనుట.

కాలామృతమందు

కుక్షి లగ్నగతే రవౌ తనుకళే చంద్రే సదా భిక్షుకః
పూర్ణేందౌ బహుసత్రదోఽవనిసుతే పిత్తార్దితో జ్ఞానవాన్,
జ్ఞే జీవే బహుభోగవాన్ భృగుసుతే దీర్ఘాయు రర్కాత్మజే
వాతాంగీ తమసి ధ్వజేఽప్యవశనీ బాలోఽన్నభోక్తా భవేత్.

టీ. అన్నప్రాశనలగ్నమందు సూర్యుఁడుండిన చిన్నవాఁడు కుష్ఠరోగియును, క్షీణచంద్రుఁడుండిన దరిద్రుఁడును, పూర్ణచంద్రుఁడుండిన నన్నదాతయును, అంగారకుఁడుండిన పైత్యరోగియును, బుధుఁడుండిన విశేషజ్ఞానవంతుఁడును, గురువుండిన మిక్కిలి భోగవంతుఁడును, శుక్రుఁడుండిన దీర్ఘాయువుగలవాఁడును, శనైశ్చరుఁడుండిన వాతరోగముతోఁ గూడిన శరీరముగలవాఁడును, రాహుకేతువులుండిన మిక్కిలిదరిద్రుఁ డౌను.

నవవస్త్రధారణము

హస్తోత్తరానిలపునర్వసుతిష్యమిత్ర
త్వాష్ట్రద్విదైవవిధివారుణపౌష్ణభేషు,
రిక్తాః క్రియాళిహరిచాపఝషార్కభౌమ
వారాన్విహాయ నవవస్త్ర ముశన్తి ధార్యమ్. 27

టీ. హస్తోత్తరానిల పునర్వసుతిష్యమిత్రత్వాష్ట్రద్విదైవ విధివారుణపౌష్ణభేషు- హస్త=హస్తయందును, ఉత్తరా = ఉత్తరోత్తరాషాఢోత్తరాభాద్రలయందును, అనిల=స్వాతియందును, పునర్వసు = పునర్వసునక్షత్రమందును, తిష్య=పుష్యమియందును, మిత్ర=అనూరాధయందును, త్వాష్ట్ర=చిత్రయందును, ద్విదైవ = విశాఖయందును, విధి = రోహిణియందును. వారుణ = శతభిషయందును, పౌష్ణభేషు = రేవతియందును, రిక్తాః=రిక్తతిథులను, క్రియాళిహరిచాపఝషార్కభౌమవారాన్- క్రియ=మేషమును, అళి = వృశ్చికమును, హరి = సింహమును, చాప=ధనుస్సును, ఝష = మీనమును, అర్క = ఆదివారమును, భౌమవారాన్ = అంగారకవారములు, విహాయ = విడిచిపెట్టి, మిగిలిన తిథిరాశి వారములయందు, నవవస్త్రం = నూతనవస్త్రము, ధార్యం = ధరింపఁదగినదని, ఉశంతి=పెద్దలు చెప్పుచున్నారు.

కేశఖండనము

అశ్వి పుష్యపునర్వసూ మృగశిరస్స్వాత్యన్త విష్ణుత్రయం
చంద్రజ్ఞామరపూజ్యశుక్రసహితాః పూర్ణా జయాఖ్యాశ్శుభాః
పూర్వాహ్ణే శుభలగ్న హోరదివసే యుగ్మేచమాసే శిశోః
కేశచ్ఛేదన మిష్టదం మునివరై రుక్తం వరాహాదిభిః. 28

టీ. అశ్వి=అశ్వినియు, పుష్యపునర్వసూ = పుష్యపునర్వసునక్షత్రములును, మృగశిర స్వాత్యంతవిష్ణుత్రయం = మృగశీర్ష స్వాతి రేవతిశ్రవణ ధనిష్ఠశతభిషము లును, చంద్ర జ్ఞామరపూజ్య శుక్రసహితాః = చంద్రబుధగురుశుక్రవారములతోఁ గూడిన, పూర్ణాః = పూర్ణతిథులును, జాయాఖ్యాః= జయతిథులును, శుభాః = కేశఖండనమునందు శుభకరములైనవి. ఇదియునుంగాక, పూర్వాహ్ణే = పగటి పూర్వభాగమునందును, శుభలగ్నహోరదివసే = శుభగ్రహసంబంధిరాసులయందును హోరలయందును శుభదినమునందును, యుగ్మే మాసేచ = సమమాసమునందును, శిశోః=శిశువునకు, కేశచ్ఛేదనం = కేశఖండనము, ఇష్టదం = శుభప్రదంబని, వరాహాదిభిః = వరాహమిహిరులు మొదలుగాఁ గల, మునివరైః=ఋషిశ్రేష్ఠులచేత, ఉక్తం = చెప్పఁబడినది యనుట.

## కర్ణవేధము

మాసే షష్ఠే సప్తమే వాష్టమేవా వేధ్యౌ కర్ణౌ ద్వాదశే షోడశేఽహ్ని, మధ్యే వాహ్నః పూర్వభాగే నరాత్రౌ నక్షత్రే ద్వే ద్వే తిథీ వర్జయిత్వా.

టీ. ద్వాదశే = శిశువుబుట్టినదివసమునకు పంద్రెండవదిసమునందైనను, షోడశేఽహ్ని = పదియాఱవదివసమందైనను, అథవా = అటుగాకపోయిన, షష్ఠేమాసే = ఆఱవమాసమందైనను, సప్తమేవా=ఏడవమాసమందైనను, అష్టమేవా = ఎనిమిదవ మాసమందైనను, మధ్యేవా = మధ్యాహ్నకాలమందైనను, అహ్నః=పగటియొక్క, పూర్వభాగే = పూర్వభాగమునందైనను, ద్వేనక్షత్రే=రెండునక్షత్రములను, ద్వేతిథీ= రెండుతిథులను, వర్జయిత్వా = విడిచిపెట్టి; అనగా, పూర్ణనక్షత్రపూర్ణతిథుల యందును, శిశోః = శిశువుయొక్క, కర్ణౌ = చెవులు, వేధ్యౌ=కుట్టతగినవి. రాత్రౌ= రాత్రికాలమునందున కర్ణవేధము కూడదనుట.

హరిహరకరచిత్రా సౌమ్యపౌష్ణోత్తరార్ద్రాదితివసుషుఘటాలీసింహలగ్నైర్వివర్జ్యే, శశిబుధగురుకావ్యే వాసరే పర్వరిక్తారహితతిథిషు శుద్ధే నైధనే కర్ణవేధః.

టీ. హరిహరకరచిత్రాసౌమ్యపౌష్ణోత్తరార్ద్రాదితివసుషు = శ్రవణార్ద్రాహస్తచిత్రామృగశీర్షరేవత్యుత్తరాషాఢోత్తరాభాద్రాపుష్యపునర్వసుధనిష్ఠలయందును, ఘటాలీసింహాలగ్నైః= కుంభవృశ్చికసింహలగ్నములచేత, వివర్జ్యే=విడువఁబడిన ఇతరలగ్నములయందు, శశిబుధగురుకావ్యేవాసరే = సోమబుధగురుశుక్రవారములయందును, పర్వరిక్తారహితతిథిషు-పర్వ = పంచపర్వములచేతను, రిక్తా = రిక్తతిథులచేతను, రహిత=వర్జితములైన, తిథిషు = ఇతరతిథులయందు, నైధనే = లగ్నంబున కెనిమిదవస్థానము, శుద్ధేసతి=గ్రహవర్జితంబగుచునుండఁగా, కర్ణవేధః= కర్ణవేధము, కార్యః = చేయఁదగినది యనుట.

కర్ణవేధనలగ్నస్య నేష్టాస్సర్వేఽష్టమేస్థితాః,
ఉక్తేనైవ విధానేన కుర్యాత్కర్ణస్య వేధనమ్.   31
అను క్రమపి కుర్యాచ్చేత్కర్ణచ్ఛేదో భవిష్యతి,

టీ. కర్ణవేధనలగ్న=కర్ణవేధనలగ్నమునకు, అష్టమే=ఎనిమిదవస్థానమునందు, స్థితాః=ఉన్న, సర్వే=సమస్తగ్రహములును, నేష్టాః=ఇష్టఫలముల నిచ్చువారుగారు, ఉక్తేనైవ విధానేన=ఈ వెనుక జెప్పఁబడినవిధిచేతనే, కర్ణస్యవేధనం=కర్ణవేధమును, కుర్యాత్=చేయునలయును. అనుక్రమపి=ఈ చెప్పఁబడనిదానిని, కుర్యాచ్చేత్=చేసిన యెడల, కర్ణచ్ఛేదః-కర్ణ=చెవులయొక్క, ఛేదః=తెగిపోవుట, భవిష్యతి=కాఁగలదనుట.

చౌలవిధి

తృతీయవర్షేప్యథ పంచమేఽబ్దే గతత్రిభాగే ప్రవదంతి చౌలమ్,
ఉదగ్గతేఽర్కే గురుశుక్రతేజః ప్రకాశితం వ్యోమ్ని చ శుక్లపక్షే.

టీ. తృతీయవర్షేపి=3-వ సంవత్సరమునందైనను, అథ = అటుగాకపోయిన, పంచమేబ్దే=5-వ సంవత్సరమునందైనను, గతత్రిభాగే-గత=గడచినట్టి, త్రిభాగే=3 భాగములు గలిగిన, పంచమ = 5-వ సంవత్సరమునందును, అర్కే = సూర్యుఁడు, ఉదగ్గతేసతి=ఉత్తరాయణము బొందియుండఁగాను, వ్యోమ్ని = ఆకాశమునందు, గురుశుక్రతేజః = గురుశుక్రుల తేజస్సు, ప్రకాశితం సత్ = ప్రకాశించుచునుండఁగాను, శుక్లపక్షేచ=శుక్లపక్షమునందును, చౌలమ్=చౌలకర్మము. కార్యమ్=చేయఁదగినదియని, ప్రవదంతి=చెప్పుచున్నారు.

ఆదిత్యసౌమ్యవసువైష్ణవపౌష్ణతిష్యత్వాష్ట్రాశ్విచండకిరణేషు దివా ప్రశస్తమ్, స్వాతీవిధాతృవరుణోత్తరభాని మధ్యాన్యాహుర్నిశాస్వపి నచ క్షురకర్మ కార్యమ్.

టీ. ఆదిత్యసౌమ్యవసువైష్ణవపౌష్ణతిష్యత్వాష్ట్రాశ్విచండకిరణేషు - ఆదిత్య=పునర్వసుయందును, సౌమ్య=మృగశీర్షయందును, వసు=ధనిష్ఠయందును, వైష్ణవ=శ్రవణనక్షత్రమునందును, పౌష్ణ=రేవతియందును, తిష్య = పుష్యమియందును, త్వాష్ట్ర=చిత్తయందును, ఆశ్వి=అశ్వినియందును, చండకిరణేషు=హస్తయందును, దివా=పగటియందు, చౌలమ్=చౌలము, ప్రశస్తమ్=ప్రశస్తంబైనది యనియును, స్వాతీవిధాతృవరుణోత్తరభాని = స్వాతీరోహిణిశతభిషగుత్తరోత్తరాషాఢోత్తరాభాద్రలు, మధ్యాని=చూడాకర్మంబునందు మధ్యనక్షత్రంబులనియు, నిశాస్వపి=రాత్రియందును, క్షురకర్మ=చౌలకర్మ, నకార్యమ్=చేయఁదగినదిగాదనియు, ఆహుః=పెద్దలు చెప్పిరనుట.

షష్ఠ్యష్టమీ ప్రతిపదుస్తిథయశ్చ రిక్తా వర్జ్యా శ్శశాంకగురుసోమజ

భార్గవాణామ్, వారాంశకోదయవిలోకన మిష్ట మాహుః క్షౌరేతు
కర్మణి శుభం న దిశంతి చాన్యే.

టీ. క్షౌరేతుకర్మణి = క్షురకర్మమునందు, షష్ఠ్యష్టమీ ప్రతిపదః = షష్ఠ్యష్టమీ ప్రతిపత్తులనెడు, తిథయశ్చ = తిథులును, రిక్తాః=రిక్తతిథులును, వర్జ్యాః = విడువఁదగినవి. శశాంక గురుసోమజభార్గవాణాం = చంద్రగురుబుధశుక్రులయొక్క, వారాంశకోదయ విలోకనం-వార = వారములను, అంశక=అంశలను, ఉదయ = లగ్నములను, విలోకనమ్ = దృష్టులను, ఇష్టం = అభీష్టఫలంబుల నిచ్చువానినిగా, ఆహుః=చెప్పిరి. అన్యే = ఇతరములైన పాపగ్రహములయొక్క వారాంశలగ్న దృష్టులైన, శుభమ్ = శుభఫలమును, నదిశంతి = ఈయవు.

కర్క్యంగనామిథునమీనతులోక్షనక్రాః
పూజ్యాః క్రియాళిహరిచాపఘటా జఘన్యాః,
తేఽపి స్వవీర్యశుభఖేటయుతా విధేయా
శ్చౌలే ఘట శ్శుభయుతోఽపి నిషిద్ధఏవ. 35

టీ. చౌలే=చూడాకర్మమునందు, కర్క్యంగనామిథున మీనతులోక్షనక్రాః= కర్కాటక కన్యామిథున మీనతులావృషభమకరరాసులు, పూజ్యాః=ఉత్తమంబులు, క్రియాళిహరిచాపఘటాః = మేషవృశ్చికసింహధనుః కుంభరాసులు, జఘన్యాః = అధమములు. తేఽపి=అయాధమములైన మేషవృశ్చికసింహధనుః కుంభరాసులును, స్వవీర్యశుభఖేటయుతాశ్చేత్-స్వవీర్య=తమయొక్కబలములతోడను, శుభఖేట= శుభగ్రహములతోడను యుతాశ్చేత్ = కూడుకొనియున్నట్లయితే, విధేయాః = చేయఁదగినవి అయినప్పటికిని, ఘటః = కుంభరాశి, శుభయుతోఽపి = శుభగ్రహ సహితంబైనప్పటికిని, నిషిద్ధఏవ = చూడాకర్మంబునందు నిషేధింపఁబడినదే.

త్రికోణకేంద్రాయగతేషు సౌమ్యే
ష్వాయారిదుశ్చిక్యభసంశ్రితేషు,
పాపేషు శుద్ధేఽష్టమకే శిశూనాం
చౌలం ప్రశస్తం మునిభిః ప్రదిష్టమ్. 36

టీ. సౌమ్యేషు=సౌమ్యగ్రహములు, త్రికోణకేంద్రాయగతేషుసత్సు-త్రికోణ= పంచమనవమస్థానములను, కేంద్ర = లగ్నచతుర్థసప్తమదశమస్థానములను, ఆయ= పదునొకొండవస్థానమును, గతేషుసత్సు = పొందియుండఁగా, పాపేషు = పాప గ్రహములు, ఆయారిదుశ్చిక్యభమ్ = పదునొకొండాఱుమూఁడు ఈరాసులను, ఆశ్రితేషు సత్సు = ఆశ్రయించియుండఁగాను, అష్టమకే = ఎనిమిదవస్థానము, శుద్ధేసతి = గ్రహవర్జితంబగుచుండఁగాను, శిశూనాం = శిశువులకు, చౌలం=చౌల కర్మ, ప్రశస్తం=ప్రసిద్ధమైనదిగా, మునిభిః = ఋషీశ్వరులచేత, ప్రదిష్టం=చెప్పఁబడినది యనుట.

సూనోర్మాతరి గర్భిణ్యాం చూడాకర్మ న కారయేత్,
యది కుర్యాద్విపత్తిస్స్యాద్దంపత్యోశ్చ శిశోశ్చవా. 37

టీ. సూనోః=శిశువుయొక్క, మాతరి = తల్లి, గర్భిణ్యాంసత్యాం = గర్భము గలదగుచుండఁగా, చూడాకర్మ=చూడాకర్మము, నకారయేత్ = చేయఁగూడదు. కుర్యాద్యది=చేసెనేని, దంపత్యోశ్చ = దంపతులకైనను, శిశోశ్చవా = శిశువునకు నైనను, విపత్తిః = ఆపద, స్యాత్ = అగునని తెలియవలయును.

అక్షరస్వీకరణము

ఉదగర్కే పంచమేఽబ్దే పంచమే మాసి పంచమే,
దివసేఽపి చ బాలానా మక్షరగ్రహణం స్మృతమ్. 38

టీ. ఉదగర్కే = సూర్యుఁడు ఉత్తరాయణమును బొందియుండఁగాను, పంచమేఽబ్దే=ఐదవసంవత్సరంబునందు, పంచమేమాసి=ఐదవమాసమునందు, పంచమేదివసేఽపిచ=ఐదవదినమందును, బాలానాం= గ్రహణధారణపటువులైన బాలురకు, అక్షరగ్రహణం = అక్షరస్వీకరణము, స్మృతం = మునులచేత జెప్పఁబడినది.

ఉదగ్గతే భాస్వతి పంచమేఽబ్దే ప్రాప్తేఽక్షరస్వీకరణం శిశూనామ్,
సరస్వతీంవిఘ్నవినాయకంచ గుడోదనాద్యైరభిపూజ్య కుర్యాత్.

టీ. భాస్వతి=సూర్యుఁడు, ఉదగ్గతేసతి=ఉత్తరపుదిక్కును పొందియుండఁగా, పంచమేఽబ్దే = ఐదవసంవత్సరము, ప్రాప్తేసతి = ప్రాప్తమగుచుండఁగా, సరస్వతీం = వాగ్దేవిని, విఘ్నవినాయకంచ = గణాధిపతిని, గుడోదనాద్యైః = పాయసము మొదలైన ద్రవ్యములచేత, అభిపూజ్య=పూజించి, శిశూనాం = బాలురకు, అక్షరస్వీకరణం = అక్షర స్వీకారమును, కుర్యాత్ = చేయవలయు ననుట.

హస్తాదిత్యసమీరమిత్రపురజిత్పౌష్ణాశ్విచిత్రాచ్యుతే
ష్వారార్కార్కజవాసరాదిరహితే రాశౌ చరే చోభయే.
పక్షే పూర్ణనిశాకరే ప్రతిపదం రిక్తా విహాయాష్టమీం
షష్ఠీ మష్టమశుద్ధిభాజి భవనే ప్రోక్తాఽక్షరస్వీకృతిః. 40

టీ. హస్తాదిత్యసమీరమిత్రపురజిత్పౌష్ణాశ్విచిత్రాచ్యుతేషు=హస్త పునర్వసు స్వాత్యనూరాధార్ద్రారేవత్యశ్వినీచిత్రాశ్రవణములయందు, ఆరార్కార్కజవాసరాదిరహితే=కుజభానుమందవారములచేత వర్జితంబులైన వారములయందును, అనఁగాశుభగ్రహవాసరములయందును, చరేరాశౌ=చరరాశియందును, ఉభయేపక్షే=ఉభయపక్షములయందును, పూర్ణనిశాకరే=పూర్ణచంద్రుఁడు, స్థితేసతి=ఉండియుండఁగాను, ప్రతిపదం=ఉభయప్రతిపత్తులను, రిక్తాః=రిక్తతిథులను, అష్టమీం = ఉభయాష్టములను,

షష్ఠీం=ఉభయషష్ఠులను, విహాయ=విడిచిపెట్టి, అష్టమశుద్ధి భాజి=అష్టమశుద్ధిని పొందిన, భవనే=లగ్నమునందు, అక్షరస్వీకృతిః=అక్షరస్వీకరణము, ప్రోక్తా=చెప్పఁబడినది.

ఉక్తర్తౌ గర్భాష్టమాద్యుక్తవర్షే విప్రాదీనాముచ్యతే మౌంజిబంధః,
అర్థాయస్త్రీధర్మపుత్రాఖ్యసంస్థే చేద్వాగీశేస్యాచ్ఛిశోర్మౌంజిబంధః.

టీ. గర్భాష్టమాద్యుక్తవర్షే='గర్భాష్టమేషు బ్రాహ్మణ ముపనయీ' తేత్యాది శ్రుతులయందు జెప్పఁబడినసంవత్సరములయందు, ఉక్తర్తౌ = చెప్పఁబడినవసంతాది ఋతువులయందును, విప్రాదీనాం = బ్రహ్మక్షత్రియవైశ్యులకు, మౌంజిబంధః=ఉపనయనము, ఉచ్యతే = చెప్పఁబడుచున్నది. వాగీశే = బృహస్పతి, అర్థాయస్త్రీధర్మపుత్రాఖ్యసంస్థేచేత్ = శిశుజన్మనక్షత్రరాశికి ద్వితీయలాభ సప్తమ నవమ పంచమస్థానములందుండెనేని, శిశోః=బాలునకు, మౌజిబంధః = ఉపనయనము, స్యాత్ = అగునని తెలియవలెను.

ఋగ్వేదాధిపతి ర్జీవో యజుర్వేదాధిప స్సితః,
సామవేదాధిపో భౌమ శ్శశిజోఽథర్వనాయకః. 42

టీ. జీవః=బృహస్పతి, ఋగ్వేదాధిపతిః = ఋగ్వేదంబున కధిపతియనియు, సితః=శుక్రుఁడు, యజుర్వేదాధిపః = యజుర్వేదంబున కధిపతియనియు, భౌమః = అంగారకుఁడు, సామవేదాధిపః=సామవేదంబున కధిపతియనియు, శశిజః=బుధుఁడు, అథర్వనాయకః = అథర్వణవేదంబున కధిపతియనియుఁ దెలియవలయు ననుట.

చంద్రాదిత్యోత్తరాశ్విశ్రవణవసుమరుత్త్వాష్ట్రపౌష్ణార్కమిత్ర
ప్రాజేశార్ద్యేషు సౌమ్యామరగురుశశిభృగ్వారరాశ్యంశకేషు,
త్యక్తానధ్యాయరిక్తాపితృతిథిషు యమారార్కయుక్తాన్యరాశౌ
గోజోపాంత్యాఙ్గనాకర్కితులమిథునభేష్వష్టమే ధామ్ని శుద్ధే. 43

టీ. చంద్రాదిత్యోత్తరాశ్విశ్రవణ వసుమరుత్త్వాష్ట్రపౌష్ణార్కమిత్రప్రాజేశార్ద్యేషు =మృగశీర్ష పునర్వసూత్తరోత్తరాషాఢోత్తరాభాద్రాశ్వినీ శ్రవణ ధనిష్ఠస్వాతిచిత్త రేవతీ హస్తానూరాధా రోహిణీ పుష్యములయందును, సౌమ్యామరగురు శశిభృగ్వారరాశ్యంశకేషు=బుధ గురు సోమ శుక్రాంగారకులయొక్క రాసులయందును, అంశలయందును, త్యక్తానధ్యాయరిక్తాపితృతిథిషు-త్యక్త=విడువఁబడిన, అనధ్యాయ= నిత్యనైమిత్తికానధ్యాయములును, రిక్తా=రిక్తతిథులును పితృతిథిషు=శ్రాద్ధదివసములునుగల తిథులయందును, యమారార్కయుక్తాన్యరాశౌ=శన్యంగారకసూర్యులతోఁగూడిన రాసులకంటెనన్యంబులైన రాసులయందును, గోజోపాంత్యాంగనాకర్కితులమిథునభేషు = వృషభ మేష కుంభ కన్యా కటక తులా మిథున రాసులయందును, అష్టమే

ధామ్ని = ఉపనయనలగ్నంబున కెనిమిదవలగ్నంబు, శుద్ధేసతి=గ్రహవర్జితంబగుచు నుండఁగాను, ఉపనయనం=ఉపనయనము, కార్యం=చేయఁదగినది యనుట.

గ్రంథాంతరమందు.

మైత్రహస్తత్రయే విష్ణుత్రయే పౌష్ణోత్తరాత్రయే,
ధాతృద్వయేఽదితీజ్యేచ దస్రభే హ్యుత్తమం వ్రతమ్. 44

టీ. మైత్రహస్తత్రయే = అనూరాధా హస్తచిత్త స్వాతులయందును, విష్ణుత్రయే=శ్రవణ ధనిష్ఠా శతభిషములయందును, పౌష్ణోత్తరాత్రయే=రేవత్యుత్తరోత్తరాషాఢోత్తరాభాద్రలయందును, ధాతృద్వయే = రోహిణీ మృగశీర్షలయందును, అదితీజ్యేచ = పునర్వసుపుష్యములయంగును, దస్రభేచ=అశ్వినియందును, వ్రతం= ఉపనయనవ్రతము, ఉత్తమంహి = ముఖ్యమైనది యనుట.

మౌంజీబంధః శస్యతే బ్రాహ్మణానాం గర్భాధానా జ్జన్మతోవాష్టమేఽబ్దే, భూమీశానామేక మేకాదశేఽబ్దే వైశ్యానాన్తు ద్వాదశే తద్వదేవ. 45

టీ. బ్రాహ్మణానాం=బ్రాహ్మణులకు, గర్భాధానాత్=గర్భాధానము మొదలుకొని యైనను, జన్మతోవా = పుట్టినది మొదలుకొనియైనను, అష్టమే = ఎనిమిదవదియైన అబ్దే = సంవత్సరమునందు, మౌంజీబంధః = ఉపనయనము, శస్యతే = ప్రశంసింపఁబడుచున్నది. ఏవం=ఈచెప్పిన గర్భధారణజన్మదినాదిగా, ఏకాదశే= పదునొకొండవదియగు. అబ్దే = సంవత్సరమునందు భూమీశానాం = క్షత్రియులకును, తద్వదేవ=అట్లెయగునే, ద్వాదశే = పండ్రెండవసంవత్సరమునందు. వైశ్యానాంతు = వైశ్యులకును, మౌంజీబంధః = ఉపనయనము, శంశ్యతే = ప్రశంసింపఁబడుచున్నది యని నిర్ణయము.

ఋతుర్వసంతశ్శుభదోఽగ్రజానాం గ్రీష్మోనృపాణాంచశరద్విశాంచ,
వ్రతస్యబంధే యదివాఖిలానాంమాఘాదయఃపఞ్చభవన్తిమాసాః.

టీ. అగ్రజానాం = బ్రాహ్మణులకు, వసంతఋతుః = వసంతర్తువును, నృపాణాం = క్షత్రియులకు, గ్రీష్మః = గ్రీష్మఋతువును, విశాం=వైశ్యులకు, శరచ్చ= శరదృతువును, వ్రతస్యబంధే = ఉపనయనవ్రతమునందు, శుభదః = శుభప్రదంబైనది, యదివా=పక్షాంతరంబునందు, అఖిలానాం = సమస్తబ్రాహ్మణాదివర్ణములకును, మాఘాదయః=మాఘమాసము మొదలైన, పఞ్చమాసాః = ఐదుమాసములును, శుభదాః=శుభంబులు, భవంతి=అగుచున్నవి యని యెఱుంగవలయు ననుట.

చంద్రో మాతా పితా సూర్యః ప్రాణాశ్చైవ బృహస్పతిః,
తస్మా ద్బలత్రయం భావ్యం లగ్నేవా గోచరేఽపివా. 47

టీ. చంద్రః=చంద్రుఁడు, మాతా=మాతృకారకుఁడు, సూర్యః=సూర్యుఁడు, పితా = పితృకారకుఁడు, బృహస్పతిః=గురుడు, ప్రాణాశ్చైవ=ప్రాణకారకుఁడును, భవన్తి=అగుచున్నారు. తస్మాత్=అందువలన, లగ్నేవా=ఉపనయన లగ్నమునందైనను, గోచరేఽపివా = గ్రహచారమునందైనను, బలత్రయం = చంద్రరవిగురు బలములు, భావ్యం = విచారింపఁదగును.

శాఖేశరవివర్ణేశగురూణాం బలపూర్వకమ్,
తథాప్యేషాం గురుబలం ముఖ్య మాచార్యశిష్యయోః. 48

టీ. శాఖేశరవివర్ణేశగురూణాం=స్వశాఖాధిపరవివర్ణాధిపబృహస్పతులయొక్క, బలపూర్వకమ్=బలము పూర్వమందుఁ గలుగునట్లుగా, ఉపనయనముహూర్తము విచారింపఁదగినది. తథాపి=అటులైనను, ఈచెప్పిన స్వశాఖాధిపరవివర్ణాది బృహస్పతుల లోపల, గురుబలమ్=బృహస్పతిబలము, ఆచార్యశిష్యయోః = ఆచార్యవటువులకు, ముఖ్యమ్ = అవశ్యకంబుగా నుండవలయును.

ఉక్తేఽపి వర్షే నబలీ గురుశ్చే చ్ఛాంత్యా ప్రశస్తం వ్రతబంధకర్మ,
అనుక్తవర్షే స బలప్రదోఽపి నైవైతయో రబ్దబలం బలీయః. 49

టీ. ఉక్తేపివర్షే=ఉపనయ నార్హంబుగాఁ జెప్పఁబడిన గర్భాష్టమాది సంవత్సరముల యందును, గురుః=బృహస్పతి, నబలీచేత్ = స్థానాదిషడ్బలయుక్తుఁడు గాకపోయినట్లాయెనా, శాంత్యా=అబృహస్పతి విషయమైన జపహోమాదిశాంతిచేత, వ్రతబంధకర్మ = ఉపనయనవ్రతము, ప్రశస్తమ్ = ప్రసిద్ధంబగును. అనుక్తవర్షే = చెప్పఁబడని సంవత్సరమునందు, సః=అబృహస్పతి, బలప్రదోపి = బలయుక్తుండైనను, నైవ = సమర్థుఁడుగాఁడు, తయోః = ఆసంవత్సర బృహస్పతి బలంబులలోపల, అబ్దబలం = సంవత్సరబలము, బలీయః = బలవత్తరంబైనది యని తెలియవలయును.

జన్మాన్త్యనిధనస్థోఽపి పూజయా శుభదో గురుః,
ఉక్తాబ్దే చే దనుక్తేతు న శుభో బలవానపి. 50

టీ. ఉక్తాబ్దే = ఉక్తసంవత్సరమునందు, గురుః=బృహస్పతి, జన్మాంత్యనిధనస్థోఽపి=వటువునకు జన్మద్వాదశాష్టమస్థానములయందుండినను, పూజయా = జపహోమాది పూజచేత, శుభదః=శుభఫలప్రదుండు, భవతి = అగుచున్నాఁడు. అనుక్తేతు = చెప్పఁబడని సంవత్సరమునందైన, సః = అబృహస్పతి, బలవానపి=బలవంతుఁడైనను, నశుభః=శుభప్రదుఁడు గాఁడని తెలియవలయుననుట.

కోదండకర్కిమీనేషు స్థితోఽపి శుభదో గురుః,
తద్రాశిభాగసంస్థోఽపి శుభదః ప్రోచ్యతే స్వయమ్. 51

టీ. గురుః = బృహస్పతి, కోదండకర్కిమీనేషు = ధనుఃకటకమీనరాసుల యందు, స్థితోఽపి = ఉన్నవాఁడౌచు, శుభదః = శుభప్రదుండు, భవతి=అగుచున్నాఁడు. సః = బృహస్పతి, స్వయం = తాను, తద్రాశిభాగసంస్థోఽపి=ఆధనుఃకటకమీనరాసులయొక్క అంశలనున్నవాఁడైనను, శుభదః = శుభప్రదుండని, ప్రోచ్యతే = చెప్పఁబడుచున్నాఁడను.

స్వోచ్చే స్వమిత్రే స్వగృహే త్రికోణే జీవోగతో యద్యుపనీతకాలే,
శిశోశ్చతుర్థే నిధనేతృతీయే కర్మాంత్యసంస్థోఽపి శుభప్రదస్స్యాత్,

టీ. ఉపనీతకాలే = ఉపనయనకాలమందు, జీవః=బృహస్పతి, శిశోః=శిశువుయొక్క జన్మరాశికి, చతుర్థే=౪-వ యింటను, నిధనే = ౮-వ యింటను, తృతీయే=3-వ యింటను, కర్మాంత్యసంస్థోఽపి-కర్మ=౧౦-వ యింటను, అంత్య = ౧౨-వ యింటను,సంస్థోఽపి=ఉన్నవాఁడైనను, స్వోచ్చే=తనయుచ్చయందైనను,స్వమిత్రే=తన మిత్రక్షేత్రమందైనను, స్వగృహే =తనయింటనైనను, త్రికోణే = తనమూలత్రికోణమునందైనను, గతో యది = పొందియుండిననేని, శుభదః = శుభఫలంబుల నిచ్చువాఁడు, స్యాత్ = అగును.

ద్వితీయాం చ తృతీయాచ పంచమీ సప్తమీ తథా,
త్రయోదశీచ దశమీ ప్రశస్తా స్తిథయో వ్రతే. 53

టీ. వ్రతే=ఉపనయనవ్రతమునందు, ద్వితీయా=విదియయును, తృతీయా=తదియయును, పంచమీ = పంచమియును, సప్తమీ = సప్తమియును, త్రయోదశీచ=త్రయోదశియును, దశమీ=దశమియును, తిథయః = ఈతిథులు, ప్రశస్తాః=ప్రసిద్ధంబులని తెలియవలయుననుట.

పూర్వపక్షే శ్శుభః ప్రోక్తః కృష్ణశ్చాంత్య త్రికం వినా,
కృష్ణపక్షేఽపి తత్ర్యంశే త్రయోదశ్యపి కేచన. 54

టీ. వ్రతే=ఉపనయనవ్రతమునందు, పూర్వపక్షః=శుక్లపక్షము, శుభః=శుభకరంబని, ప్రోక్తః=చెప్పఁబడినది. కృష్ణశ్చ = కృష్ణపక్షమును, అంత్యత్రికంవినా=మూఁడవపంచకమునువిడిచి, శుభ=శుభప్రదంబనఁబడును, కేచన=కొందఱు గ్రంథకర్తలు, కృష్ణపక్షే = కృష్ణపక్షమందు, తత్ర్యంశేపి=ఆకృష్ణపక్షపు మూఁడవపంచకంబునందును, త్రయోదశ్యపి = త్రయోదశియును, శుభా = శుభకరంబని చెప్పుచున్నారు.

ఆపంచమ్యాస్తు తిథయః పరా స్స్యురతినిందితాః,
నిత్యానధ్యాయదివసా న్వర్జయే ద్వాపనాయనే. 55

టీ. ఆపంచమ్యాః=పంచమిమొదలుకొని, పరాః=కృష్ణపక్షసంబంధములైన, తిథయః = పదిదినములును, అతినిందితాః = మిక్కిలి నిందింపఁబడినవి, స్యుః=అగు

చున్నవి. గనుక నాతిథులను, నిత్యానధ్యాయదివసాన్ = నిత్యనైమిత్తికానధ్యాయ దినములను, ఔపనాయనే = ఉపనయనవ్రతమునందు, వర్జయేత్ = త్యజింపవలసినది అనఁగా నీశ్లోకమందు జెప్పఁబడిన వ్రతములను వర్జించి యితరములైన తిథులయందు నుపనయనము సేయఁదగినది యనుట.

## అనధ్యాయములు

నైమిత్తికా స్త్వనధ్యాయా ధృతిపాతార్ధ మీరితాః,
అష్టమ్యాంచ చతుర్దశ్యాం పూర్ణిమాయాం కుహూతిథౌ. 56
సంధ్యయో ర్గర్జితే నైవ స్వాధ్యాయః ప్రతిపత్స్వపి,
పూర్వరాత్రే యథా మేఘో యత్ర గర్జతి వాసరే. 57
న వేదాధ్యయనం కార్యం సర్వదైవ మహానిశి,

టీ. ధృతిపాతార్ధమ్-ధృతి = వైధృతినామయోగము, పాత = వ్యతీపాత మహాపాతములు వీటితో గలసినదినములయొక్క, అర్ధమ్ = సగము, నైమిత్తికాః = నైమిత్తికంబులగు, అనధ్యాయాః = అనధ్యాయంబులని, ఈరితాః = చెప్పబడినవి గాన నైమిత్తికానధ్యాయంబులయందును, అష్టమ్యాంచ = ఉభయాష్టముల యందును, చతుర్దశ్యామ్ = ఉభయచతుర్దశులయందును, పూర్ణిమాయామ్ = పున్నమ యందును, కుహూతిథౌ = అమవసయందును, సంధ్యయోః = సాయం ప్రాతస్సంధ్యలయందును, గర్జితే = ఉఱిమినదినమునందును, ప్రతిపత్స్వపి = ఉభయప్రతిపత్తులయందును, అనగా నీచెప్పిన నిత్యానధ్యాయములయందును, స్వాధ్యాయః = అధ్యయనము. నైవ కర్తవ్యం = చేయఁగూడదు. ఇదియునుంగాక, పూర్వరాత్రే = పూర్వరాత్రియందును, యత్ర వాసరే = ఏదివసమునందు, యదా = ఎప్పుడు, మేఘః = మేఘము, గర్జతి = ఉఱుముచుండునో, తస్మిన్ = ఆదినమునందును, మహానిశి = అర్ధరాత్రసమయంబునందును, సర్వథైవ = సమస్త ప్రకారముల చేతను, వేదాధ్యయనం = వేదమును బఠించుట, నకార్యం = చేయఁదగినది కాదని యెఱుంగవలయు.

త్రయోదశీ సప్తమీచ చతుర్థీ కలయా యది. 58
రాత్రౌ స్పృశతి మానీ స్యా త్ప్రదోషే తత్ర మానవః,

టీ. త్రయోదశీ = త్రయోదశియు, సప్తమీచ = సప్తమియు, చతుర్థీ = చవితీయును, కలయా = ఒకఘటియచేతనైనను, రాత్రౌ = రాత్రియందు, స్పృశతియది = స్పృశించినట్లాయెనా, అది ప్రదోషమనంబడు. తత్ర ప్రదోషే = అట్టి త్రయోదశ్యాది ప్రదోష కాలములయందు, మానవః = నరుఁడు, మానీ = అధ్యయనము సేయక మౌనముగలవాఁడు, స్యాత్ = కావలయుననుట.

వినర్తునా వసంతేన కృష్ణపక్షే గళగ్రహే. 59
ఉపనీతస్త్వనధ్యాయే పునస్సంస్కారమర్హతి,

టీ. వసంతేన ఋతునావినా=వసంతఋతువును విడిచిపెట్టి యితరఋతువుల యందైనను, కృష్ణపక్షే=కృష్ణపక్షమునందైనను, గళగ్రహే=గళగ్రహతిథులయందైనను, అనధ్యాయే=అనధ్యయనదినమునందైనను, ఉపనీతః = ఉపనయనసంస్కృతుండైనవాఁడు, పునః=మరల, సంస్కారం = ఉపనయనసంస్కారమునుగూర్చి, అర్హతి = తగుచున్నాఁడనగా మరల నుపనయనమును జేసికోవలయుననుట.

యేచైత్రవైశాఖసితేతృతీయే మాఘేచ సప్తమ్యథ ఫాల్గునేచ,
మౌంజీవ్రతం తాసు శుభంవదంతి వసిష్ఠగార్గ్యాదిమునీంద్రవర్యాః

టీ. చైత్రవైశాఖమాసములయొక్క శుక్లపక్షసంబంధములైన తదియలును, మాఘ ఫాల్గునమాసములందు శుక్లపక్షసప్తములును ఈతిథులయందు, మౌంజీవ్రతం= ఉపనయనవ్రతమును, శుభప్రదంబైనదానిగా వసిష్ఠుఁడు గార్గ్యుఁడు మొదలైన మునిసత్తములు చెప్పుచున్నారనుట.

ఆచార్యకావ్యసౌమ్యానాం వారా శ్శస్తా శ్శుభోదయే.
వారౌతు మధ్యఫలదౌ వితరౌ నిందితౌ వ్రతే. 61

టీ. వ్రతే=ఉపనయనమునందు, శుభోదయే=శుభఫలంబుగలుగఁజేయు విషయమై, ఆచార్యకావ్యసౌమ్యానాం = గురుశుక్రబుధులయొక్క, వారాః = వారములు, శస్తాః = ప్రశస్తంబులైనవియనియును, ఇతరౌవారౌతు=భాన్విందువారంబులైతే, మధ్యఫలదౌ = మధ్యమఫలదాయకంబులనియు, ఇతరౌ = మిగిలినకుజమందవారములు, నిందితౌ = నిందింపఁబడినవియనియు నెఱుంగవలయుననుట.

మందవారే మౌంజిబంధం యః కుర్యా ద్వటునాశనమ్,
అంగారకే మౌంజిబంధం యజమానో మృతో భవేత్. 62

టీ. యః=ఎవఁడైనను, మందవారే = శనివారమునందు, మౌంజిబంధమ్ = ఉపనయన కర్మను, కుర్యాత్ = చేసినట్లైతే, వటునాశనం=ఉపనీతవటువునకు నాశనము సంభవించును. అంగారకే=కుజవారమునందు, మౌంజిబంధం=ఉపనయనమును, కుర్యాచ్చేత్= చేసినట్లైతే, యజమానః=వటువుయొక్కతండ్రి, మృతః= మృతినిఁ బొందినవాఁడు, భవేత్ = అగుననుట.

సహస్రగుణయుక్తేఽపి మందవారే కుజే తథా,
శుభకర్మ న కుర్వీత కుర్యాచ్చేన్మరణం ధ్రువమ్. 63

టీ. సహస్రగుణయుక్తేఽపి=వేయిసద్గుణంబులతోడఁ గూడియుండినప్పటికిని, మందవారే = శనివారమునందును, శుభకర్మ = శుభకార్యమును, నకుర్వీత=చేయ

గూడదు. పర్యాచ్చేత్=ఒక వేళ చేసినట్లయితే, మరణమ్=నాశనము, ధ్రువం = నిశ్చయింబనుట.

విభజ్యాహ్నః ప్రమాణంతు తత్రాద్యంశేఽపి దైవికమ్,
ద్వితీయే మానుషం కార్యం తృతీయాంశేఽపి పైతృకమ్. 64

టీ. అహ్నః ప్రమాణంతు = పగటియొక్క ప్రమాణమునైతే, విభజ్య = మూఁడు విధంబులుగా విభాగించి, తత్ర=ఆమూఁడు భాగంబులలో, ఆద్యంశేఽపి= మొదటిభాగమునందు, దైవికం = దేవతాకార్యములును, ద్వితీయే=రెండవభాగమునందు, మానుషం=మనుష్యకార్యములును, తృతీయాంశేఽపి = మూఁడవభాగమునందును, పైతృకమ్=పితృదేవతాకార్యములును, కార్యం=చేయఁదగినవి యనుట.

ఏకస్మిన్కేంద్రగే జీవే శుక్రే వా పాపకేంద్రజాః,
దోషా వినాశ మాయాంతి పాపం భాగీరథీజలాత్. 65

టీ. ఏకస్మిన్ జీవే=ఒకబృహస్పతియైనను. ఏకస్మిన్ శుక్రే వా=ఒకశుక్రుండైనను, కేంద్రగే=కేంద్రమును బొందియున్నట్లాయెనా, పాపకేంద్రజాః = పాపగ్రహములు కేంద్రములనున్నందువల్లజనించిన, దోషాః=సకలదోషములును, భాగీరథీ జలాత్ = గంగోదకమువల్ల, పాపమివ=పాపంబుభంగి, వినాశమ్ = వినాశములు, ఆయాంతి = పొందుచున్నవి యనుట.

మిత్రరాశిగతే జీవే శుక్రే వా పాపకేంద్రజాః,
హరే ర్నశ్యన్తి దోషాశ్చ స్మరణాదఘురాశయః. 66

టీ. జీవే=గురుండైనను, శుక్రేవా=శుక్రుండైనను, మిత్రరాశిగతేయది = మిత్రక్షేత్రగతుండైనట్టాయెనా, పాపకేంద్రజాః=పాపగ్రహములు కేంద్రములయందుండుట చేతఁబుట్టిన, దోషాః=సమస్తదోషంబులు, హరేః=విష్ణుదేవునియొక్క స్మరణాత్ = స్మరణవల్ల, అఘరాశయఇవ=పాపపుంజంబులవలె, నశ్యంతి=నశించుచుండు ననుట.

అతిమిత్రనవాంశస్థే శాఖేశేచ త్రికోణగే,
దోషా వినాశమాయాంతి గ్రీష్మేషు సలిలం యథా. 67

టీ. శాఖేశేచ=స్వశాఖాధిపతి, అతిమిత్ర నవాంశస్థే=అతిమిత్ర నవాంశయందుండినను, అతిమిత్రంబనఁగా మిత్రమిత్రత్వంబనుట, నవాంశంబనఁగా త్రింశద్భాగాత్మకం బైనలగ్నంబులో ౯-వ భాగంబనుట. త్రికోణగేసతి = పంచమనవమత్రికోణములయందుండినను, దోషాః=సమస్తదోషంబులును, గ్రీష్మేషు=గ్రీష్మకాలములయందు, సలిలంయథా=జలమట్లు, వినాశం=వినాశమును, ఆయాంతి = పొందుచున్నవియనుట.

యస్త్రైకాదశగస్సూర్యశ్చంద్రోవా మిత్రరాశిగః,
హంతి లగ్నోద్భవం దోషం పూతనామివ కేశవః. 68

టీ. యత్ర=ఏయుపనయనముహూర్తంబునందు, ఏకాదశగః=పదునొకొండవయింటనున్న, సూర్యః = సూర్యుఁడైనను, చంద్రోవా = చంద్రుఁడైనను, మిత్రరాశిగః = సుహృత్క్షేత్రగతుఁడైనను, తల్లగ్నోద్భవం = ఆముహూర్తమునందు బుట్టిన, దోషం = దోషమును కేశవః = కృష్ణమూర్తి, పూతనామివ = పూతన యనెడు పేరుగల రక్కసినివలెనే, హంతి = కొట్టుచున్నాఁడు.

అతిమిత్రగతస్సూర్యశ్చంద్రో వా యది లాభగః,
హంతి దోషచయం తద్వత్పాపసంఘం హరేస్స్మృతిః. 69

టీ. అతిమిత్రగతః=అతిమిత్రక్షేత్రమందుండిన, సూర్యః=సూర్యుఁడైనను, లాభగః = పదునొకొండవయింటనుండిన, చంద్రోవాయది = చంద్రుఁడైనను, దోషచయం=పాపసంఘమును, హరేః స్మృతిః తద్వత్ = హరిస్మరణమువలెనే, హన్తి= పోఁగొట్టుచున్నాఁడు.

త్రిషష్ఠలాభగో భౌమశ్శశీవా యది తుంగగః,
సర్వదోషచయం హంతి పాపం పంచాక్షరీ యథా. 70

టీ. త్రిషష్ఠలాభగోయది = తృతీయషష్ఠ లాభస్థానములను బొందినట్లాయెనా, భౌమః = అంగారకుఁడును, తుంగగోయది = ఉచ్చగతుఁడైనట్లాయెనా, శశీవా = చంద్రుండైనను, సర్వదోషచయం = సకలదోషపుంజములను, పంచాక్షరీ = శివపంచాక్షరీమహామంత్రము, పాపం యథా = కిల్బిషమునువలెను, హంతి = కొట్టి వేయుచున్నాఁడు.

స్వకమిత్రగతో భౌమశ్శశీవా యది లాభగః,
హంతి దోషచయం సర్వం పినాకీ త్రిపురం యథా. 81

టీ. స్వకమిత్రగతోయది = స్వక్షేత్రమిత్రక్షేత్రగతుండైనను, భౌమః= అంగారకుఁడును, లాభగోయది=లాభస్థానగతుండైనను, శశీవా = చంద్రుండైనను, సర్వం=సమస్తమైన, దోషచయం=దోషసంఘమును, పినాకీ=రుద్రుఁడు, త్రిపురం, యథా = త్రిపురాసురులభంగి, హంతి = నశింపఁజేయుచున్నాఁడనుట.

లగ్నాత్త్రిషష్ఠగ స్సూర్య స్స్వతుంగస్థో భవేద్యది,
నాశయత్యఖిలాన్దోషాన్ స్వోదయాత్తిమిరం యథా. 72

టీ. లగ్నాత్ = ఉపనయనలగ్నముకంటె, త్రిషష్ఠగః = తృతీయషష్ఠస్థానములను బొందిన, సూర్యః = సూర్యుఁడు, స్వతుంగస్థః = తనయొక్క యుచ్చయందుండినవాఁడు, భవేద్యది = అయినట్లాయెనా, అఖిలాన్ = సమస్తములైన, దోషాన్ = దోషములను, స్వోదయాత్ = తనయుదయమువల్ల, తిమిరం యథా = చీఁకటినివలె, నాశయతి = నశింపఁజేయును.

కేంద్రత్రికోణగః సౌమ్యో మిత్రరాశ్యంశగో యది,
పాపకేంద్రకృతాన్ దోషాన్ హంతీభం కేసరీ యథా. 73

టీ. కేంద్రత్రికోణగః=కేంద్రత్రికోణములయందుండిన, సౌమ్యః=బుధుఁడు, మిత్రరాశ్యంశగో యది = మిత్ర క్షేత్రాంశములను బొందినట్టైతే, పాపకేంద్రకృతాన్=పాపగ్రహములు కేంద్రములనున్నందున జనించినదోషములను, కేసరీ = సింగము, ఇభంయథా = ఏనుఁగువలె, హన్తి = నశింపఁజేయును.

లగ్నాధిపో వాంశపతి ర్బలిష్ఠః కేంద్రత్రికోణే త్రిభవేస్థితోఽపి,
లగ్నాన్యకేంద్రేష్వశుభస్థదోషాన్ని హంతి సౌమ్యైర్యుతవీక్షితో వా.

టీ. లగ్నాధిపో వా = ఉపనయనలగ్నాధిపతియైనను, అంశపతిః=ఉపనయనలగ్ననవాంశాధిపతియైనను, బలిష్ఠః = బలవంతుఁడై, సౌమ్యైః = శుభగ్రహములతోడఁ గూడినయైనం జూడఁబడియైనను, కేంద్రత్రికోణే = కేంద్రత్రికోణములయందు, స్థితః = ఉన్నవాఁడై, త్రిభవేస్థితోఽపి = తృతీయలాభస్థానములయందుండినప్పటికిని, లగ్నాన్యకేంద్రేష్వశుభస్థదోషాన్ = లగ్నంబుకంటె నితరంబులైన కేంద్రంబులయందుఁ బాపగ్రహములుండినట్టి దోషంబులనెల్లను, నిహంతి = నశింపఁజేయుచున్నాఁడనుట.

విద్యాం వటోర్నిహన్త్యాశు మందభౌమౌ ద్వితీయగౌ,
అన్యోన్యక్ష మథవాష్టస్థౌ ద్వాదశస్థౌ తు బంధనమ్. 75

టీ. ద్వితీయగౌ = ఉపనయనలగ్నంబునకు ద్వితీయస్థానంబుననున్న మందభౌమౌ=శన్యంగారకులు, వటోః=వటువుయొక్క, విద్యాం=విద్యను, ఆశు నిహన్తి= త్వరగా నశింపఁజేయుచుందురనఁగా వచ్చినవిద్య మరచిపోవునట్లును నూతనవిద్యరాకయుండునట్లును జేయుచుందురనుట, తౌ=ఆశన్యంగారకులు, అన్యోన్యం = పరస్పరము నొకరితో నొకరు, అష్టస్థౌ = అష్టమస్థానగతులైనను, అథవా = అటుగాకపోయినను, ద్వాదశస్థౌతు = పన్నెండవస్థానమందు నుండినవారైనను, బంధనం = వటువుకు బందీకరణము మొదలైనయశుభఫలములను చేయుచుందురనుట.

కుజార్కజౌ బంధనదౌ వ్యయస్థౌ విద్యాప్రదౌ వా ధనబంధుసంస్థౌ,
వ్యయస్థ మర్కం క్షితిజో విపశ్యన్నాచార్యమంధంకురుతే బలాఢ్యః.

టీ. కుజార్కజౌ=అంగారకశనులు, వ్యయస్థౌ=పండ్రెండవ యింటనున్నవారలగుచును, బంధనదౌ=వటువునకు, కారాగృహప్రవేశము మొదలగు నరిష్టమును గలుఁగఁజేయువారు, స్యాతాం=అగుచున్నారు. ఇచ్చట 'స్యాతాం' మను క్రియాపదంబధ్యాహరించుకొనఁదగినది. ధనబంధుసంస్థౌ = ద్వితీయచతుర్థస్థానంబులనున్నట్టి, తౌ=ఆయంగారకశనులు, విద్యాప్రదౌ=వటువునకు సకలవిద్యల నిచ్చువారగుచుందురు. బలాఢ్యః=బలవంతుఁడైన, క్షితిజః = అంగారకుఁడు, వ్యయం = వ్యయస్థానస్థితుండైన,

అర్కం=సూర్యుని, విపశ్యన్ = చూచున్నవాఁ డగుచున్న, ఆచార్యం=తండ్రిని, అంధం = గ్రుడ్డివానిఁగా, కురుతే = చేయుచున్నాఁడనుట.

వ్యయస్థం రవి మర్కిర్వా స్వదృష్ట్యా యది పశ్యతి,
శిష్యవిద్యాం బలీ హన్యా ద్విబలీ రోగద శ్శిశోః. 77

టీ. బలీ = బలవంతుఁడైన, ఆర్కిర్వా = శనియైనను, వ్యయస్థం = పది రెండవడయింటనున్న, రవిం=సూర్యుని, స్వదృష్ట్యా=తన తృతీయ సప్తమ దశమదృష్టులలోపల నే దృష్టిచేతనైన, పశ్యతి యది=చూచుచుండినట్లాయెనా, శిష్యవిద్యాం= వటువుయొక్క విద్యను, హన్యాత్ = నశింపఁజేయును. సః = ఆ మందుఁడు, విబలీ = స్థానాదిషడ్బలహీనుండై వెనుక చెప్పినప్రకారముండినట్లయితే, శిశోః = వటువునకు, రోగదః = పీడపెట్టు వాఁడగుననుట.

లగ్నచంద్రఫలము వాసిష్ఠమునందు

ప్రాలేయరశ్మౌ యది లగ్నసంస్థే వలక్షపక్షేఽపి భవేత్సరోగీ,
వ్రతీచ సౌమ్యగ్రహవర్గగేఽపి ఖలోఽపి నిస్వ శ్శ్రుతికర్మహీనః. 78

టీ. వలక్షపక్షేపి = శుక్లపక్షమందైనను, ప్రాలేయరశ్మౌ=చంద్రుఁడు, సౌమ్యగ్రహవర్గగేపి=శుభగ్రహషడ్వర్గమును బొందియున్నప్పటికిన్ని, లగ్నసంస్థేయది = ఉపనయనలగ్నమందుండినట్లాయెనా, వ్రతీ = ఉపనీతవటువు, సరోగీ = వ్యాధిగ్రస్తుఁడును, ఖలోపి = దుర్మార్గుఁడును, నిస్వః=దరిద్రుఁడును, శ్రుతికర్మహీనః= వేదచోదితకర్మానుష్ఠానశూన్యుండును, భవేత్ =అగునని తెలియవలయుననుట.

కాశ్యపసంహితాయాం

స్వోచ్చసంస్థోఽపి శీతాంశు ర్వ్రతినం యది లగ్నగః,
తం కరోతి శిశుం నిస్వం సతతం క్షయరోగిణమ్. 79

టీ. శీతాంశుః = చంద్రుఁడు, స్వోచ్చసంస్థోపి = తనయుచ్చస్థానమం దున్నప్పటికిన్ని, లగ్నగోయది = ఉపనయనలగ్నమందుండినట్లాయెనా, వ్రతినం=వటువైన, తం శిశుం=ఆశిశువును, నిస్వం=దరిద్రునిగాను, సతతం=ఎల్లప్పుడును, క్షయరోగిణం=క్షయరోగపీడితునిగానున్ను, కరోతి=చేయుచున్నాఁడనుట.

దీన గర్గముని యొకన్యాస్థను జెప్పెను,

ప్రాలేయరశ్మిర్యది లగ్నసంస్థో వళక్షపక్షేఽశుభకృన్నితాంతమ్,
నాపీహసౌమ్యగ్రహవర్గగశ్చేద్బహ్వాయురారోగ్యసుఖానిదద్యాత్.

టీ. ఇహ=ఈయుపనయనవ్రతవిషయమై, వళక్షపక్షే=శుక్లపక్షంబునందును, ప్రాలేయరశ్మిః = చంద్రుఁడు, లగ్నసంస్థోయది = ఉపనయనలగ్నంబునందుండినట్లా

యెనా, నితాంతం=మిక్కిలి, అశుభకృత్ = అశుభము సేయువాఁడగుచుండును, సోపి = ఆలగ్నస్థుఁడైనచంద్రుఁడును, సౌమ్యగ్రహవర్గశ్చేత్ = శుభగ్రహషడ్వర్గ మును జెందినట్లయినను, వటోః = వటువునకు, బహ్వాయురారోగ్యసుఖాని = విశే షంబుగా నాయురారోగ్యైశ్వర్యసౌఖ్యంబులను, దద్యాత్ =ఇచ్చుచుండుననుట.

లగ్నదోషభంగము—గార్గ్యసంహితయందు.

లగ్నేకుళీరే గురుచంద్రసంస్థే మేషే సితజ్ఞౌ వృషభే పతంగే,
శేషైస్త్రిషష్ఠాయగతైర్గ్రహైస్స్యాద్యశ్చోపనీతస్సముపైతి లక్ష్మీమ్.

టీ. లగ్నకుళీరేగురుచంద్రసంస్థే = కటకలగ్నమునందు గురుచంద్రులు గలిసి యుండఁగాను, మేషసితజ్ఞౌ=మేషలగ్నమునందు శుక్రబుధులుండఁగాను, వృషభే పతంగే=వృషభలగ్నమునందు సూర్యుఁడుండగానున్న, శేషైః=మిగిలిన, గ్రహైః= శన్యంగారకాదులు, త్రిషష్ఠాయగతైస్సద్భిః = తృతీయషష్ఠలాభస్థానములను బొంది యుండఁగాను, యశ్చ=ఎవఁడు, ఉపనీతః=ఉపనయనసంస్కృతుండు, స్యాత్ = అగునో, సః=వాఁడు, లక్ష్మీమ్=సంపదను, సముపైతి=పొందుచున్నాఁడనుట.

కేంద్రేఽమరేజ్యే భవనేపతంగే చంద్రే శుభాంశే భవతి తృతీయే,
వాగీశ్వరీ తస్య ముఖే వసంతీ పద్మా యథా పద్మవనే సదా చ. 82

టీ. అమరేజ్యే=బృహస్పతి, కేంద్రే=కేంద్రములయందుండఁగాను,పతంగే= సూర్యుఁడు, భవనే=ఉపనయనలగ్నమునందుండఁగాను, చంద్రే=చంద్రుఁడు, శుభాం శే=శుభగ్రహాంశముగలవాఁడై, తృతీయే=మూఁడవయింటను, భవతి=ఉండఁగాను, యశ్చోపనీతః=ఎవఁడుపనీతుండగునో, తస్య=వానియొక్క, ముఖే=మొగమునందు, వాగీశ్వరీ=సరస్వతీదేవి,పద్మా=లక్ష్మి, పద్మవనే=కమలవనమునందు, సదా చ = ఎల్లప్పు డును,యథా=ఏప్రకారము నివసించియుండునో,తథా=ఆప్రకారముగానే, వసంతీ= నివసించియుండు ననఁగా నిచ్చట చెప్పిన గ్రహసంపత్తిగలలగ్నమునందు నుపనయన సంస్కృతుండైనబాలునకు సకలవేదవేదాంగశాస్త్రేతిహాసపురాణములు చక్కఁగా వచ్చును.

లగ్నే సితః కర్మణి దేవపూజ్యో భవేద్రవిశ్శీతకరశ్శుభాంశే,
హృదిస్థశాస్త్రాణ్యపి వర్ధయన్తి ప్రియక్షణేనైవ మహేంద్రియాణి.

టీ. లగ్నే=ఉపనయనలగ్నమందు,సితః=శుక్రుఁడును,కర్మణి=కర్మస్థానమందు, దేవపూజ్యః=బృహస్పతియును,శుభాంశే=శుభనవాంశయందు, రవిః=సూర్యుఁడును, శీతకరః=చంద్రుఁడును,భవేచ్చేత్ =ఉండినట్లైన, హృదిస్థశాస్త్రాణ్యపి=వటువుయొక్క హృద్గతంబులైన సకలవేదశాస్త్రంబులను,వర్ధయతి=బహిర్గతంబులయివృద్ధినిఁబొందు

చుండు నెట్లనిన, ఇంద్రియాణి = కరచరణాద్యవయవంబులు, ప్రియతుష్టేనైవ = ఇష్టమైన యుత్సవంబుచేత, యథా = ఏప్రకార మువ్పొంగుచుండునో, తథా = ఆప్రకారంబని యూహింపవలయుననుట.

భృగౌ మీనే వృషేవాపి జీవే కేంద్రత్రికోణగే,
కర్కిచాపఝషే తస్మిన్ యోగ శ్శుభతరాహ్వయః. 84

టీ. భృగౌ = శుక్రుఁడు, మీనేవృషేవాపి = మీనరాశియందైనను, వృషభరాశియందైననుండఁగాను, జీవే = బృహస్పతి, కేంద్రత్రికోణగే = కేంద్రత్రికోణములయం దుండఁగానైనను, తస్మిన్ = ఆబృహస్పతి, కర్కిచాపఝషే=కటకధనుర్మీనరాసులయం దుండఁగానైనను, శుభతరాహ్వయః=అత్యంతశుభంబనియెడు, యోగః = సుయోగము వటువునకు గలుగుచుండుననుట.

జీవః కావ్యోపివా యస్య మౌంజీబంధనలగ్నగః,
తస్య విద్యా ప్రభూతా స్యా ద్వివాహశ్చాచిరాద్భవేత్. 85

టీ. జీవః=గురుండైనను, కావ్యోపివా=శుక్రుండైనను,యస్య=ఎవనియొక్క, మౌంజీబంధలగ్నగః=ఉపనయనలగ్నమును బొందియుండునో, తస్య=వానికి,విద్యా=విద్య, ప్రభూతా=ప్రచురంబైనది, స్యాత్=అగు ననఁగా విశేషవిద్యలు వచ్చును. అచిరాత్ = శీఘ్రముగా, వివాహశ్చ = పెండ్లియును, భవేత్ = అగుననుట.

దోషే బలవిహీనే చ గుణే బహుబలైర్యుతే,
అపవాదబలైర్దోష ప్రధ్వంసాభావక శ్శుభః. 86

టీ. దోషే = దోషము, బలహీనేచ = బలముతక్కువది యగుచుండఁగా, గుణేచ=గుణము, బహుబలైర్యుతే = బలము గలిగినది యగుచుండఁగాను, శుభః= శుభము, అపవాదబలైః = విశేషశాస్త్రబలముచేత, దోషప్రధ్వంసాభావకః = దోషముయొక్క ప్రధ్వంసాభావముగలది యనఁగా నాశముగలది ప్రాగభావంబనియు, ప్రధ్వంసాభావంబనియు, నన్యోన్యాభావంబనియు, నత్యంతాభావంబనియు నభావంబులు నాల్గువిధంబులు గలవని న్యాయశాస్త్రమునందుఁ జెప్పియున్నదనుట. అనగా నేముహూర్తంబునకైనను దోషస్వల్పతయు గుణాధిక్యము గలిగియున్నపక్షంబునందు సకలదోషంబులునశించి విశేషశుభము గలుగును.

వటువుతల్లి గర్భిణియైయుండఁగా నుపనయననిషేధము.

కర్తుర్భార్యా గర్భిణీ చేద్వాస్తుకర్మోపనాయనమ్,
షణ్మాసా త్పరత స్సోపి న కుర్యాదితి శౌనకః 37

టీ. కర్తుః=ఉపనయనకర్తయొక్క, భార్యా=జాయ, గర్భిణీచేత్=గర్భవతి

యయ్యేనా, షణ్మాసాత్పరతః = ఆఱుమాసములకుపైనను, సోపి=ఆయజమానుఁ
వాస్తుకర్మోపనాయనం=గృహనిర్మాణారంభోపనయనములను, నకుర్యాత్ = చేఁ
గూడదని, శౌనకమహామునిమతము-అనఁగా, వటువుయొక్క తల్లి గర్భముతోడఁ
డిన నాఱుమాసములకుఁ బూర్వ ముపనయనము సేయవచ్చునుగాక, యాఱుమాస
లకు పరమం దుపనయనమును వాస్తుకర్మారంభమును సేయఁగూడదు.

రజస్వలా వటో ర్మాతా ఇడావాచనతః పురా,
నైవోపనయనం కార్యం పరతశ్చే చ్ఛుభం జగుః.

టీ. వటోః=శిశువుయొక్క, మాతా=తల్లి, ఇడావాచనతఃపురా=పుణ్యా
వాచన దేవతావాహ్వనములకంటెఁ బూర్వమందు, రజస్వలా = బహిష్ఠయాయెః
ఉపనయనం = ఉపనయనవ్రతము, నకార్యం = చేయఁదగినదిగాదు. పరతశ్చేత్
స్వస్తిపుణ్యాహవాచన దేవతావాహ్వనములకంటెఁ బరమందైన, ఉపనయనం
ఉపనయనము, శుభం = మంగళప్రదంబని. జగుః = కొందఱు పలికిరనుట.

రజస్వలాదోషభంగము.

అలాభే సుముహూర్తస్య రజోదోషేచ మాతరి,
శ్రియం సమ్పూజ్య తత్కుర్యాన్మౌంజీబంధనముత్తమమ్,

టీ. నిశ్చయించుకొనిన మంచిముహూర్తమునకు వటునితల్లి రజస్వలఁ
వేఱు సుముహూర్తము దొరకకుండెనేని యొకసువాసినిని వస్త్రమాల్యాదుల
బూజించి యాముహూర్తముననే యుపనయనము చేయవచ్చును.

శాఖాధిపతివారశ్చ శాఖాధిపబలం శిశోః,
శాఖాధిపతిలగ్నఞ్చ దుర్లభం త్రితయం వ్రతే.

టీ. వ్రతే = ఉపనయనవ్రతమునందు, శాఖాధిపతివారశ్చ=స్వశాఖాధిః
యొక్క వారమును, శాఖాధిపబలం = స్వశాఖాధిపతి యొక్క బలమును శాఖా
పతిలగ్నంచ = స్వశాఖాధిపునిరాశియును, త్రితయం = ఈమూఁడును, శిశో
శిశువునకు, దుర్లభం = సాధారణంబుగా లభించదనుట.

న నైధనం నైధనశుద్ధిలగ్నం ననైధనర్క్షం న చ తన్నవాంశమ్,
ననైధనేశో నచ వాంత్యకేశో లగ్నే ప్రశస్తం ఖలు రాత్రినాథః

టీ. ననైధనం=వటువుయొక్క జన్మరాశి కెనిమిదవలగ్నముగూడదు, నైధనశు
లగ్నం=ఉపనయనలగ్నం బష్టమశుద్ధిగలిగి యుండవలసినది. ననైధనర్క్షం=నైధనత
గూడదు, నచతన్నవాంశం=ఎనిమిదవనవాంశంబును యుక్తంబుగాదు. ననైధనే
రాత్రినాథః=అష్టమచంద్రుఁడు శుభుండుగాఁడు. నచవాంత్యకేశః=ద్వాదశచంద్ర

డునుగూడఁడు. ఏవం=ఈప్రకారము, లగ్నే=ఉపనయనలగ్నంబునందు, ప్రశస్తంఖలు = ప్రసిద్ధమైనగ్రహసంపత్తి గలిగి యుండవలయు ననుట.

### కేంద్రగతగవ్యాదిపాపగ్రహఫలము

కుజే చేత్కూజితో దోష శ్శిష్యాచార్యవినాశనమ్,
మందేతురుధిరో దోషః కరోతి మహతీం గదామ్. 92
రాహౌ రంధ్రాహ్వయో దోష శ్శిశో ర్మాతృవినాశనమ్,
కేతౌ కేంద్రే తూగ్రదోషో విద్యాయుర్ధననాశనమ్. 93
పంచదోషేతరం లగ్నం శుభదం చోపనాయనే,
ద్వాదశస్థం రవిం భౌమః పశ్య న్నాచార్యనేత్రహృత్. 94

టీ. కుజే=అంగారకుఁడు, కేంద్రస్థితేచేత్=కేంద్రమునందునుండెనేని, కూజితో దోషః=కూజితంబను పేరుగలదోషము, సః=ఆదోషము, శిష్యాచార్యవినాశనం = తండ్రి కొమాళ్లను జంపును, మందేతు=శనైశ్చరుఁడైతే, కేంద్రగతేచేత్=కేంద్రగతుడైనట్టైతే రుధిరోదోషః=రుధిరనామకదోషము, సః=ఆదోషము. మహతీంగదాం = వటువునకు మిక్కిలి వ్యాధినిగలిగించును. రాహౌ=రాహువు, కేంద్రగతేచేత్ = కేంద్రగతుండైన పక్షమందు రంధ్రాహ్వయోదోషః = రంధ్రంబనెడు దోషము, సః=ఆదోషము, శిశోర్మాతృ వినాశనం=వటువునకు మాతృవియోగమును సంపాదించును. కేతౌ=కేతువు. కేంద్రగతేచేత్ = కేంద్రగతుండైనను, ఉగ్రదోషః = ఉగ్రంబనుదోషము, సః=ఆదోషము, విద్యాయుర్ధననాశనం = వటువుయొక్క విద్యను ధనమును ఆయువును నశింపఁజేయునుగాన, ఉపనాయనే=ఉపనయనవ్రతమునందు, పంచదోషేతరం = ఈచెప్పినయైదు పాపగ్రహకేంద్రదోషంబులు గలుగని, లగ్నం=ముహూర్తము, శుభదం=శుభప్రదమైనది ఇదియునుంగాక, భౌమః=కుజుఁడు, ద్వాదశస్థం = ఉపనయనముహూర్తంబునకుఁ బదిరెండవయింటనున్న, రవిం=సూర్యుని పశ్యన్ = చూచినట్లాయెనా, ఆచార్యనేత్రహృత్ = వటువు జనకునిఁగన్నులు లేనివిగాఁ జేయుననుట.

సర్వత్ర శుభదశ్శుక్రో రిఃఫషష్ఠాష్టమాన్వినా,
షష్ఠాష్టమౌ వినా జీవస్సర్వత్ర శుభకృత్సదా. 95

టీ. శుక్రః=భార్గవుఁడు, రిఃఫషష్ఠాష్టమాన్వినా = ఉపనయనలగ్నంబునకుం బదునొకండాఱు ఎనిమిది ఈస్థానములనువిడిచిపెట్టి, సర్వత్ర = ఇతరస్థానంబులలోపల నెచ్చట నుండినను, శుభదః= శుభఫలంబులనిచ్చుచుండును, జీవః = బృహస్పతి, షష్ఠాష్టమౌవినా = ఆఱు యెనిమిది స్థానములనువిడిచి, సర్వత్ర =ఇతరములైన స్థానములలో నెచ్చటనుండినను, సదా=ఎల్లప్పుడును, శుభకృత్ =శుభము సేయువాఁడనుట.

విశేషా న్నైధనస్థానే నేష్యంతే సర్వదా గ్రహాః,
ఆచార్యం తం శుభా ఘ్నంతి శిష్యం ఘ్నంతి శుభేతరాః. 96

టీ. నైధనస్థానే = ఉపనయనముహూర్తంబున నష్టమమునందున్న, గ్రహాః= గ్రహంబులన్నియు, సర్వదా=ఎల్లప్పుడును, విశేషాత్=ఏమాత్రమును, నేష్యంతే= ఇష్టములైనవిగావు. అనఁగా నష్టమమందుండు గ్రహంబులు వటువున కించుకంతై నను మేలుసేయక యతిశయంబైన కీడునుం జేయుచుండు రదియెట్లన:-- శుభాః = శుభగ్రహంబు లష్టమస్థానగతంబులైనట్లయితే, తమాచార్యం=ఆవటువుతండ్రిని, ఘ్నంతి = చంపుచున్నారు. శుభేతరాః=పాపగ్రహంబు లష్టమస్థానగతంబులైన, శిష్యం = శిశువును, ఘ్నంతి = చంపుచున్నారనుట.

ఏకదినవివాహోపనయనవిషయము.

వివాహోపనయౌ యత్ర త్వేకస్మి న్దివసే యది,
మేఖలాబంధనం పూర్వం పరం వైవాహికం జగుః. 97

టీ. యత్రతు=ఎచ్చట, ఏకస్మిన్దివసే= ఒకదివసమునందు, వివాహోపనయౌ యది = వివాహోపనయనము లైనట్లయితే (తత్ర = అచ్చట) పూర్వం=ముందుగా, మేఖలాబంధనం = ఉపనయనము, పరం=అనంతరమునందు, వైవాహికం = వివాహము చేయఁదగినదియని, జగుః = పెద్దలు చెప్పిరి.

చౌలోపనయసీమంతజాతనామాన్న పుంసవే,
చాతుర్వ్రితేఽభ్యు పాకర్మ ణ్యేకగర్భాణ పృథక్క్రియాత్. 98

టీ. చౌలోపనయసీమంతజాతనామాన్న పుంసవే-చౌల= చూడాకర్మనందును, ఉపనయ = ఉపనయనమునందును, సీమంత = సీమంతమందును, జాత=జాతకర్మ మందును, నామ = నామకరణమందును, అన్న = అన్నప్రాశనమునందును, పుంసవే= పుంసవనమునందును, చాతుర్వ్రితే = వేదవ్రతచతుష్టయంబునందును, అభ్యు పాకర్మణి = నూతన శ్రావణహోమకర్మయందును, ఏకగర్భాణ = ఏకోదరులైన పుత్రులను, పృథక్క్రియాత్ = వేఱువేఱుగాఁ జేయవలయును. అనఁగా దండ్రి తనకొమాళ్లకు చౌలోపనయనాదులు జేయునెడల నొకొక్కకని కొకొక్కసారిగాఁ జేయవలయుఁగాక యిద్దరికి ముగ్వురకు నొక్కతూరిగాఁ జేయఁగూడదు.

వేదారంభము.

హస్తాశ్వయుక్ఛ్రవణతిష్యసమీరమిత్రచిత్రాదితిత్రిపురజేతృజలాసు రేషు, శ స్తో త్తరాక మఃసవ్ఛపౌష్ణభేషు ప్రోక్తం నః శ్రుతింమాగమనం ద్విజానామ్. 99

టీ. హస్తాశ్వయుక్శ్రవణతిష్య సమీరమిత్ర చిత్రాదితి త్రిపురజేతృజలాసురేషు= హస్తాశ్వనీశ్రవణపుష్యస్వాత్యనూరాధా చిత్రాపునర్వస్వార్ద్రా పూర్వాషాఢా మూలా నక్షత్రములయందును, శస్తోత్తరాకమలసమ్భవపౌష్ణభేషు = ప్రశస్తంబులైనయుత్తరోత్తరాషాఢోత్తరాభాద్రా రోహిణీ రేవతులయందును, ద్విజానాం = బ్రాహ్మణులకు, నవశ్రుతిసమాగమనం = నూతనవేదారంభము, ప్రోక్తం=చెప్పఁబడినది.

రిక్తాష్టమీ పంచదశీ నిషిద్ధాస్త్రయోదశీ సప్తమికాచ మధ్యే,
విద్యాగమే వీప్సితమన్త్రిణాంస్యుర్వారోదయంమధ్యమమిన్దుభాన్వోః.

టీ. వీప్సితమంత్రిణాం = కోరఁబడిన వేదమంత్రములుగల బ్రాహ్మణులకు, విద్యాగమే = వేదశాస్త్రాదివిద్యారంభమందు, రిక్తాష్టమీ = చతుర్థి నవమీ చతుర్దశ్యష్టములును, పంచదశీ = పూర్ణిమయును అమావాస్యయును, నిషిద్ధాః = నిషేధింపఁబడినవి; అనఁగా నధమంబులనుట, త్రయోదశీ=త్రయోదశియును, సప్తమికాచ = సప్తమియును, మధ్యే=మధ్యమంబులు, స్యాతాం = అగుచున్నవి. ఇందుభాన్వోః=చంద్ర సూర్యులయొక్క, వారోదయం = వారములును లగ్నములును, మధ్యమం = మధ్యమంబులనుట.

వేదారంభే ద్విస్వభావావశిష్టా వంధ్యాః ప్రోక్తాయే చరా రాశయ
శ్చ, శుద్ధేరాశౌ నైధనే చాంద్రవారే కుర్యాద్రాజ్ఞ స్సర్వవిద్యా
సమాప్తిమ్. 101

టీ. వేదారంభే = వేద మారంభించుటయందును, ద్విస్వభావావశిష్టాః = ద్విస్వభావరాసులకంటె నితరంబులైన స్థిరరాసులును, యేచరారాశయశ్చ = చరరాసు లేవో యవియును, వంధ్యాః - నిష్ఫలంబులని, ప్రోక్తాః = చెప్పఁబడినవి. మఱియు నైధనరాశౌ = ఎనిమిదవరాశి, శుద్ధేసతి = గ్రహవర్జితమగుచుండఁగా, చాంద్రవారే=ఇందువారమునందు, రాజ్ఞః=క్షత్రియునకు, సర్వవిద్యాసమాప్తిం= సకలవిద్యలయొక్క పరిసమాప్తిని, కుర్యాత్ = చేయవలయును,

ఇఁక వివాహవిషయము

జన్మయోగశకునాదివిస్తరే గోచరేచ శుభదే నృయోషితోః,
సాంప్రదాయసమయే గుణాన్వితే పాణిపీడనవిధిర్విధీయతే. 102

టీ.జన్మయోగశకునాదివిస్తరే = జననకాలలగ్నమునందుండు గ్రహసంపత్తియును శకునములు మొదలైనవియును, గోచరేచ=గోచారమును, శుభదే = శుభదాయకంబగుచునుండఁగా, గుణాన్వితే=సద్గుణసంపన్నమైన, సాంప్రదాయసమయే= సత్సంప్రదాయయుక్తంబగు సమయంబునందు, నృయోషితోః = స్త్రీపురుషులకు పాణిపీడనవిధిః = వివాహవిధి, విధీయతే = విధింపఁబడుచున్నది.

అర్కే కర్కటకన్యకాఘటధనుర్ముక్తే భృగౌ మంత్రిణి
స్ఫారజ్యోతిషి శీతరోచిషి బలోపేతే విరిక్తే తిథౌ,
రోహిణ్యుత్తర రేవతీపితృమరున్మిత్రేందుహస్తాసురే
ష్వారార్కార్కజవాసరైశ్చరహితేషూద్వాహకర్మారభేత్. 103

టీ. అర్కే=సూర్యుఁడు, కర్కటకన్యకాఘటధనుర్ముక్తేసతి=కటకకన్యాకుంభ ధనూరాసులయందు లేకపోవుచుండఁగా, భృగౌ=శుక్రుఁడును, మంత్రిణి=బృహస్పతియును, స్ఫారజ్యోతిషిసతి=ప్రకాశమానమైన తేజస్సు గలవారగుచు నుండఁగాను, శీతరోచిషి = చంద్రుఁడు, బలోపేతే సతి = బలవంతుఁడై యుండఁగాను, విరిక్తే తిథౌ = రిక్తతిథులుగాక నితరములైన తిథులయందును, రోహిణ్యుత్తర రేవతీపితృమరున్మిత్రేందు హస్తాసురేషు = రోహిణ్యుత్తరోత్తరాషాఢోత్తరాభాద్ర రేవతి మఖ స్వాత్యనూరాధా మృగశీర్ష హస్తమూలలయందును ఆరార్కార్కజవాసరైశ్చరహితేషు=అంగారకరవి శనివారాదులచేత రహితములైన శుభగ్రహవారములయందును, ఉద్వాహకర్మ=వివాహకర్మమును, ఆరభేత్=ఆరంభింపవలయును.

శ్రేష్ఠాస్తౌలియమాంగనాఘటధనుర్గోకర్కికంఠీరవా
మధ్యాస్సౌమ్యయుతాస్తదూర్ధ్వరహితాస్సర్వే వివాహే హితాః,
సౌమ్యాః కేంద్రధనాయపుత్రసహితాః పాపాస్త్రిషష్ఠాయగాః
పూజ్యాశ్శుక్రగురూ మృతా వశుభదౌ శుద్ధో భవేత్సప్తమః

టీ. వివాహే=వివాహమునందు, తౌలియమాంగనాఘటధనుర్గోకర్కికంఠీరవాః=తులా మిథున కన్యా కుంభ ధనుర్వృషభ కటక సింహరాసులు, శ్రేష్ఠాః=ఉత్తమములు. మధ్యాః=శేషించినరాసులు మధ్యమములు. సర్వే = సమస్తరాసులును, సౌమ్యయుతాః=సౌమ్యగ్రహసహితములును, తదూర్ధ్వరహితాః = పాపగ్రహవర్జితములును అయిన, హితాః=ఇష్టంబులైనవి. కేంద్రధనాయపుత్రసహితాః-కేంద్ర=కేంద్రములయందును, ధన=ద్వితీయమునందును, ఆయ=పదునొకొండవస్థానమునందును, పుత్ర=ఐదవస్థానమునందును, సహితాః=కూడియున్న, సౌమ్యాః=గురుశుక్ర బుధపూర్ణ చంద్రులును, త్రిషష్ఠాయగాః = తృతీయషష్ఠలాభస్థానములఁబొందిన, పాపాః=రవ్యంగారకశని రాహుకేతువులును, పూజ్యాః=పూజింపఁదగినవి. అనఁగా ఇష్టఫలంబుల నిచ్చుచుండుననుట. శుక్రగురూ = శుక్రబృహస్పతులు, మృతౌ = సూర్యునితో నస్తమించినపుడు. అశుభదౌ = శుభములనిచ్చువారుగారు, అనఁగా గురుశుక్రమౌఢ్యము గూడదు. సప్తమః=వివాహ ముహూర్తంబున నేడవస్థానము, శుద్ధః = గ్రహవర్జితమైనది, భవేత్ = కావలయు, అనఁగా సప్తమశుద్ధి యుండవలయుననుట.

## వివాహప్రశ్న.

శుభే దినే దైవవిదం త్వభిజ్ఞం తాంబూలపుష్పాక్షతపూర్ణపాణిః,
కర్తాచ గత్వా ప్రణిపత్య పృచ్ఛే న్నివేద్య తస్మై వరకన్యయోర్భమ్.

టీ. కర్తాచ=వివాహకర్తయగువాఁడు, తాంబూలపుష్పాక్షత పూర్ణపాణిః= తాంబూలపుష్పాక్షతలచేత నిండింపఁబడిన హస్తములుగలవాఁడై, శుభేదినే = చంద్ర తారాబలాన్వితమైన పంచాంగశుద్ధదినంబునందు, అభిజ్ఞం = తెలిసినట్టి, దైవవిదం=జ్యోతిషికునిఁగూర్చి, గత్వా=సమీపంబునకుఁబోసి, ప్రణిపత్య=నమస్కరించి, తస్మై అజ్యోతిషికునికొఱకు, వరకన్యయోర్భం = పెండ్లికుమార్తె పెండ్లికుమారునియొక్క జన్మనక్షత్రములను, నివేద్య = ఎఱిఁగించి, పృచ్ఛేత్ = ఫలం బడుగవలయు ననుట.

## గోత్రవర్జ్యములు.

స్వగోత్రప్రవరోపేతా హీనాధికకులోద్భవా,
కన్యా వయోధికా నేష్టా దుర్లక్షణగుణాన్వితా. 106

టీ. స్వగోత్రప్రవరోపేతా = వరునియొక్క గోత్రప్రవరలతోఁ గూడినట్టియు, హీనాధికకులోద్భవా = ఎక్కువతక్కువకులమునందు బుట్టినదియు, దుర్లక్షణగుణాన్వితా = దుష్టలక్షణ దుష్టగుణములతోఁగూడినట్టియు, వయోధికా=వరునికంటె నధికవయస్సుగల, కన్యా = కన్యక, నేష్టా = వివాహంబునకు విహితమైనది గాదని తెలియవలయును.

కులంచ శీలంచ వపుర్వయశ్చ విద్యాంచ విత్తంచ సనాథతాంచ,
ఏతాన్గుణాన్ సప్తపరీక్ష్య దేయాః కన్యాబుధైః శ్శేషమచింతనీయమ్.

టీ. కులంచ = వరునివంశమును, శీలంచ = స్వభావసదాచారసంపత్తిని, వపుః = శరీరసౌష్ఠవసౌందర్యములను, వయశ్చ = వయస్సును, విద్యాంచ = వేదశాస్త్రాదివిద్యలను, విత్తంచ=భాగ్యమును, సనాథతాంచ=స్వామ్యము (రక్షకబలము)ను, ఏతాన్ =ఈచెప్పఁబడిన, సప్త=ఏడైన, గుణాన్ = సద్గుణములను, పరీక్ష్య = పరిశీలించి, బుధైః = తెలిసిన వారిచేత, కన్యాః = కన్యకలు, దేయాః=వరులకొఱకీయఁదగినవారలగుదురు. శేషమ్ = కులశీలాదిసప్తగుణంబులకంటె నితరంబేమియును, అచింతనీయం = విచారింపఁదగినదిగాదు. అనఁగాఁ గన్యాదాతయగువాఁడు తనకొమార్తెను వరున కిచ్చి వివాహముసేయునెడల ముందుగా వరునియొక్క కులశీలాదులనుఁ జక్కఁగా విచారించుకొని యనంతరమునందు వివాహము చేయువలయు నని యభిప్రాయము.

## జన్మనామతారలవిషయము.

దంపత్యో ర్జన్మతారాభ్యాం నామర్క్షాభ్యా మథాపివా.

స్త్రీజన్మతారాపూర్వాభ్యాం బ్రూయాత్ప్రాజ్ఞశ్శుభాశుభమ్.

టీ. ప్రాజ్ఞః=తెలిసిన జ్యోతిషికుఁడు, స్త్రీజన్మతారాపూర్వాభ్యాం = కన్యాజన్మనక్షత్రము పూర్వమందుగలిగిన, దంపత్యోః=కన్యావరులయొక్క, జన్మతారాభ్యాం = జననకాల నక్షత్రముచేతనైనను, అథాపివా = అటుగాకపోయినను, నామర్క్షాభ్యాం = నామనక్షత్రముచేతనైనను, శుభాశుభమ్ = శుభాశుభఫలములను, బ్రూయాత్ = చెప్పవలయుననుట.

జన్మధిష్ణ్యభవనోద్భవం ఫలం కామినీపురుషయో ర్విచింతయేత్,
జన్మధిష్ణ్యభవనానభిజ్ఞయా నామతోఽఖిల మిదం విచింతయేత్.

టీ. కామినీపురుషయోః = స్త్రీపురుషులకు, జన్మధిష్ణ్యభవనోద్భవం = జన్మనక్షత్ర జన్మరాసులవలన నుత్పన్నంబైన, ఫలమ్ = శుభాశుభఫలములను, విచింతయేత్ = విచారింపవలయును. జన్మధిష్ణ్యభవనానభిజ్ఞయా=జన్మనక్షత్రజన్మరాసులు తెలియక పోవుటచేత, నామతః = నామనక్షత్రప్రకారముగా, అఖిలమ్=సమస్తమైన, ఇదమ్ = ఈపూర్వోక్తంబగుశుభాశుభఫలంబును, విచింతయేత్=విమర్శింపవలయుననుట.

అజ్ఞాతజన్మనాం నృణాం నామభం పరికల్పయేత్,
తేనైవ చింతయేత్సర్వం రాశికూటాది జన్మవత్. 110

టీ. అజ్ఞాతజన్మనామ్ = తెలియఁబడని జన్మనక్షత్రములుగల, నృణామ్ = మనుష్యులకు, నామభమ్ = నామనక్షత్రంబును, పరికల్పయేత్ = కల్పింపవలయు. తేనైవ = ఆనామ నక్షత్రముచేతనే, సర్వం = సమస్తమైన, రాశికూటాది = రాశిగ్రహకూటాదికమును, జన్మవత్ = జన్మనక్షత్రమందువలె, చింతయేత్=విచారింపవలయును,

జన్మనా జన్మ కుర్వీత నామ్నా నామైవ కారయేత్,
ఉభయం బలహీనం చే త్పుంజన్మ స్త్రీషు నామతః. 111

టీ. జన్మనా = పురుషునిజన్మనక్షత్రముతోఁడ, జన్మ = స్త్రీజన్మనక్షత్రమును, కుర్వీత = చేయవలయును. నామ్నా = పురుషుని నామనక్షత్రంబుతోడ, నామైవ= స్త్రీనామనక్షత్రమునే, కారయేత్ = చేయఁదగును, అనఁగాఁ బురుషునకు జన్మనక్షత్ర ముండినట్లయిన స్త్రీకిని జన్మనక్షత్రమును బట్టియు, పురుషునకు జన్మనక్షత్రములేక నామనక్షత్రంబయున స్త్రీకిని నామనక్షత్రమును బట్టియే విచారింపవలయును. ఉభయం = స్త్రీపురుషులయొక్క, జన్మ = నామనక్షత్రములు రెండును, బలహీనంచేత్ = బలములేనివి యైనపక్షమునందు, పుంజన్మ స్త్రీషు నామతః=పురుషు జన్మనక్షత్రమును స్త్రీనామ నక్షత్రమునుఁ బట్టి ఫలము విచారింపఁదగినది.

ఏకనక్షత్ర వివాహము.

రోహిణ్యార్ద్రామఖే బ్రాహ్మే లష్యశ్రవణ పౌష్ణమ్,

అహిర్బుధ్న్యస్తథా ష్టౌ చ నక్షత్రైక్యే శుభావహాః. 112

టీ. రోహిణ్యార్ద్రామఘేంద్రాగ్ని తిష్యశ్రవణపౌష్ణభం = రోహిణ్యార్ద్రామఖా విశాఖపుష్యశ్రవణ రేవతులును, తథా=ఆప్రకారముగానే, అహిర్బుధ్న్యః= ఉత్తరాభాద్రయును, అష్టౌ చ=ఈయెనిమిదినక్షత్రములును, నక్షత్రైక్యే=స్త్రీపురుషులయొక్క నక్షత్రమునందు, శుభావహాః=శుభసంపాదకంబు లగుచుండును.

అశ్వినీచ యమ స్వాతీ సార్ప ఫాల్గున మేవచ,
మైత్ర వారుణమూలాఖ్యం నక్షత్రైక్యేఽపి మధ్యమాః. 113

టీ. అశ్వినీచ=అశ్వినియును, యమస్వాతీసార్పఫాల్గున మేవచ=భరణిస్వాత్యాశ్రేషా పూర్వఫల్గునులును, మైత్రవారుణమూలాఖ్యం = అనూరాధ శతభిషమూలలును, ఏతే = ఈయెనిమిదినక్షత్రములును, నక్షత్రైక్యేపి = స్త్రీపురుషులకు నక్షత్రైక్యమునందు, మధ్యమాః = మధ్యమంబులైనవి.

అజైకపాచ్ఛ్రవిష్ఠా చ పునర్వస్వథ కృత్తికా,
మృగశీర్షంచ చిత్రాచ సవితోత్తరఫల్గునీ. 114
జ్యేష్ఠాచ విశ్వ తోయం చ నక్షత్రైక్యే వినశ్యతి,
ఏకరాశౌ పృథగ్ధిష్ణ్యే చోత్తమం పాణిపీడనమ్. 115

టీ. అజైకపాత్ = పూర్వాభాద్రయును, శ్రవిష్ఠాచ=ధనిష్ఠయును, పునర్వసు = పునర్వసువును, అథ=పిమ్మట, కృత్తికా = కృత్తికయును, మృగశీర్షంచ= మృగశీర్షయును, చిత్రాచ = చిత్తయును, సవితా = హస్తయును, ఉత్తరఫల్గునీ = ఉత్తరయును, జ్యేష్ఠాచ = జ్యేష్ఠయును, విశ్వతోయం = పూర్వాషాఢోత్తరాషాఢలును, నక్షత్రైక్యే=ఈనక్షత్రములయొక్క ఏకత్వమునందు, వినశ్యతి=కన్యావరులకు నాశనము సంభవించుచున్నది. ఏకరాశౌ=ఒకరాశియందును, పృథగ్ధిష్ణ్యేచ=భిన్ననక్షత్రములయందును, పాణిపీడనం = వివాహము, ఉత్తమం = ఉత్తమంబైనది.

రాశ్యైక్యే చేద్భిన్నమృక్షం ద్వయోస్స్యాన్నక్షత్రైక్యే రాశియుగ్మం తథైవ, నాడీదోషో నో గణానాం చ దోషో నక్షత్రైక్యేభిన్నపాద శ్శుభస్స్యాత్. 116

టీ. ద్వయోః=దంపతులకు, రాశ్యైక్యే=ఏకరాశిత్వమునందు, భిన్నమృక్షం= నక్షత్రభేదము, స్యాచ్చేత్=ఐనను, తథైవ=ఆప్రకారమే, నక్షత్రైక్యే=ఏకనక్షత్రమునందు, రాశియుగ్మం=రాశిభేదము, స్యాచ్చేత్=ఐనను, నాడీదోషః= నాడీదోషమును, గణానాంచదోషః=గణదోషములు, న=లేదు. నక్షత్రైక్యే=ఏకనక్షత్రమునందు, భిన్నపాదః=పాదభేదము, శుభః=వివాహమునందు శుభకరంబైనది, స్యాత్=అగును.

గ్రంథాంతరమందు

ఏకర్క్షే చైకపాదేతు వివాహః ప్రాణహానిదః,
దంపత్యో రేకనక్షత్రే భిన్నపాదే శుభావహః. 117

టీ. ఏకర్క్షేచ = ఏకనక్షత్రమునందు, ఏకపాదేతు = ఒకపాదమందైనను, వివాహః = ఉద్వాహము, ప్రాణహానిదః = ప్రాణనాశకరంబైనది, దంపత్యోః = వధూవరులకు, ఏకనక్షత్రే = ఒకనక్షత్రమందు, భిన్నపాదేతు = పాదభేదమందైన, వివాహః = వివాహము, శుభావహః = శుభమును సంపాదించునది.

గ్రంథాంతరమందు

వారుణార్క్యమరుద్దస్రవహ్న్యప్యపశ్చ విధుః పితా,
ఏషు స్త్రీపూర్వపత్త్వేఽపి రాశ్యైక్యే నతు దోషభాక్. 118

టీ. వారుణార్క్యమరుద్దస్రవహ్న్యప్యపః = శతతారాహస్తాస్వాత్యశ్వినీ కృత్తికా పూర్వాషాఢలును, విధుః=మృగశీర్షయును, పితా=మఖయును, ఏషు = ఈనక్షత్రములయందు, స్త్రీపూర్వపత్త్వేపి = కన్య పూర్వపాదమునం బొందియున్నను, రాశ్యైక్యే = ఏకరాశిత్వంబునందు, వివాహః = ఉద్వాహము, నతుదోషభాక్ = దోషకరమైనదిగాదు.

యుగ్మపాదే చ ధిష్ణ్యేతు వరః పూర్వార్ధగో జయః,
అపరార్ధోద్భవా నారీ చైకర్క్షేఽపి శుభావహః. 119

టీ. వరః = పెండ్లికుమారుఁడు, ధిష్ణ్యేతు = ఏకనక్షత్రమందైనను, యుగ్మపాదేచ = భిన్నపాదమునందును, పూర్వార్ధగోయది = పూర్వార్ధమును బొందినట్లాయెనా, నారీచ = స్త్రీయును, అపరార్ధోద్భవాయది = ఉత్తరార్ధమునుఁ బొందినట్లాయెనా, జయః = విజయము గనుక, ఏకర్క్షేపి = స్త్రీపురుషుల యుభయులకు నొకనక్షత్రమైనను, వివాహః = పెండ్లి, శుభావహః = శుభకరమైనది.

పెడతలనక్షత్రము

ఏకరాశౌ ద్వినక్షత్రే పుంతారా ప్రథమా భవేత్,
అతీవ శోభనం ప్రోక్తం స్త్రీతారా చే ద్వినాశనమ్. 120

టీ. ఏకరాశౌ = ఒకరాశియందు, ద్వినక్షత్రే = రెండునక్షత్రములయందు, పుంతారా = పురుషునినక్షత్రము, ప్రథమాభవేచ్చేత్ = మొదటిదియాయెనా, అతీవ = మిక్కిలి, శోభనం = శుభంబని, ప్రోక్తం = చెప్పఁబడినది, స్త్రీతారాచేత్ = స్త్రీనక్షత్రము మొదటిదియైన, వినాశనం = అశుభఫలము సంభవించును

నామాంశము

శుభ మంశైక్య మద్వాహే దంపత్యో ర్నామతారకే,
గ్రామసంగ్రామసేవాసు సమాంశ మశుభం విదుః. 121

టీ. వివాహే = వివాహవిధియందు, దంపత్యోః = కన్యావరులకు, నామతారకే = నామనక్షత్రమందు, అంశైక్యం=అంశంబొకటి యగుట, శుభం=మంగళకరంబు, గ్రామ సంగ్రామసేవాసు-గ్రామ = గ్రామప్రవేశమందును, సంగ్రామ=యుద్ధమందును, సేవాసు = రాజసేవాదులయందు, సమాంశం=ఏకాంశమును, అశుభం = అశుభకరమైనదానిఁగా, విదుః = పెద్దలు దెలియుదురు.

కన్యానామాంతరవిషయము.

విరుద్ధే రాశినక్షత్రే భవేతామపి చేత్తదా,
దంపత్యోః ప్రీతయే నౄణాం నామాంతరమథ క్షిపేత్. 122

టీ. దంపత్యోః=దంపతులయొక్క, రాశినక్షత్రేపి = రాశినక్షత్రములును, విరుద్ధే = విరోధాక్రాంతంబులైనవి, భవేతాంచేత్ = అయినట్లాయెనా, తదా = ఆసమయంబున, అథ=అటుతర్వాత, నౄణాం=మనుష్యులకు, ప్రీతయే=ప్రియముకొఱకు, నామాంతరం = మఱియొకనామధేయమును, క్షిపేత్=ఉంచవలయును.

గ్రంథాంతరమందు

దంపత్యో రేకనక్షత్రే ద్విపదర్క్షే మృతి ర్భవేత్,
త్రిపదర్క్షే గదోత్పత్తి శ్చతుష్పాదే శుభావహః. 123

టీ. దంపత్యోః=జాయాపతులకు, ఏకనక్షత్రే=ఏకనక్షత్రవిషయమై, ద్విపదర్క్షే=ద్విపాన్నక్షత్రమునందు. మృతిః=మరణము, భవేత్ = అగును. త్రిపదర్క్షే= త్రిపాన్నక్షత్రమునందు, గదోత్పత్తిః = రోగోత్పత్తిరూపంబైన ఫలంబుగలుగును. చతుష్పాదే = నాలుగుపాదములుగల నక్షత్రమందు, వివాహః = వివాహము, శుభావహః = శుభమును సంపాదించుచుండునని యెఱుంగవలయును.

నామాంతరము చేయువిధానము

పంచత్వక్సితసర్షపాన్వితజలం కుంభస్థితం నూతనం
దూర్వాశ్వత్థదళై ర్వివాహసమయే సంప్రోక్షణం కల్పయేత్,
కన్యాయా స్తదనంతరం ద్విజవర స్తస్యాశ్చ పుణ్యాంగనా
పూర్వోక్తం పరిహృత్య మంగళకరం నామాంతరం ప్రక్షిపేత్.

టీ. వివాహసమయే=వివాహముసేయునపుడు, ద్విజవరః=బ్రాహ్మణోత్తముండు,

నూతనం=క్రొత్తదియైన, కుంభస్థితం=కలశంబుననున్నట్టి, పంచత్వక్సితసర్షపాన్వితజలం-పంచత్వక్=మఱ్ఱిమామిడి నేరేడు రావిజువ్విపువ్వులయొక్క చర్మములతోను, సితసర్షప=తెల్లనియావగింజలతోను, అన్వితం=కూడిన, జలం=ఉదకమును, దూర్వాశ్వత్థపత్రైః=గఱికపరకలు రావిచిగుళ్లు వీనిచేత, కన్యాయాః=కన్యకను, సంప్రోక్షణం=సంప్రోక్షించుటను, కల్పయేత్=కల్పింపవలసినది. తదనంతరం=జలసంప్రోక్షణానంతరంబున, పుణ్యాంగనా=ఒక బ్రాహ్మణముత్తైదువ, తస్యాశ్చ=ఆకన్యకను, పూర్వోక్తం=పూర్వమందుంచి ననామమును, పరిత్యజ్య=పరిత్యజించి, మంగళకరం=శుభకరంబగు, నామాంతరం=మఱియొక పేరును, ప్రకుర్వీత = పెట్టవలయును.

విషయము

మూలజా శ్వశురం హంతి వ్యాళజాచ తదంగనామ్,
జ్యేష్ఠజా భావుకం హంతి దేవరంతు ద్విదైవజా.. 125

టీ. మూలజా=మూలానక్షత్రమందు బుట్టినకన్యక, శ్వశురం=మామను, హంతి=చంపును. వ్యాళజా=ఆశ్లేషానక్షత్రమందు జనించినపడుచు, తదంగనాం=అత్తను, జ్యేష్ఠజా = జ్యేష్ఠానక్షత్రమునం దుదయించినకన్య, భావుకం=భావను, ద్విదైవజా=విశాఖా నక్షత్రమందుఁబుట్టిన స్త్రీ, దేవరంతు = మఱఁదిని, హంతి = చంపును.

మూలాశ్లేషావిశాఖాసు మాహేంద్రే చోద్భవః పుమాన్,
నదోషకృద్వివాహే చ స్త్రియస్త్వేతేషు వర్జితాః. 126

టీ. మూలాశ్లేషావిశాఖాసు = మూలాశ్లేషవిశాఖలయందును, మాహేంద్రే చ=జ్యేష్ఠానక్షత్రమందును, ఉద్భవః=పుట్టిన, పుమాన్=పురుషుఁడు, వివాహే=వివాహమందు, నదోషకృత్=దోషమును జేయువాఁడు గాడు. ఏతేషు = ఈచెప్పిన నక్షత్రములయందుఁ బుట్టిన, స్త్రియస్తు=స్త్రీలైతే, వర్జితాః=వివాహమందు విడువఁబడుచుందురని తెలియవలయును.

గ్రంథాంతరమున

తులాయుక్తే ద్విదైవర్క్షే జాతా నారీ న దోషభాక్,
కార్పియుక్తే ద్విదైవర్క్షే జాతా హంతి చ దేవరమ్. 127

టీ. తులాయుక్తే = తులారాశియుక్తంబగు, ద్విదైవర్క్షే = విశాఖానక్షత్రమందు, జాతా=జనించిన, నారీ=కన్యక, నదోషభాక్=దోషమును బొందినదిగాదు. కార్పియుక్తే=వృశ్చికరాశిసహితమైన, ద్విదైవర్క్షే = విశాఖయందు, జాతా=పుట్టిన కన్నియ, దేవరం = మఱఁదిని, హంతి = చంపుమన్నది.

ద్వాదశకూటములు

దినం గణంచ మాహేంద్రం స్త్రీదీర్ఘం యోనిరేవచ,
రాశీ రాశ్యధిపో వశ్యో రజ్జుర్వేధా తథా దశ. 128

పునశ్చ వర్ణకూటం చ నాడీకూటం ప్రశస్యతే,
ఏతే ద్వాదశకూటాస్స్యుః కూటభేదాః ప్రకీర్తితాః. 129

టీ. దినం=దినకూటంబును, గణంచ=గణకూటంబును, మాహేంద్రం=మహేంద్రకూటంబును, స్త్రీదీర్ఘం=కన్యాదూరకూటంబును, యోనిరేవచ=యోనియను కూటంబును, రాశిః రాశికూటంబును, రాశ్యధిపః=రాశ్యధిపకూటంబును, వశ్యః=వశ్యకూటంబును, రజ్జుః=రజ్జుకూటంబును, వేధా=వేధాకూటంబును, తథా=అప్రకారము, దశ=పదికూటములున్ను, పునశ్చ = తిరుగ, వర్ణకూటంచ = వర్ణంబనుకూటంబును, నాడీకూటం = నాడికూటంబును, ప్రశస్యతే = వేఱువేఱుగా బ్రశంసింపఁబడు చున్నది. ఏతే = ఈచెప్పఁబడినవి, ద్వాదశకూటాః = పదిరెండు పొంతనంబులు, స్యుః=అగుచున్నవి. కూటభేదాః=మఱికొన్నిపొంతన భేదములును, ప్రకీర్తితాః = గ్రంథాంతరములందు జెప్పబడియున్నవి.

రాశికూటాదికం సర్వం స్త్రీభ మారభ్య చింతయేత్,
పుంభాత్తారావిశుద్ధి స్స్యాన్నాడీ రజ్జుశ్చ దస్రభాత్. 130

టీ. స్త్రీభమారభ్య=స్త్రీనక్షత్రము మొదలుకొని, పుంభాత్=పురుషనక్షత్ర పర్యంతమును, సర్వం=సమస్తమైన, రాశికూటాదికం=రాశికూటంబు మొదలగుపొంతనములను, చింతయేత్ = విచారింపవలసినది. నాడీ = నాడియను పొంతనమును, రజ్జుశ్చ=రజ్జువనెడు పొంతనమును, దస్రభాత్ = అశ్వినీనక్షత్రమునుండి, తారావిశుద్ధిః = నక్షత్రశోధనముగలది, స్యాత్ = అగును.

గ్రహమైత్రం రాశికూటం తారా నాడీ విశేషతః,
సర్వేషా మేవ వర్ణానా మవశ్యం గణకూటకమ్. 131

టీ. సర్వేషామేవవర్ణానాం=సకలవర్ణములవారికి, గ్రహమైత్రం=గ్రహమైత్రియును, రాశికూటం = రాశిపొంతనమును, తారా=తారాబలమును, నాడీ=నాడీపొంతనమును, గణకూటకం=గణకూటకమును, విశేషతః=విశేషముగా, అవశ్యం=అవశ్యకము

గ్రహమైత్రం ద్విజాతీనాం క్షత్రియాణాం గణస్తథా,
కన్యాదూరం తు వైశ్యానాం శూద్రాణాం యోనిరేవచ. 132

టీ. ద్విజాతీనాం=బ్రాహ్మణులకు, గ్రహమైత్రం=గ్రహమైత్రియును, తథా=అప్రకారము, క్షత్రియాణాం=క్షత్రియులకు, గణః=గణకూటమును, వైశ్యానాంతు=

మూఁడవకులమువారికి తే, కన్యాదూరం = స్త్రీదీర్ఘమును, శూద్రాణాం = నాలవ జాతివారికి, యోనిరేవచ = యోని యనుపొంతనమును, అవశ్యం=ముఖ్యంబుగాఁ జూడఁదగినది.

## దినకూటము

కన్యాదివరఋక్షాంతం గణయే న్నవసంఖ్యయా,
సమాంత్యతారకం శ్రేష్ఠం దినకూటం ప్రశస్యతే. 133

టీ. కన్యాది వరఋక్షాంతం = స్త్రీనక్షత్రము మొదలుకొని పురుషనక్షత్ర పర్యంతమును, నవసంఖ్యయా = తొమ్మిదింటిచేత, గణయేత్ = ఎంచవలసినది. ఆప్రకారం బెంచఁగాఁ, దినకూటం = దినపొంతనము, సమాంత్యతారకం = సమమైన అంత్యంబయిన వరనక్షత్రముగలిగినేని, అనఁగా స్త్రీతారకు బురుషతార, రెండు నాలుగు ఎనిమిది తొమ్మిదాయెనా, శ్రేష్ఠం = ఉత్తమంబని, ప్రశస్యతే = ప్రశంసింపఁబడుచున్నది.

## గణకూటము

పునర్వసుద్వయం స్వాతీ కరశ్రవణతారకాః,
పౌష్ణమైత్రేందుదస్రాఖ్యా స్తారా దేవగణాః స్మృతాః. 134

టీ. పునర్వసుద్వయం=పునర్వసు పుష్యములును, స్వాతీ=స్వాతీనక్షత్రమును, కరశ్రవణతారకాః=హస్తశ్రవణనక్షత్రములును, పౌష్ణమైత్రేందుదస్రాఖ్యాః=రేవత్యనూరాధా మృగశిరాశ్వినులనెడు పేరుగల, తారాః=నక్షత్రములును, దేవగణాః= దేవతాగణంబులని, స్మృతాః = స్మరింపఁబడుచున్నవి.

రోహిణీ త్రీణి పూర్వాణి భరణీ రౌద్రమేవచ,
త్రీణ్యుత్తరాశ్చ విజ్ఞేయా మానుషాః పరికీర్తితాః. 135

టీ. రోహిణీ=రోహిణియును, త్రీణిపూర్వాణి=పుబ్బపూర్వాషాఢ పూర్వాభాద్రలును, భరణీ = భరణియును, రౌద్రమేవచ = ఆర్ద్రానక్షత్రమును, త్రీణ్యుత్తరాశ్చ = ఉత్తరోత్తరాషాఢోత్తరాభాద్రలును, మానుషాః = మానవగణంబులని, పరికీర్తితాః = చెప్పఁబడినవిగా, విజ్ఞేయాః = తెలుసుకోఁదగినవి.

అగ్నిసార్పమఖాచిత్రాద్విదైవేంద్రాశ్చ మూలభమ్,
శ్రవిష్ఠా వారుణంచైవ రాక్షసాఖ్యా గణాస్స్మృతాః. 136

టీ. అగ్నిసార్పమఖాచిత్రా ద్విదైవేంద్రాశ్చ = కృత్తికాశ్లేషామఖాచిత్రా విశాఖా జ్యేష్ఠానక్షత్రములును, మూలభం = మూలయును, శ్రవిష్ఠావారుణంచైవ= ధనిష్ఠాశతభిషములును, రాక్షసాఖ్యాః = రాక్షసము లనెడు పేరుగల, గణాః = గణములని, స్మృతాః = స్మరింపఁబడినవి.

స్వగణం చోత్తమం విద్యా న్మధ్యమం దైవమానుసమ్,
అధమం రాక్షసం దైవం మృత్యు ర్మానుష రాక్షసమ్. 137
స్త్రీ రాక్షసం న కర్తవ్యం కర్తవ్యం నరరాక్షసమ్,

టీ. స్వగణంచ = స్త్రీపురుషనక్షత్రంబులు రెండు నొకగణమైనదైతే, ఉత్తమం = శ్రేష్ఠమైనదానిఁగా, విద్యాత్ = ఎఱుంగవలయు. దైవమానుషం = స్త్రీపురుషనక్షత్రంబులలో నొకనక్షత్రంబు దైవగణమును ఒకనక్షత్రంబు మానుషగణమునైన, మధ్యమం = మధ్యమమైనదానినిఁగాను, రాక్షసం=రాక్షసగణమును, దైవం = దేవగణమును, అధమం = నికృష్టమైనదానినిగాను, విద్యాత్ = తెలియవలయు. అదిగాక, మానుషరాక్షసం = మానవరాక్షసగణంబులైనను, మృత్యుః = మరణము సంభవించుననియు, స్త్రీరాక్షసం = స్త్రీనక్షత్రము రాక్షసగణమైనను, నకర్తవ్యం = చేయఁదగినదిగాదనియును, నరరాక్షసం = పురుషనక్షత్రము రాక్షసగణమైనను, కర్తవ్యం = చేయఁదగినది యనియును, విద్యాత్=ఎఱుంగవలయును.

మాహేంద్రకూటము

వధ్వాదీనాం చతుస్సప్త దశమంచ త్రయోదశం. 138
షోడశైకోనవింశంచ ద్వావింశం పంచవింశతిః,
ఏతే మాహేంద్రయోగా స్స్యుర్వివాహేఽయం ప్రశస్యతే. 139

టీ. వధ్వాదీనాం=స్త్రీనక్షత్రము మొదలగు నక్షత్రంబులలోపల, చతుః = నాలవనక్షత్రమును, సప్త=ఏడవనక్షత్రమును, దశమంచ = పదియవనక్షత్రమును, త్రయోదశం=పదుమూఁడవనక్షత్రమును, షోడశం=పదియాఱవ నక్షత్రమును,ఏకోనవింశంచ=పందొమ్మిదవనక్షత్రమును, ద్వావింశం=ఇరువదిరెండవనక్షత్రమును,పంచవింశతిః=ఇరువదియైదవనక్షత్రమును, ఏతే=ఈనక్షత్రములు,మాహేంద్రయోగాః=మహేంద్రకూటముయొక్క సంబంధముగలవి, స్యుః=అగుచున్నవి. అయం = ఈ మాహేంద్రయోగము, వివాహే = వివాహమందు, ప్రశస్యతే= ప్రశంసింపఁబడుచున్నది. అనగా స్త్రీనక్షత్రంబునకుఁ బురుషనక్షత్రంబు ౪, ౭, ౧౦, ౧౩, ౧౬, ౧౯, ౨౨, ౨౫-వ నక్షత్రంబులలో నొకనక్షత్రంబుగా నుండవలయును.

స్త్రీదీర్ఘము

స్త్రీధిష్ణ్యాదాద్యనవకే స్త్రీదూర మతినిందితమ్,
ద్వితీయే మధ్యమం ప్రోక్తం తృతీయ నవకే శుభమ్. 140
చతుర్దశ శ్రేష్ఠా దూరః స్త్రీబాహుళ్యే వివాహం శుభమ్,

టీ. స్త్రీధిష్ణ్యాత్ = స్త్రీనక్షత్రము మొదలుకొని తొమ్మిదింట గణనచేయవలసినది

అందలి, ఆద్యనవకే=మొదటినవకంబులోఁ బురుషనక్షత్రంబుండిన, స్త్రీదూరం = స్త్రీదీర్ఘంబు, అతినిందితం=మిక్కిలి నిందింపఁబడినది, ద్వితీయే = రెండవనవకంబునందు, మధ్యమం=మధ్యమంబని, ప్రోక్తం=చెప్పఁబడినది. తృతీయనవకే = మూడవ నవకంబునందు, శుభం=శుభకరమైనది. ఐనను, చతుర్దశర్క్షాదుపరి=స్త్రీనక్షత్రంబునకు బురుషనక్షత్రంబు పదునాలుగునక్షత్రంబులకు మీఁదనుండినపక్షమందు, స్త్రీ బాహుళ్యం=స్త్రీదీర్ఘంబను పొంతనము, విశాం=వైశ్యులకు, శుభం=మంచిది.

### స్త్రీదీర్ఘకూటాపవాదము

స్త్రీదీర్ఘం యది నోద్వాహే స్త్రీనాశో భవతి ధ్రువమ్,
స దోషో నాస్తి యద్యస్తి రాశిశ్చ గ్రహమైత్రకమ్. 141

టీ. ఉద్వాహే=వివాహమునందు. స్త్రీదీర్ఘం = స్త్రీదీర్ఘంబనుపొంతనము, నో యది=లేదేని, స్త్రీనాశః=కన్యానాశనము, భవతి = అగుచున్నది. ధ్రువం=నిశ్చయము, రాశిశ్చ=రాశిపొంతనమును, గ్రహమైత్రకం = గ్రహమైత్రియును, అస్తి యది=ఉండినచో, సదోషః=స్త్రీదీర్ఘంబులేనిదోషము, నాస్తి=లేదని తెలియవలయు.

### యోనికూటము

అశ్వినీ శతతారాశ్వౌ భరణీ రేవతీ గజౌ, కృత్తికా పుష్యభం ఛాగౌ రోహిణీందూ భుజంగమౌ. మూలార్ద్రాతు తథా శ్వానౌ మఖా పూర్వాచ మూషకౌ, సార్పాదిత్యేచ మార్జారౌ, స్వాతీ హస్తౌచ మాహిషౌ. విశాఖా చిత్తభే వ్యాఘ్రౌ మృగౌ జేష్ఠానురాధకౌ, ఉత్తరోత్తరభాద్రాతు గావౌచ పరికీర్తితౌ. అభిజిచ్చోత్తరాషాఢా నకులౌ పరికీర్తితౌ, పూర్వాభాద్రావసూ సింహౌ పూర్వాషాఢా హరిః కపీ. 1.5

టీ. అశ్వినీ=అశ్వినియును, శతతారా=శతభిషమును, అశ్వౌ=గుఱ్ఱములు. భరణీ రేవతీ=భరణీరేవతులు, గజౌ=ఏనుఁగులు, కృత్తికాపుష్యభం=కృత్తికాపుష్యములు, ఛాగౌ=మేఁకలు. రోహిణీందూ = రోహిణీమృగశీర్షలు, భుజంగమౌ = పాములు. తథా = ఆప్రకారము, మూలార్ద్రాతు = మూలార్ద్రలు, శ్వానౌ=కుక్కలు. మఖా పూర్వాచ=మఖపుబ్బలు, మూషకౌ=ఎలుకలు. సార్పాదిత్యేచ=ఆశ్రేషాపునర్వసులు, మార్జారౌ=పిల్లులు. స్వాతీహస్తౌచ=స్వాతిహస్తలు, మాహిషౌ=దున్నలు. విశాఖా చిత్రభే=విశాఖాచిత్రానక్షత్రములు, వ్యాఘ్రౌ=పెద్దపులులు. జ్యేష్ఠానురాధకౌ = జ్యేష్ఠానూరాధలు, మృగౌ=లేళ్ళు. ఉత్తరోత్తరాభాద్రా = ఉత్తరోత్తరాభాద్రలు, గావౌచ=గోవులని, పరికీర్తితౌ=చెప్పబడినవి. అభిజిచ్చోత్తరాషాఢా=ఉత్తరాషాఢా

భిజిత్తులు, నకులౌ = ముంగిసలని, పరికీర్తితౌ = చెప్పఁబడినవి. పూర్వాభాద్రవసూ = పూర్వాభాద్రాధనిష్ఠలు, సింహౌ = సింహములు. పూర్వాషాఢాహరీ = పూర్వాషాఢా శ్రవణనక్షత్రంబులు, కపీ = కోఁతులని, పరికీర్తితౌ = చెప్పఁబడినవి.

పుంస్త్రీపూర్వాపరా జ్ఞేయా ధిష్ణ్యానాం యోనిభేదతః,
ఏకయోనిషు సంపత్తిర్దంపత్యోస్సంగమే తథా. 146
భిన్నయోనిషు మధ్యం స్యాదరిభావం నకల్పయేత్,
స్త్రీణాం స్త్రీభిశ్చ సంయోగే వివాహో మధ్యమో మతః. 147
పుంసాం పుంభిశ్చసంయోగస్సదాశత్రుత్వమాప్నుయాత్,

టీ. ధిష్ణ్యానాం = నక్షత్రములయొక్క యోనిభేదతః = యోనికూటభేదమువల్ల, పుంస్త్రీపూర్వాపరా = పురుషనక్షత్రము పూర్వమందును, స్త్రీనక్షత్రముపరమందును గల యోనిపొంతనములు, జ్ఞేయా = తెలియఁదగినవి. తథా = ఆప్రకారము, సంగమే = వివాహవిషయమై, దంపత్యోః = జాయాపతులకు, ఏకయోనిషు = ఏకయోనికూటములయందు, సంపత్తిః = సంపద గలుగుచున్నది. భిన్నయోనిషు = భిన్నయోనికూటములయందు, మధ్యం = మధ్యమఫలంబు, స్యాత్ = అగును. అరిభావం = శత్రుత్వముగలయోని పొంతనమును, నకల్పయేత్ = కల్పింపఁగూడదు. స్త్రీణాం = స్త్రీతారలకు, స్త్రీభిశ్చ = స్త్రీతారలతోడి, సంయోగే = సంబంధము గలిగినపక్షమందు వివాహః = వివాహము, మధ్యమః = మధ్యమంబై, మతః = సమ్మతంబైనది. పుంసాం = పురుషతారలకు, పుంభిశ్చ = పురుషతారలతోడి, సంయోగః = సంబంధము, సదా = ఎప్పుడును, శత్రుత్వం = దంపతులకు వైరమును, ఆప్నుయాత్ = పొందించుచున్నది.

గోవ్యాఘ్రం గజసింహమశ్వమహిషం శ్వైణంచ బభ్రూరగం
వైరం వానర మేషకంచ సుమహాత్తద్వద్బిడాలోందురమ్,
లోకానాం వ్యవహారతోఽన్యదపిచ జ్ఞాత్వా ప్రయత్నాదికం
దంపత్యోర్నృపభృత్యయోరపి సదా వర్జ్యం శుభం స్యాదితి. 148

టీ. గోవ్యాఘ్రములకును, గజసింహములకును, అశ్వమహిషములకు, శ్వానహరిణములకును, నకులసర్పములకును, కపిమేషములకును, మార్జాలమూషకములకును, సదామహావైరము. ఇదిగాక, లోకవ్యవహారంబువల్ల వీనిశత్రుత్వంబు లెఱింగి వివాహంబున కన్యావరులనక్షత్రంబు లట్టిశత్రుయోనికూటములో జరిగిన వానిఁ బరిత్యజింపవలయును.

రాశికూటము

ద్వికే ద్వాదశకే మృత్యూ రాయు ర్ద్వాదశకే ద్వికే.
తృతీయైకాదశకే దుఃఖం సుఖ మేకాదశత్రికే. 149

చతుర్దశకేనిస్స్వం ధనం దశచతుర్థకే,
అశుభం పంచనవమే శుభంతు నవపంచకే. 150

షష్ఠాష్టకే పుత్రనాశః పుత్రలాభోఽష్టషష్ఠకే,
సమసప్తేతు మాంగల్యం దంపత్యోః ప్రీతివర్ధనమ్. 151

టీ. ద్వికే=స్త్రీరాశికిఁ బురుషరాశి రెండవదియైనపక్షమందును, ద్వాదశకే=పురుషరాశికి స్త్రీరాశి పండ్రెండవదియైనపక్షమునందును, మృత్యుః = మరణము కలుగును. ద్వాదశకా = స్త్రీరాశికి బురుషరాశి పండ్రెండవదియును, ద్వికే=పురుషరాశికి స్త్రీరాశి రెండవదియు నైనపక్షమందును, ఆయుః=దీర్ఘాయుస్సు గలుగును. ఇట్లేయగుననే మిగిలిన శ్లోకంబుల నంతట నర్థవిచారంబు సేయవలయును.

దీనికిఁ బరిహారము

ఓజాలయా స్త్రీయో యత్ర మిత్రం షష్ఠాష్టమం వదేత్,
యుగ్మేద్విద్వాదశం చైవ దంపత్యోశ్శుభదం భవేత్. 152

టీ. యత్ర = ఎచ్చట, స్త్రియః = కన్యకలు, ఓజాలయః = ఓజరాశియగుచున్నదో, తత్ర=అచ్చట, ఆస్త్రీయొక్క ఓజరాశికి, షష్ఠాష్టమం=ఆఱవదియెనిమిదవదియైన పురుషరాశిని, మిత్రం=ఇష్టమైనదానిఁగా, వదేత్=చెప్పవలయును. యుగ్మే = యుగ్మరాశియందు, ద్విద్వాదశమ్ = రెండవది పండ్రెండవదియైన పురుషరాశి, దంపత్యోః=జాయాపతులకు, శుభదం=శుభప్రదమైనదై, భవేత్=అగుచున్నది.

ద్విద్వాదశేవా నవపంచమేవా షష్ఠాష్టకే రాక్షసకన్యకాయాః,
ఏకాధిపత్యే౽ప్యుభయోస్సుహృత్త్వేపాణిగ్రహోమంగళమాతనోతి.

టీ. ద్విద్వాదశేవా = రెండవది పండ్రెండవది యగురాసులయందైనను, నవపంచమేవా=తొమ్మిదవయైదవరాసులయందైనను, షష్ఠాష్టగే = ఆఱవయెనిమిదవరాసులయందైన నారాసులకు, ఏకాధిపత్యేతు=ఏకగ్రహాధిపత్యముగలుగుచుండఁగా నైనను, ఉభయోః=ఆరాశిద్వయాధిపతులకు, సుహృత్త్వేపి=మైత్రికలుగుచుండఁగా నైనను, రాక్షసకన్యకాయాఅపి = రాక్షసగణముతోఁజేరినకన్యకయైనను, పాణిగ్రహః=వివాహము, మంగళం=శుభమును, ఆతనోతి = విస్తరింపఁజేయుచున్నది.

తృతీయైకాదశౌ యత్ర చతుర్దశనావపి,
ఉభయోస్సప్తమస్తత్ర గ్రహమైత్రం న శోధయేత్. 154

టీ. యత్ర=ఎచ్చటనైనను, తృతీయైకాదశౌ=దంపతులకుఁ బరస్పరము మూఁడవపదునొకొండవరాసులగుచున్నవో, చతుర్దశమావపి=నాలుగవ పదియవరాసులగుచున్నవో, ఉభయోః=దంపతులకు, సప్తమః = సమసప్తకంబగుచున్నదో, తత్ర=అచ్చ

టచ్చేత్, గ్రహమైత్రం=గ్రహమైత్రి యను పొంతనమును, నశోధయేత్ = శోధింపవలసిన నిమిత్తము లేదు.

వర్ణకూటము

ఝషాళికర్కటా విప్రాః క్షత్రా స్సింహధను స్తులాః,
మేషయుగ్ఘటా వైశ్యా శ్శూద్రా వృషమృగాంగనాః. 155

టీ. ఝషాళికర్కటాః=మీనవృశ్చికకటకములు, విప్రాః=బ్రాహ్మణరాసులు, సింహధనుస్తులాః = సింహధనుస్తులలు, క్షత్రాః = క్షత్రియరాసులు, మేషయుగ్ఘటాః=మేషమిథునకుంభములు, వైశ్యాః = వైశ్యరాసులు, వృషమృగాంగనాః = వృషభమకర కన్యలు, శూద్రాః=శూద్రరాసులని యెఱుంగవలయును.

వర్ణశ్రేష్ఠావర్ణహీనవివాహం నైవ కారయేత్,
యది కుర్యాత్తు మోహేన సద్యో భర్తా వినశ్యతి. 156

టీ. వర్ణశ్రేష్ఠావర్ణహీనవివాహం=ఎక్కువజాతిరాశియందుఁ బుట్టిన స్త్రీకిని, తక్కువజాతిరాశియందుఁ బుట్టిన పురుషునకును వివాహమును, నైవకారయేత్ = చేయఁగూడదు. మోహేన = అజ్ఞానముచేత, కుర్యాద్యది = చేసినట్లైతే, సద్యః= తత్క్షణంబున, భర్తా = పెనిమిటి, వినశ్యతి = నశించుచున్నవాఁడు.

సింహాళీ కర్కివణిజౌ కన్యావృశ్చికకార్ముకౌ,
తులా మీనయమౌ నక్రకన్యే కర్కటక స్తిమిః. 157
మేషకుంభా వజో నక్రో మేషాదే ర్వశ్యరాశయః,

టీ. సింహాళీ = మేషరాశికిసింహవృశ్చికములును, కర్కివణిజౌ = వృషభరాశికి కటకతులలును, కన్యా=మిథునరాశికి కన్యయును, వృశ్చికకార్ముకౌ=కటకరాశికి వృశ్చిక ధనుస్సులును, తులా = సింహమునకు తులయును, మీనయమౌ = కన్యకు మీనమిథునములును, నక్రకన్యే=తులకు మకరకన్యారాసులును, కర్కటః= వృశ్చికమునకుఁ గటకరాశియును, తిమిః = ధనుస్సునకు మీనమును, మేషకుంభౌ= మకరమునకు మేషకుంభములును, అజః=కుంభమునకు మేషమును, నక్రః = మీనమునకు మకరమును, వశ్యంబులు అనఁగా స్వాధీనంబులు. ఏవం=ఈ ప్రకారముగా, మేషాదేః= మేషము మొదలగు ద్వాదశరాసులకును, వశ్యరాసులని తెలియవలయును.

వశ్యయోగా చ్ఛుభం ప్రోక్తం స్త్రీరాశేః పురుషస్యచ. 158
కన్యకావరయో ర్నిత్యం శోధయే న్నృపభృత్యయోః,

టీ. స్త్రీరాశేః=స్త్రీరాశికిని, పురుషస్య= పురుషరాశికిని, వశ్యయోగాత్ =వశ్యయోగముగలుగుటవలన, శుభం=శుభము. ప్రోక్తం= చెప్పఁబడియున్నది. ఈ చెప్పఁబడిన వశ్యయోగమును, కన్యకావరయోః=కన్యావరులయందును, నృపభృత్యయోః=రాజభృ

త్యులయందును, నిత్యం=నిత్యముగా, శోధయేత్=శోధింపఁదగినది యనగా వివాహమందు స్త్రీపురుషరాసులకు వశ్యయోగం బను పొంతనము విచారింపవలయు ననుట.

### గ్రహమైత్రకూటము

దీని నీశ్లోకద్వయ ప్రకారము చూచునది

"శత్రూ మందసితౌ సమ శ్శశిసుతో మిత్రాణి శేషా రవే, స్తీక్ష్ణాంశు ర్హిమరశ్మిజశ్చ సుహృదౌ శేషా స్సమా శ్శీతగోః, జీవేందూష్ణకరాః కుజస్య సుహృదో జ్ఞోఽరి స్సితార్కీ సమౌ, మిత్రే సూర్యసితౌ బుధస్య హిమగు శ్శత్రు స్సమాశ్చాపరే. సూరే స్సౌమ్యసితావరీ రవిసుతో మధ్యః పరే త్వన్యథా, సౌమ్యార్కీ సుహృదౌ సమౌ కుజగురూ శుక్రస్య శేషా వరీ, శుక్రజ్ఞౌ సుహృదౌ సమ స్సురగురు స్సౌరస్య చాన్యేఽరయో, యే ప్రోక్తాస్స్వహృద స్త్రికోణభవనా త్తేఽమీ మయా కీర్తితాః. 160

వీని కర్థము వెనుక వ్రాయఁబడియున్నది.

ఉత్తమో మిత్రవ స్స్యాత్సమమిత్రస్తు మధ్యమః,
కనిష్ఠ స్సమవర్గస్తు వైరివర్గస్తు మారకః. 161

టీ. మిత్రవర్గః = వివాహంబునందు వధూవరులకు, మిత్రగ్రహవర్గంబు, ఉత్తమః = శ్రేష్ఠము, స్యాత్ = అగును. సమమిత్రస్తు=సమమిత్రమైన గ్రహవర్గమైతే, మధ్యమః = మధ్యమంబయినది, సమవర్గస్తు=సమగ్రహవర్గమైతే, కనిష్ఠః=నికృష్టమైనది, వైరివర్గస్తు = శత్రుగ్రహవర్గమైతే, మారకః = మృతికరంబగును.

కలహః శత్రుమిత్రత్వే వియోగ స్సమశత్రుకే,
అంశనాయకయోః ప్రీతౌ వృత్తమం పాణిపీడనమ్. 162

టీ. శత్రుమిత్రత్వే = శత్రుమిత్రగ్రహవర్గంబునందు, కలహః=దంపతులకు కలఁతసంభవించును. సమశత్రుకే=సమశత్రుగ్రహవర్గంబునందు, వియోగః = జాయాపతులకు వియోగము సంభవించును. అంశనాయకయోః ప్రీతౌ = స్త్రీపురుషుల యొక్క రాశ్యధిపతులకుఁ బరస్పరము మిత్రత్వములేకపోయినప్పటికిని తద్రాశ్యంశాధిపతులకైనను మిత్రత్వంబుగలిగినపక్షమునందు, పాణిపీడనం = వివాహము. ఉత్తమం = శ్రేష్ఠమైనదియనుట.

### రజ్జుకూటము

విధుబింబత్రయంచైవ తిర్యగ్రేఖాచతుష్టయమ్,
ఆశ్విన్యాదీని ధిష్ణ్యాని వామపార్శ్వాదివిన్యసేత్. 163

టీ. విధుబింబత్రయంచైవ = చంద్రబింబాకారంబుగా మూఁడురేఖలను నిడుపుగాను, తిర్యగ్రేఖాచతుష్టయం= నాలుగురేఖల నడ్డముగాను, లిఖిత్వా=లిఖించి, అందు

అశ్విన్యాదీనిధిష్ణ్యాని=అశ్విని మొదలగు నక్షత్రములను, వామపార్శ్వాది=చక్రమున కెడమవైపుననుండి, విన్యసేత్ = విన్యసింపవలయును.




శిరఃకంఠోదరకటిపాద రేఖాదిభేదతః,
ఏకరేఖా భవే న్నాశో భిన్నరేఖా శ్శుభావహాః. 164

టీ. శిరఃకంఠోదరకటిపాదరేఖాదిభేదతః-శిరః = శిరోరేఖయనియు, కంఠ = కంఠరేఖయనియు, ఉదర=ఉదరరేఖయనియు, కటి=కటిరేఖయనియు, పాదరేఖా= పాదరేఖయనియు, ఆఃభేదతః = ఇట్టిరేఖాభేదమువల్ల నక్షత్రంబులను వ్రాయవలయును. ఏకరేఖా=వధూవరులిద్దఱినక్షత్రంబులుగలది యొకరేఖయయ్యె నేని, నాశః= నాశనము, భవేత్ =అగును, భిన్నరేఖా=కన్యావరనక్షత్రంబులలోపల నొకనక్షత్రంబుగలదియొకరేఖయు నొక నక్షత్రంబుగలది మఱియొక రేఖయునైన, వివాహః = ఉద్వాహము, శుభావహః = శుభసంపాదకంబగును.

అశ్విసార్పమఖాజ్యేష్ఠామూలాంత్యం పాదరజ్జవః, యమార్యభాగ్య మైత్రాప్య మహిర్బుధ్న్యః కటీరితాః 165 అగ్న్యదిత్యార్యమా శూర్పవిశ్వప్రోష్ఠపదోదరే, బ్రహ్మారుద్రకరస్వాతీశ్రవణం వారుణం తథా 166 కంఠరజ్జు ర్విజానీయా ద్వసుచిత్రేందు మస్తకమ్,

టీ. అశ్విసార్పమఖాజ్యేష్ఠామూలాంత్యం=అశ్విన్యాశ్లేషామఖాజ్యేష్ఠామూలారేవతులను నక్షత్రములు, పాదరజ్జవః = పాదరజ్జువులనియు, యమార్యభాగ్య మైత్రాప్యం=భరణిపుష్యపుబ్బానూరాధాపూర్వాషాఢలు, అహిర్బుధ్న్యః=ఉత్తరాభాద్రయు నీయాఱునక్షత్రములు, కటీరితాః=కటిరజ్జువులనియు, అగ్న్యదిత్యార్యమా = కృత్తికాపునర్వసూత్తరఫల్గునులును, శూర్పవిశ్వప్రోష్ఠపదాః = విశాఖోత్తరాషాఢా పూర్వాభాద్రలు నీయాఱునక్షత్రములు, ఉదరం = ఉదరరజ్జువులనియు, తథా=ఆప్రకారమే, బ్రహ్మారుద్రకరస్వాతీశ్రవణం = రోహిణ్యార్ద్రాహస్తస్వాతీశ్రవణములును, వారుణం=శతభిషము నీ యాఱునక్షత్రములు, కంఠరజ్జుః=కంఠరజ్జువులనియు, వసుచిత్రేందు=ధనిష్ఠాచిత్రామృగశీర్షలు మూఁడునక్షత్రములు, మస్తకం= శిరోరజ్జువులనియు నీప్రకారము, విజానీయాత్ = తెలియవలయును.

ఏకరేఖారజ్జుఫలము

ముఖే పతిం గళే కన్యాం కుక్షౌ స్వస్యాత్మజాం హరేత్. 167

దరిద్రతా భవేత్కట్యాం పాదేవా భ్రమణం తథా,

టీ. ముఖే=శిరోరేఖయందుండిన స్త్రీపురుషనక్షత్రము, పతిం=భర్తను, గళే=కంఠరేఖయందుండిన స్త్రీపురుషనక్షత్రము, కన్యాం=కన్యకను, కుక్షౌ=ఉదరరేఖయందుండిన స్త్రీపురుషనక్షత్రము, స్వసాప్యత్యజాన్=దంపతులయొక్క కుమారులను, హరేత్=హరించును, కట్యాం = కటిరేఖయందుగల స్త్రీపురుషనక్షత్రములుండిన, దరిద్రతా=దారిద్ర్యమును తథా=ఆప్రకారము, పాదేవా = పాదరేఖయందుండిన, భ్రమణం = తిరుగుటయును, భవేత్ = అగును.

వేధాకూటము

అశ్వాది మూలాదిమఖాదిభానాం క్రమాచ్చతుర్ణామపి వేధితాస్స్యుః,
పురాణరాజామనుభానుసంఖ్యయా చాన్యోన్యవేధాస్సుసోమచిత్రాః.

టీ. అశ్వాదిమూలాది మఖాదిభానాం - అశ్వాది=అశ్విని మొదలైనట్టియు, మూలాది=మూల మొదలుకొనినట్టియు, మఖాది=మఖ మొదలుకొనినట్టి, భానాం = నక్షత్రములలోపల, చతుర్ణామపి=నాలుగు నక్షత్రములకును, క్రమాత్=ఈ జెప్పిన యశ్విన్యాది క్రమముగాను, పురాణరాజామను భానుసంఖ్యయా = పదునెనిమిది పదియారు పదునాలుగు పండ్రెండుసంఖ్యలచేత, వేధితాః=వేధలు, స్యుః=అగును. ససోమ చిత్రాశ్చ=ధనిష్ఠమృగశీర్షచిత్తలును, అన్యోన్యవేధాః = పరస్పరము వేధ గలిగినవి అనగా నశ్వినికి బదునెనిమిదవనక్షత్రమును, రోహిణికి బండ్రెండవ నక్షత్రమును వేధానక్షత్రంబులని యెఱింగి యట్టినక్షత్రములయందు వివాహము సేయఁగూడదు. ఈప్రకారమే మూలాదినక్షత్రములయందు నూహింపవలయును.

విద్ధాచ్చైవ పరస్పరం యది భవేత్తారా వివాహే తదా,
స్యాచ్ఛీఘ్రం యమరాజపుణ్యలలనాసంగాంగభోగో వరః. 169

టీ. వివాహే=ఉద్వాహమునందు, తారా=స్త్రీనక్షత్రమును పురుషనక్షత్రమును, పరస్పరమ్=అన్యోన్యము, విద్ధాచ్చైవభవేద్యది=వేధింపఁబడినదేని, తదా=అప్పుడు, శీఘ్రం=శీఘ్రముగా, వరః=పెండ్లికుమారుఁడు, యమరాజపుణ్యలలనాసంగాంగభోగః = యమధర్మరాజుయొక్క భార్యతోడ సాంగత్యముచేతనైన శరీరసౌఖ్యము గలవాఁడు, స్యాత్ = అగును అనఁగా మరణించును.

నాడీకూటము

చతుర్నాడీతు బాహ్లీకే పాంచాలే పంచపర్వభిః,
అన్యదేశే త్రినాడీ స్యాన్నాడీముఖ్యా కరగ్రహే. 170

టీ. బాహ్లీకే = బాహ్లీకదేశమందు, చతుర్నాడీ=నాలుగుపర్వములచేత నాడి పొంతనము విచారింపవలసినది. పాంచాలే=పాంచాలదేశమునందు, పంచపర్వభిః = అయిదుపర్వములచేత నాడిపొంతనము చూడవలసినది, అన్యదేశే = ఇతరదేశముల యందు, త్రినాడీ=మూఁడుపర్వములచేత నాడిపొంతనము, ముఖ్యా=ఆవశ్యకమైనది, స్యాత్ = అగును.

నాడ్యస్తిస్రస్త్వ్యక్తనిశ్శేషధిష్ణ్యాస్త్రిభ్యోఽశ్విన్యాదిభ్య ఏవ ప్రశస్తాః,
సర్పాకారాత్ర నాడీసమాయాం నక్షత్రాణా మేకనాడీమ్మృతిస్స్యాత్.

టీ. తిస్రః = మూఁడైన, నాడ్యః=నాడులు, త్రిభ్యః = మూఁడైన, అశ్విన్యాదిభ్య ఏవ = అశ్విని మొదలగు నక్షత్రములవల్ల, త్యక్తనిశ్శేషధిష్ణ్యాః = విడువఁబడిన సమస్తనక్షత్రములుగలవియే, ప్రశస్తాః = ప్రసిద్ధంబులగుచున్నవి. తత్ర= ఆనక్షత్రములను లెక్కబెట్టెడు పర్వములయందు, నాడీ = నాడి, సర్పాకారా = సర్పాకారముగలదియగుచున్నది. నక్షత్రాణాం = స్త్రీపురుషనక్షత్రములకు, ఏకనాడీ = ఒకనాడియైనపక్షమందు, సమాయాం = సంవత్సరములోపల, మృతిః = వధూవరులకు మరణము, స్యాత్ = అగును. అనఁగా అశ్విని మొదలుకొని నక్షత్రములను మూఁడుపర్వములమీఁద నారోహణావరోహణక్రమముగా లెక్కఁబెట్టఁగా నందు మూఁడు నాడులలో నొకనాడియందు వధూవరనక్షత్రంబు లుండినట్లైతే ఆనక్షత్రములనుబరిత్యజింపవలసినది. వధూనక్షత్రంబొకనాడియందును, వరనక్షత్రంబొకనాడియందు నుండినపక్షమునందు నట్టినక్షత్రములయందు వివాహము సేయఁదగినది యని యెఱుంగవలయును.

బ్రహ్మక్షత్రవిశాం నాడ్యో మధ్యదక్షిణవామకాః,
బ్రాహ్మణాదే ర్విశేషేణ మధ్యనాడ్యాది నిందితమ్. 172

టీ. బ్రహ్మక్షత్రవిశాం=బ్రాహ్మణక్షత్రియవైశ్యులకు, నాడ్యః=నాడులు,మధ్యదక్షిణవామకాః =మధ్యదక్షిణవామభాగములవల్లఁదెలియవలయును.అనఁగా,మధ్యమనాడి=బ్రాహ్మణనాడియనియు,దక్షిణనాడి=క్షత్రియనాడియనియు,వామనాడి=వైశ్యనాడియనియు నెఱుంగఁదగినది.బ్రాహ్మణాదేః=బ్రాహ్మణులు మొదలగువారికి,విశేషేణ= అతిశయముగా, మధ్యనాడ్యాది=మధ్యనాడి మొదలైనవి,నిందితం=నిందింపఁబడినవి.

సా మధ్యనాడీ పురుషం నిహంతి తత్పార్శ్వనాడీ ఖలు కన్యకాంచ,
ఆసన్నపర్యాయగతా సమా చేద్వర్షేణ వాచ్యం క్రమశస్త్రివర్షైః.

టీ. సామధ్యనాడీ = పూర్వోక్తమైన మధ్యనాడి, పురుషమ్ = పురుషుని, నిహంతి= కొట్టుచున్నది. తత్పార్శ్వనాడీ=ఆపార్శ్వనాడి, కన్యకాంచ = కన్యకను, నిహంతిఖలు = కొట్టుచున్నదిగదా. సమా=సమనాడి, ఆసన్నపర్యాయగతా చేత్ = మొదటిపర్యాయమును బొందినట్లాయెనా, వర్షేణ = ఒకసంవత్సరముచేత, (మరణం = మరణము), వాచ్యం = చెప్పఁదగినది, సమా = సమనాడి, రెండవ మూఁడవపర్యాయములను బొందినట్లాయెనా, క్రమశః = వరుసగాను, త్రివర్షైః = (రెండు)మూఁడు సంవత్సరములచేత మరణము చెప్పఁదగినది.

రజ్జుకూటాపవాదము

రజ్జోరభావో యదస్తి రాశిశ్చ గ్రహమైత్రకమ్,
దినమాహేంద్రయుక్తోఽపి రజ్జుదోషో న విద్యతే. 174

టీ. రజ్జోః=రజ్జుపొంతనముయొక్క, అభావః=లేకపోవుట, అస్త్యపి=కలిగి

యున్నప్పటికిని, దినమాహేంద్రయుక్తః = దినమహేంద్రకూటముతోఁగూడిన, రాశిశ్చ = రాశిపొంతనమును, గ్రహమైత్రకం = గ్రహమైత్రియనుపొంతనమును, అస్తియది = ఉండినట్లైతే, రజ్జుదోషః = రజ్జుపొంతనము లేనిదోషము, న విద్యతే = లేకపోవుచున్నది.

అహిర్బుధ్న్యద్వయేచైవ ప్రాజాపత్యత్రయే తథా,
శ్రుతిపుష్యవిశాఖాసు నాడీదోషో న విద్యతే. 175

టీ. అహిర్బుధ్న్యద్వయేచైవ = ఉత్తరాభాద్ర రేవతులయందును, తథా = ఆప్రకారము, ప్రాజాపత్యత్రయే = రోహిణీమృగశీర్షార్ద్రలయందును, శ్రుతిపుష్యవిశాఖాసు = శ్రవణపుష్యవిశాఖలయందును, నాడీదోషః = స్త్రీపురుషనక్షత్రంబు లేక నాడియైన సంభవించెడుదోషంబు, న విద్యతే = లేదు.

అంశనాడీప్రకారము

నక్షత్రాదంశతో నాడీకూటం సామాన్య ముచ్యతే,
నక్షత్రపాదభేదేన నాడీ ముఖ్యా కరగ్రహే. 176

టీ. నక్షత్రాత్ = నక్షత్రమువల్లనైన నాడికూటముకంటె, అంశతః = నక్షత్రపాదభేదమువల్లనైన, నాడీకూటం = నాడిపొంతనము, సామాన్యం = సాధారణంబని, ఉచ్యతే = చెప్పఁబడుచున్నది. కరగ్రహే = వివాహమునందు, నాడీ = నాడియను పొంతనము, నక్షత్రపాదభేదేన = నక్షత్రాంశభేదముచేత, ముఖ్యా = ఆవశ్యకంబైనది.

దస్రాద్యంశాస్తు విజ్ఞేయా అష్టోత్తరశతం క్రమాత్,
పూర్వం నక్షత్రసంఖ్యావ ద్గణయే దంశనాడికాః. 177

టీ. దస్రాద్యంశాస్తు = అశ్విని మొదలగు నిరువదియేడునక్షత్రములయొక్కయంశములైనను, అష్టోత్తరశతం = నూటయెనిమిదియని, విజ్ఞేయాః = తెలుసుకోఁదగినవి. పూర్వం = పూర్వమందు, నక్షత్రసంఖ్యావత్ = నక్షత్రముల నెంచడమునందువలె, క్రమాత్ = అశ్విన్యాదిక్రమముగాను, అంశనాడికాః = అంశనాడులను, గణయేత్ = ఎంచవలయును.

త్రినాడీస్వరూపము

| అశ్వి | భ | కృ |
|---|---|---|
| ఆర్ద్ర | మృ | రో |
| పు | పుష్య | ఆశ్లే |
| ఉత్త | పూఫ | మ |
| హ | చిత్రా | స్వా |
| జ్యే | అనూ | వి |
| మూ | పూషా | ఉషా |
| శ | ధ | శ్ర |
| పూభా | ఉభా | రే |

చతుర్నాడీస్వరూపము.

| | | | |
|---|---|---|---|
| కృ | రో | మృ | ఆర్ద్రా |
| మ | ఆశ్రే | పుష్య | పున |
| పూఫ | ఉఫ | హ | చి |
| జ్యే | అనూ | వి | స్వా |
| మూ | పూషా | ఉషా | శ్ర |
| ఉభా | పూభా | శత | ధ |
| రే | అ | భ | ౦ |

పంచనాడీస్వరూపము.

| | | | | |
|---|---|---|---|---|
| మృ | ఆ | పున | పుష్య | ఆశ్రే |
| చి | హ | ఉఫ | పూఫ | మఖ |
| స్వా | వి | అనూ | జ్యే | మూ |
| శ | ధ | శ్ర | ఉషా | పూషా |
| పూభా | ఉభా | రే | అ | భ |
| ౦ | ౦ | ౦ | రో | కృ |

నారదీయమున

చతుస్త్రిద్వ్యంఘ్రిభోత్థాయాః కన్యాయాః క్రమశోఽశ్విభాక్,
వహ్నిభాగిందుభాఙ్నాడీ త్రిచతుఃపంచపర్వసు. 178

• టీ. చతుస్త్రిద్వ్యంఘ్రిభోత్థాయాః = చతుష్పాత్త్రిపాద్ద్విపాన్నక్షత్రముల యందుఁబుట్టిన, కన్యాయాః = కన్యకకు, నాడీ = నాడి, త్రిచతుఃపంచపర్వసు = మూఁడు నాలుగైదుపర్వములయందు, క్రమశః = చతుష్పాదాదినక్షత్రక్రమముగా, అశ్విభాక్ = చతుష్పాన్నక్షత్రంబైన యశ్వినిని బొందినదియును, వహ్నిభాక్ = త్రిపాన్నక్షత్రమైన కృత్తికనుఁ బొందినదియును, ఇందుభాక్ = ద్విపాన్నక్షత్రంబైన మృగశీర్షను బొందినదియును, భవతి = అగుచున్నది. అనఁగాఁ చతుష్పాన్నక్షత్రంబు మూఁడుపర్వములమీఁదను, త్రిపాన్నక్షత్రంబు నాలుగుపర్వముల మీఁదను, ద్విపాన్నక్షత్రంబు నైదు పర్వములమీఁదను, ద్విపాన్నక్షత్రంబు నైదు పర్వములమీఁదను లెక్కపెట్టవలసినది.

మాతులసుతోద్వాహము

రాశీశశత్రుత్వే ఽప్యైకనాడీ షష్ఠాష్టమం వా నవపంచమం వా,
శరగ్రహేమాతులకన్యకాయాశ్శుభోఽయదిస్యాచ్ఛుభసంత్వభీష్టమ్.

టీ. అథ = అనంతరమునందు, రాశీశశత్రుత్వే = స్త్రీపురుషరాశ్యధిపతులకు శత్రుత్వంబయినను, ఏకనాడీ = స్త్రీపురుషనక్షత్రంబు లేకనాడియందుండినను, షష్ఠాష్టమంవా = స్త్రీపురుషరాసులు పరస్పరము షష్ఠాష్టమములైనను, నవపంచమంవా = నవపంచమంబులైనను, మాతులకన్యకాయాః = మేనమామకుమార్తె

యొక్క, కరగ్రహే = పాణిగ్రహణమునందు, అభీష్టంశకునంయది=మంచిశకునం బయినట్లాయెనా,శుభః= శుభఫలము, స్యాత్ = అగుచున్నది.

గౌతమ్యా యామ్యదిగ్భాగే కావేర్యా శ్చోత్తరే తటే,
మాతులస్య సుతోద్వాహం ప్రశంసంతి మనీషిణః. 180

టీ. గౌతమ్యాః=గౌతమీనదియొక్క, యామ్యదిగ్భాగే = దక్షిణపుదిక్కునను, కావేర్యాః = కావేరియొక్క, ఉత్తరేతటేచ = ఉత్తరభాగమునందును, మాతులస్యసుతోద్వాహం= మేనమామకొమార్తెను బెండ్లిజేసికొనుటను, మనీషిణః= విద్వాంసులు, ప్రశంసంతి = ప్రశంసించుచున్నారు.

పితృష్వస్సుతాయాశ్చ సుతాయా మాతులస్య చ,
వివాహో దినకూటాదీనవిచార్య ప్రవర్తతే. 181

టీ. పితృష్వసృసుతాయాశ్చ=మేనయత్తకొమార్తెయొక్కయు, మాతులస్య సుతాయాశ్చ=మేనమామకొమార్తెయొక్కయు, వివాహః = వివాహము దినకూటాదీన్=దినకూటము మొదలైన పొంతనములను, అవిచార్య=విచారింపక, ప్రవర్తతే = ప్రవర్తించుచున్నది. అనగా మేనత్తకొమార్తెను మేనమామకొమార్తెను వివాహము చేసికొను నెడల పొంతనములు మొదలైనవాని విచారింపవలసిన నిమిత్తము లేదు.

వివాహాంతరవిషయము

భార్యాంతరవివాహస్స్యా ద్దయుగ్మే వత్సరే శుభః,
యుగ్మే భర్తృవినాశాయ గార్గ్యస్య వచనం యథా. 182

టీ. గార్గ్యస్యవచనంయథా=గార్గ్యునివచనమట్టులు, భార్యాంతరవివాహః= ద్వితీయవివాహము, అయుగ్మేవత్సరే=విషమసంవత్సరమునందు, శుభః=మంగళకరం బయినది, స్యాత్=అగును, యుగ్మే = సమసంవత్సరమున, భర్తృవినాశాయ = భర్తృనాశముకొఱకు, స్యాత్ = అగును.

గ్రంథాంతరమున

పత్నీవియోగే ప్రథమేచ వర్షే నోచేద్ద్వివర్షే పునరుద్వహేత్సః,
అయుగ్మ మాసేషు శుభం వదంతి వసిష్ఠగార్గ్యాదిమునీంద్రవర్యాః.

టీ. పత్నీవియోగే = జ్యేష్ఠభార్యావియోగముగలుగుచుండగా, ప్రథమేచ వర్షే = మొదటిసంవత్సరమునందు, నోచేత్ = ద్వితీయవివాహముగాక పోయినట్లయిన, సః = ద్వితీయవివాహేచ్ఛగలపురుషుఁడు, ద్వివర్షే పునః= రెండవసంవత్సరమునందైన, అయుగ్మమాసేషు = బేసిమాసములయందె, ఉద్వహేత్ = ద్వితీయవివాహము చేసుకొనవలసినది. అప్రకారముచేసుకొన్న వివాహమును, వసిష్ఠగార్గ్యాది మునీంద్రవర్యాః = వసిష్ఠగార్గ్యులు మొదలైన మునిసత్తములు, శుభం=శుభకరమైనదానినిగా, వదంతి = చెప్పుచున్నారు.

నారదీయమున

యుగ్మేఽబ్దే జన్మతః స్త్రీణాం ప్రీతిదం పాణిపీడనమ్.

సంపత్పుంసా మయుగ్మే౽బ్దే వ్యత్యయే నాశనం తయోః॥ 184

టీ. జన్మతః=జన్మము మొదలుకొని, యుగ్మేబ్దే=సమసంవత్సరమునందు, స్త్రీణాం స్త్రీలకు, పాణిపీడనం=వివాహము, ప్రీతిదం=ఇష్టప్రదంబయినది, పుంసాం=పురుషులకు, అయుగ్మే౽బ్దే=జననము మొదలుకొని విషమసంవత్సరమునందు, పాణిపీడనం = వివాహము, సంపత్ =సంపత్కరంబయినది. వ్యత్యయే=చెప్పిన ప్రకారమునకు వినిమయము గలుగుచుండఁగా, తయోః=ఆదంపతులకు నాశనం=అరిష్టముసంభవించును.

న కదాచిద్వింశత్యృక్షే భానో రార్ద్రాప్రవేశనాత్,
వివాహో దేవతానాంచ ప్రతిష్ఠా చోపనాయనమ్.
నా౽స్తంగతే సితే జీవే న తయో ర్బాలవృద్ధయోః,
న గురౌ సింహరాశిస్థే సింహాంశకగతే౽పివా. 186

టీ. భానోః = సూర్యునియొక్క, ఆర్ద్రాప్రవేశనాత్ = ఆర్ద్రానక్షత్రప్రవేశము మొదలుకొని, వింశత్యృక్షే = ఇరువదినక్షత్రములయందు, కదాచిత్ = ఒకానొకప్పుడును, వివాహః=వివాహమును, దేవతానాం ప్రతిష్ఠాచ=దేవతాప్రతిష్ఠయును, ఉపనాయనం = ఉపనయనమును, న=చేయఁగూడదు. తథా=ఆప్రకారము, సితే=శుక్రుఁడును, జీవే=బృహస్పతియును, అస్తంగతేసతి=అస్తమయమును బొంది యుండఁగా, న=కూడదు. తయోః = ఆగురుశుక్రులు, బాలవృద్ధయోః=బాల్యమును వృద్ధత్వమును బొందినవారలగుచుండఁగాను, న=కూడదు, గురౌ=బృహస్పతి సింహరాశిస్థేసతి = సింహరాశినిబొందుచుండఁగానైనను, సింహాంశకగతేపివా = సింహరాశినవాంశమునుఁ బొందుచుండఁగానైనను, వివాహదేవతాప్రతిష్ఠోపనయనంబులు సేయఁదగినవి గావని తెలియవలయును.

ఇందుకపవాదము, వాసిష్ఠసంహిత

సింహంగతేదేవగురౌవివాహంనేచ్ఛంతియాత్రాంయమునాతటాన్తే,
కళింగవంగేష్వథమాగధేషు దోషః ప్రయుక్తోన తథా౽న్యదేశే.

టీ. దేవగురౌ=బృహస్పతి, సింహంగతేసతి=సింహరాశినిఁ బొందినవాఁడగుచుండగా, యమునాతటాన్తే=యమునానదీతీరదేశమందును, కళింగవంగేషు=కళింగవంగదేశములయందును, అథ=తర్వాత, మాగధేషు=మగధదేశములయందును, వివాహం = ఉద్వాహమును, యాత్రాం=దేశాంతరయానమును, నేచ్ఛంతి=పెద్దలిచ్ఛయింపరు. తథా=ఆప్రకారముగా, అన్యదేశే=వెనుకఁజెప్పినదేశములకంటెనితరదేశములయందు, దోషః=ఆ సింహగురుదోషము, నప్రయుక్తః = సంప్రాప్తంబైనది గాదు.

గురుశుక్రుల బాలత్వ వృద్ధత్వములు

పశ్చాత్ప్రాగుదితశ్శుక్రో దశత్రిదివసం శిశుః,
వృద్ధః పంచదినం పక్షం గురోః పక్షంతు సర్వదా. 188

టీ. పశ్చాత్ప్రాగుదితః=పడమటి తూరుపుదెసలయందుదయించిన, శుక్రః=శుక్రుఁడు, దశత్రిదివసం=క్రమముగాఁ బదిదినములు మూఁడుదినములును, శిశుః =

బాలుండగుచున్నాఁడు. ఆప్రకారమే, పంచదినం=అయిదుదినములును, పక్షం=పది యేనుదినములును, వృద్ధః = వృద్ధుండగుచున్నాఁడు. గురోస్తు = బృహస్పతికైతే, సర్వదా = ప్రాక్పశ్చిమదిక్కులయందుదయించినప్పుడు న స్తమించినపుడును, పక్షం= పదియేనుదినములు వృద్ధత్వబాల్యములు గలుగుచున్నవియని యెఱుంగవలయు.

శుక్రో గురుః ప్రాక్పరతశ్చ కాలే విన్ధ్యే దశావన్తిషు సప్తరాత్రమ్।
వఙ్గేషు హూణేషు చ షట్చ పంచ శేషేతు దేశే త్రిదినంచవర్జ్యమ్.

టీ. శుక్రః = శుక్రుఁడును, గురుః=బృహస్పతియును, ప్రాక్పరతశ్చకాలే = పూర్వపశ్చిమదిక్కుల నుదయాస్తమయములను బొందినకాలమునందు, విన్ధ్యే = విన్ధ్యదేశమునందు, దశ = పదిదినములు వర్జింపఁదగినవి. అవంతిషు=అవంతిదేశముల యందు, సప్తరాత్రం=ఏడుదినములు విడువఁదగినవి. వంగేషు=వంగదేశములయందు, షట్చ = ఆఱుదినములును, హూణేషుచ = హూణదేశములయందు, పంచ=అయిదు దినములును పరిత్యజింపఁదగినవి. శేషేదేశేతు=మిగిలినదేశములయందైతే, త్రిదినం= మూఁడుదినములు, వర్జ్యం = విడువఁదగినవి.

విన్ధ్యస్య దక్షిణే దేశే వృద్ధబాల్యే సితేజ్యయోః,
త్రిదినం వర్జయిత్వా తు తత స్తస్యాం చ శోభనమ్. 190

టీ. సితేజ్యయోః=శుక్రబృహస్పతులకు, వృద్ధబాల్యేసతి = వృద్ధత్వబాలత్వ ములు గలుగుచుండఁగా, విన్ధ్యస్య=విన్ధ్యపర్వతముయొక్క, దక్షిణేదేశే=దక్షిణ దేశమునందు, త్రిదినం=మూఁడుదినములను, వర్జయిత్వా=విడిచిపెట్టి, తతః=పిమ్మట, తస్యాం=ఆవిన్ధ్యపర్వతదక్షిణభూమియందు, శోభనం=శుభకార్యము సేయఁదగినది.

## మౌఢ్యవర్జ్యములు

వాపీకూపతటాకయాగగమనక్షౌరప్రతిష్ఠావ్రతం
విద్యామందిరకర్ణవేధనమహాదానం వనస్థాపనమ్,
తీర్థోద్వాహజపాభిషేక మఖిలాన్దోషప్రయుక్తేతరాన్
దూరేణైవజిజీవిషుః పరిహరేదార్యేఽస్తగే వా సితే. 101

టీ. ఆర్యే=గురుండైనను, సితేవా=శుక్రుఁడైనను, అస్తగేసతి=అస్తమించిన వాఁడగుచుండఁగా, జిజీవిషుః = జీవితాశగల పురుషుఁడు, వాపీకూపతటాకయాగ గమనక్షౌరప్రతిష్ఠావ్రతం=కొలను బావి చెరువు జన్నము యానము క్షురకర్మ దేవతా ప్రతిష్ఠాపనయనములును, విద్యామందిరకర్ణవేధనమహాదానం = విద్యారంభ నూతన గృహారంభ కర్ణవేధన మహాదానములు, వనస్థాపనం = తోఁటలువేయించుటయును, తీర్థోద్వాహజపాభిషేకం = పుణ్యతీర్థసేవా వివాహ నూతనమంత్రానుష్ఠాన పట్టాభి షేకములును, ఏతాన్=వీనిని, దోషప్రయుక్తేతరాన్ = దోషప్రయుక్తములైన

శాంత్యాది కర్మలకంటెనితరంబులైన. అఖిలాన్యా = సమస్తములైనయితరకర్మలను, దూరేణైవ=దూరముగానే, పరిహరేత్ పరిత్యజింపవలసినది. అనఁగా గురుశుక్రమూఢములయందు నీశ్లోకములోఁ జెప్పినట్లు వివాహాదిశుభకార్యములనుఁజేయఁగూడదు.

మూఢదోషమునఁ జేయఁదగినవి.

భుజంగమూలగ్రహరోగశాంతి ష్వలబ్ధయోగే గ్రహణాభిషేకే,
దోషప్రయుక్తేష్వఖిలవ్రతేషుచోత్పాతశాంతౌన చమౌఢ్యదోషః.

టీ. భుజంగమూలగ్రహరోగశాంతిషు-భుజంగమూల=ఆశ్లేషామూలాది గండ నక్షత్రములయొక్క శాంతి యందును, గ్రహ = గ్రహచారసంబంధమైన శాంతి యందును, రోగశాంతిషు=వ్యాధివిషయములైనజపహోమదానాదిశాంతులయందును, అలబ్ధయోగే=హూతాలబ్ధంబయున, గ్రహణాభిషేకే= గ్రహణసంబంధమైన శాంతి యందును అభిషేకమునందును, దోషప్రయుక్తేషు = దోషప్రయుక్తప్రాయశ్చిత్తాది కార్యములయందును, అఖిలవ్రతేషుచ = సమస్తవ్రతములయందును, ఉత్పాత శాంతౌ = అశని పాతకము మొదలైన మహోత్పాతములయొక్క శాంతియందును, మౌఢ్యదోషః = మూఢదోషము, న=లేదు.

మూఢదోషాపవాదము - కాలప్రకాశికయందు.

ఏకో మూఢో భవే దన్య స్స్వోచ్చమిత్రాంశగో యది,
స్వరాశిమూర్తిగశ్చైవ మౌఢ్యదోషో న విద్యతే. 193

టీ. ఏకోమూఢః=గురుశుక్రులలో నొకఁడ స్తమించియుండఁగా, అన్యః = మఱియొకండు, స్వోచ్చమిత్రాంశగః = తనయొక్క ఉచ్చమిత్రాంశములను బొందిన వాఁడైనను, స్వరాశిమూర్తిగశ్చైవ=స్వక్షేత్రమునుఁ బొందినవాఁడైనను, భవేద్యది= అయినట్లాయెనా, మౌఢ్యదోషః = మూఢదోషము, న విద్యతే = లేదు.

జీవే లగ్నే బలోపేతే పాపా స్త్ర్యాయారిరాశిషు,
స్థితాశ్చే దస్తశుక్రస్య దోషో నాస్తీతి భార్గవః. 194

టీ. జీవే=బృహస్పతి, లగ్నే = సుముహూర్తమునందు, బలోపేతేసతి = బలసహితుఁడై యుండఁగా, పాపాః = కుజాది పాపగ్రహములు, త్ర్యాయారి రాశిషు=తృతీయలాభషష్ఠస్థానములయందు, స్థితాశ్చేత్ =ఉండిరేని, అస్తశుక్రస్య= అస్తమించిన శుక్రునియొక్క, దోషః = దోషము, నాస్తీతి = లేదని, భార్గవః = భార్గవమహామునియొక్క మతము.

గురో ర స్తంగతో దోషో నాస్తి శుక్రోదయో యది,
ద్వయో ర స్తమయ స్స్యాచ్చే దపవాదైర్న భిద్యతే. 195

టీ. శుక్రోదయోయది = శుక్రోదయంబయినట్లాయెనా, గురోః = బృహస్పతి యొక్క, అస్తంగతో దోషః=అస్తమించినందువల్లనైన దోషము, నాస్తి = లేదు.

ద్వయోః = గురుశుక్రుల కిద్దఱికి, అస్తమయః = అస్తమించుట, స్యాచ్చేత్=అయి నట్లాయెనా, అపవాదైః=విశేషవచనములచేత, నభిద్యతే=భేదింపఁబడదు. అనఁగా మూఢదోషము గలదని యెఱుఁగఁదగినది.

వర్షమాసషష్ట్యాద్యంతవర్జ్యములు.

వర్షాంతే వర్జయే త్పక్షం మాసాంతే చ దిన త్రయమ్,
ఋక్షాంతే ఘటికే ద్వేచ గ్రహణే దినసప్తకమ్. 196
మాసాంతే త్రిదినం నేష్టం వర్షాంతే దినపంచకమ్,
షష్ట్యంతే వత్సర స్త్యాజ్యో షణ్మాసం వా విసర్జయేత్. 197

టీ. వర్షాంతే=సంవత్సరాంతమునందు, పక్షం=పదియేను దినములు, మాసాంతే = మాసాంతమునందు, దినత్రయం = మూఁడుదినములును, ఋక్షాంతే = నక్షత్రాంతము నందు, ఘటికేద్వేచ=రెండుఘడియలును, గ్రహణే-గ్రహణమునందును, దినసప్తకం =ఏడుదినములును, వర్జయేత్ = పరిత్యజింపవలయును. మాసాంతే = మాసాంతము నందు, త్రిదినం = మూఁడుదినములు, నేష్టం = శుభకరములైనవి గావు. వర్షాంతే = సంవత్సరాంతమునందు, దినపంచకం = ఐదుదినములు, షష్ట్యంతే= ప్రభవాదిషష్టి, సంవత్సరాంతమునందు, సంవత్సరం=ఒకసంవత్సరము, త్యాజ్యః=విడిచిపెట్టఁదగి నది. షణ్మాసంవా = షష్ట్యంతమునందు నాఱుమాసములైనను విసర్జయేత్ = త్యజింపవలయును.

ప్రాకృతాబ్దో గురో రబ్దస్సౌరాబ్దస్త్రివిధస్స్మృతః,
తేషా మాదౌ తథాంతేచ వర్జయేచ్చ దినత్రయమ్. 198
అంగవంగకళింగేషు మాసషట్కం విసర్జయేత్,
ఆంధ్రదేశేషు సర్వత్ర త్రిమాసం వర్జయే ద్బుధః. 199

టీ. అబ్దః=సంవత్సరము, ప్రాకృతాబ్దః=చాంద్రమానాబ్దంబనియు,గురోరబ్దః= బార్హస్పత్యాబ్దంబనియు,సౌరాబ్దః=సౌరాబ్దంబనియు, త్రివిధః=మూఁడువిధంబులు గలదని, స్మృతః=స్మరింపఁబడినది, తేషాం=అచాంద్రమాన బార్హస్పత్యమానసౌర మానాబ్దంబులలోపల, ఆదౌ=మొదటిదియైన చాంద్రమానాబ్దమునందును, తథా= ఆప్రకారముగా, అంతేచ=సౌరమానాబ్దంబునందును, దినత్రయం=మూఁడుదినములు, వర్జయేత్=విడిచిపెట్టవలయును. అంగవంగకళింగేషు = అంగవంగకళింగదేశముల యందు, మాసషట్కం = షష్ట్యంతమునందాఱుమాసములను, విసర్జయేత్ = విడువ వలయును. ఆంధ్రదేశేషు సర్వత్ర = తెనుఁగుదేశములయందంతట, త్రిమాసం = మూఁడుమాసములను, బుధః = తెలిసినవాఁడు, వర్జయేత్ = త్యజింపవలయును.

## జన్మమాసాదివర్జ్యములు.

జన్మోదయే జన్మరాశౌ జన్మర్క్షే జన్మవాసరే,
జన్మమాసేచ దంపత్యో ర్వివాహోఽత్యంతదుఃఖదః. 209

టీ. జన్మోదయే = జననకాలలగ్నమునందును, జన్మరాశౌ = జన్మనక్షత్రరాశియందును, జన్మర్క్షే = పుట్టిననక్షత్రమందును, జన్మవాసరే = పుట్టినదినమునందును, జన్మమాసేచ = పుట్టిన నెలయందును, దంపత్యోః=జాయాపతులకు, వివాహః = ఉద్వాహము, అత్యంతదుఃఖదః=అత్యంతదుఃఖకరము.

సాంఘాతికే జన్మని సాముదాయే వైనాశికే కర్మణి మానసర్క్షే,
చౌలవ్రతే హోమవిధిర్న కార్యః కర్తుః క్రియానష్టకరీ భవేత్సా.

టీ. సాంఘాతికే=సాంఘాతికనక్షత్రమందును, జన్మని=జన్మ తారయందును, సాముదాయే=సాముదాయనక్షత్రమందును, వైనాశికే = వైనాశికనక్షత్రమందును, కర్మణి=కర్మనక్షత్రమునందును, మానసర్క్షే=మానసాఖ్యనక్షత్రమునందును, చౌల = వ్రతే = చూడాకర్మోపనయనములు, హోమవిధిః = వివాహమును, న కార్యః = చేయఁదగినవిగావు. కర్తుః = చేసినవానికి, సా క్రియా=ఆచూడాకర్మాదివిధానము, నష్టకరీ = నాశకరంబైనది, భవేత్ = అగును.

## వివాహయోగ్యాయోగ్యమాసములు.

మాఘఫాల్గునవైశాఖజ్యేష్ఠమాసాః శుభప్రదాః,
మధ్యమౌ కార్తికో మార్గశీర్షో వై నిందితాః పరే. 202

టీ. మాఘఫాల్గునవైశాఖజ్యేష్ఠమాసాః = మాఘఫాల్గునవైశాఖ జ్యేష్ఠమాసములు, శుభప్రదాః = శుభకరములైనవి-అనఁగా నుత్తమంబులు. కార్తికః=కార్తికమాసమును, మార్గశీర్షో వై=మార్గశీర్షమును, మధ్యమౌ=మధ్యమములైనవి, పరే = శేషించినమాసములు, నిందితాః = నిందింపఁబడినవి. అనఁగా నధమములు.

అజగోయుగ్మకుంభాళిమృగరాశిగతే రవౌ,
ముఖ్యః కరగ్రహ స్త్వన్యరాశిగే న కదాచన. 263

టీ. రవౌ=సూర్యుడు, అజగోయుగ్మకుంభాళిమృగరాశిగతేసతి = మేషవృషభమిథునకుంభవృశ్చికరాసులను బొందియుండఁగా, కరగ్రహః=వివాహము, ముఖ్యః=శ్రేష్ఠమైనది. అన్యరాశిగేతు=ఇతరరాసుల బొందియుండఁగా నైతే, కదాచన = ఒకానొకప్పుడు, న=వివాహము చేయఁగూడదు.

శూన్యమాసములు.

ఉత్తరాయణగే సూర్యే మీనచైత్రంతు వర్జయేత్,
మీనచైత్రో ధనుఃపుష్యో మిథునాషాఢకో౽పి చ. 204
కన్యాభాద్రపదో మాస శ్శూన్యమాసాః ప్రకీర్తితాః,

టీ. సూర్యే=సూర్యుఁడు, ఉత్తరాయణగేసతి = ఉత్తరాయణమును జెంది యుండఁగా, మీనచైత్రంతు=మీనచైత్రమాసమును, వర్జయేత్ = విడిచిపెట్టవల యును, మీనచైత్రః = మీనచైత్రమును, ధనుఃపుష్యః = ధనూరాశియుక్తమైన పుష్యమాసమును, మిథునాషాఢకో౽పిచ = మిథునరాశిసమేతంబయిన యాషాఢ మాసమును, కన్యాభాద్రపదః = కన్యారాశితోఁగూడిన భాద్రపదమాసమును, శూన్యమాసాః = శూన్యమాసంబులని, ప్రకీర్తితాః = చెప్పఁబడినవి. అనఁగా నట్టిమాసములయందు వివాహము సేయఁదగదు.

పౌష్యో న దూష్యో మకరేణయుక్తశ్చైత్ర స్తథా మేషసమన్వితశ్చ,
శుచిశ్చ కేచిన్మిథునేన యుక్తో వివాహకార్యం శుభదం వదంతి,

టీ. మకరేణయుక్తః = మకరరాశిసహితమైన, పౌష్యః=పుష్యమాసమును, తథా = ఆప్రకారము, మేషసమన్వితః = మేషరాశితోఁగూడిన, చైత్రశ్చ=చైత్ర మాసమును, మిథునేనయుక్తః = మిథునయుక్తంబయిన, శుచిశ్చ = ఆషాఢమాస మును, న దూష్యః=నిందింపఁదగినదిగాదు ఏతేషు=ఈమాసములయందు, కేచిత్ = కొందఱు, వివాహకార్యం = ఉద్వాహకార్యమును, శుభదం = శుభప్రదంబయిన దానిఁగా, వదంతి = చెప్పుచున్నారు.

ముండనం మీనచైత్రేతు మండనం మేషచైత్రకే,
ముండనం మండనంచైవ మేషచైత్రే విధీయతే. 206

టీ. మీనచైత్రేతు = మీనచైత్రమునందైన, ముండనం = ఉపనయనవ్రత మును, మేషచైత్రకే = మేషసహితంబగు చైత్రమాసమునందు, మండనం=వివాహ కార్యమును చేయవచ్చును. మేషచైత్రేతు = మేషచైత్రమునందైన, ముండనం = ఉపనయనమును, మండనం = వివాహమున విధీయతే = విధింపబడుచున్నది.

సూర్యుఁ డార్ద్రయందుండఁగా గూడదనుటకు గర్గసంహిత.
ఆర్ద్రాదికే స్వాతివిరామకాలే నక్షత్రబృందే దశకే తథైవ,
వివాహచౌలవ్రతబంధనాఖ్యం సురప్రతిష్ఠా చ న కార్యమేవ. 207

టీ. ఆర్ద్రాదికే=ఆర్ద్రానక్షత్రము మొదలుగాఁ గలిగినట్టియు, స్వాతివిరామ కాలే = స్వాతీనక్షత్రంబంతముగాఁగలిగినట్టి, దశకే=పదియైన, నక్షత్రబృందే =

హామునందు, తదైవ = అప్పుడు, వివాహచౌలవ్రతబంధనాఖ్యం = వివాహచూడాకర్ణోపనయనములును. సురప్రతిష్ఠాచ = దేవతాప్రతిష్ఠయును, నకార్యమేవ = చేయఁదగినవికావు.

కాశ్యపసంహిత.

జ్యేష్ఠమాసే యదా సూర్యో రుద్రర్క్షే చార్ద్రభోగవాన్,
వివాహాదిశుభం కార్యం కేచిదాహుస్త్రయో౽ంశకాః. 208

టీ. జ్యేష్ఠమాసే=జ్యేష్ఠమాసమునందు, యదా=ఎప్పుడు, సూర్యః=సూర్యుఁడు రుద్రర్క్షేచ=ఆర్ద్రానక్షత్రమందును, అర్ధభోగవాన్=సగ మనుభవించుచున్నాఁడో, తదా=అప్పుడు, వివాహాదిశుభం=వివాహము మొదలైనశుభకార్యము. కార్యం = చేయవచ్చును. కేచిత్=కొందఱు మునులు, త్రయో౽ంశకాః = ఆర్ద్రానక్షత్రములో మూఁడు పాదములు, యోగ్యాః=వివాహాదియోగ్యంబులని వదంతి=చెప్పుచున్నారు.

ఆషాఢమాసవర్జ్యము.

శుచిమాసే నవోఢాయాః ప్రవేశం శ్వశ్రుమందిరమ్,
వర్జయేన్మతిమాం స్తత్ర మునయో౽పి వదంతి హి. 209

టీ. మతిమాన్=బుద్ధిమంతుఁడైనవాఁడు, శుచిమాసే=ఆషాఢమాసమునందు, శ్వశ్రుమందిరం=అత్తవారింటినిగూర్చి, నవోఢాయాః ప్రవేశం=నూతనవధూప్రవేశమును, వర్జయేత్ = విడిపింపవలసినది. తదా = ఆప్రకారముగా, తత్ర=ఆయాషాఢమాసమునందు, మునయో౽పి = ఇతరమునీశ్వరులును, వదంతిహి = చెప్పుచున్నారు. అనఁగా నాషాఢమాసమునందు నూతనగృహప్రవేశము చేయఁగూడదు.

చాతుర్మాస్యే న దూష్యస్స్యాద్గాంధర్వాఖ్యకరగ్రహః,
మాసప్రాధాన్యకర్మాణి కర్తవ్యాని మనీషిభిః. 210

టీ. చాతుర్మాస్యే = ఆషాఢమాసము మొదలుకొని నాలుగుమాసములయందు, గంధర్వాఖ్యకరగ్రహః = అష్టవిధవివాహంబులలోపల గాంధర్వంబనియెడు పాణిగ్రహణము, దూష్యః=దూషింపఁదగినది, న స్యాత్ = కాదు. (తత్ర = ఆనాలుగు మాసములయందు), మనీషిభిః=విద్వాంసులచేత, మాసప్రాధాన్యకర్మాణి=మాసమున ప్రధానముగాఁ జేయఁదగిన వ్రతాదికార్యములు, కర్తవ్యాని=చేయఁదగినవి.

వధూకృత్యము.

కుర్యాచ్ఛ్వశురయోః పాదవందనం భర్తృతత్పరా,
ద్వారోపసేవనం నిత్యం గవాక్షావేక్షణం తథా. 211

టీ. (స్త్రీ=స్త్రీ,) శ్వశురయోః=అత్తమామలకు. నిత్యం=నిరంతరమును, పాదవందనం=పాదములనుగూర్చి నమస్కారమును, తథా=ఆప్రకారము, భర్తృతత్పరా=

పతింగనుందత్యంతాసక్తిగలిగినదియై, ద్వారోపసేవనం = పెనిమిటివచ్చుపర్యంతము వాకిట గాచియుండుటను, గవాక్షావేక్షణం = గవాక్షనిరీక్షణమును, కుర్యాత్ = చేయవలయును.

వివాహే బలమావశ్యం దంపత్యోర్గురుసూర్యయోః,
చేత్పూజాం యత్నతః కుర్యాద్దుర్బలప్రదయోస్తయోః. 212

టీ. వివాహే=వివాహమునందు, దంపత్యోః = జాయాపతులకు,గురుసూర్యయోః=గురుసూర్యులయొక్క,బలం=బలము. ఆవశ్యం=ముఖ్యమయినది. దుర్బలప్రదయోశ్చేత్-దౌర్బల్యమునిచ్చువారైనట్టాయెనా,తయోః = ఆగురుసూర్యులకు, యత్నతః=ప్రయత్నపూర్వకముగా, పూజాం=పూజను, కుర్యాత్ =చేయవలయును.

శుభేక్షితయుతాశ్శస్తా ఉద్వాహేఽఖిలరాశయః,
శుభషడ్వర్గగే లగ్నే మహాదోషవివర్జితే. 213
జామిత్రశుద్ధిసంయుక్తే వివాహశ్శుభదో మతః,

టీ. ఉద్వాహే=వివాహమునందు, అఖిలరాశయః=సమస్తరాసులును, శుభేక్షితయుతాః=శుభగ్రహములచేత వీక్షితంబులును సంయుక్తంబులునునై, శస్తాః = ప్రసిద్ధంబులగుచున్నవి. శుభషడ్వర్గగే=శుభగ్రహషడ్వర్గమును బొందినట్టియు, మహాదోషవివర్జితే = ఏకవింశతిమహాదోషంబులచేత, వర్జితంబయినట్టియు, జామిత్రశుద్ధిసంయుక్తే=సప్తమశుద్ధితోఁగూడినట్టి, లగ్నే=ముహూర్తమునందు = వివాహః వివాహము, శుభదః = శుభప్రదంబయి. మతః = సమ్మతంబయినది.

## పుష్కరాంశలు.

ఏకవింశో మనుశ్చైవ జినాశ్చ మునయః క్రమాత్. 214
మేషాదిమీనపర్యంతం పుష్కరాంశాః ప్రకీర్తితాః,

టీ. ఏకవింశః=ఇరువదియొకటవభాగమును, మనుశ్చైవ=పదునాలుగవభాగమును, జినాశ్చ=ఇరువదినాలుగవభాగమును మునయః=ఏడవభాగమును, క్రమాత్ = మేషాదిక్రమముగా, మేషాదిమీనపర్యంతం=మేషము మొదలుకొని మీనపర్యంతమును, పుష్కరాంశాః=పుష్కరాంశములు, ప్రకీర్తితాః=చెప్పఁబడినవి.

శ్వశురోఽర్కస్సితశ్శ్వశ్రూస్త్రీణామస్తపతిః పతిః. 215
తేషూచ్చాదిస్థితేష్వేషు శుభం నీచారిగేష్వసత్,

టీ. స్త్రీణాం=స్త్రీలకు, అర్కః=సూర్యుఁడు, శ్వశురః = మామ, సితః శుక్రుఁడు, శ్వశ్రూః=అత్త, అస్తపతిః = శనైశ్చరుఁడు, పతిః = భర్త, తేషు=ఆసూర్యశుక్రశనైశ్చరులు, ఉచ్చాదిస్థితేషు = ఉచ్చమూలత్రికోణ స్వక్షేత్రమిత్రక్షేత్రములను బొందియుండఁగా, శుభం=శుభములు గలుగును. ఏషు=ఈగ్రహములు, నీచారి

గేషు సత్సు = నీచశత్రు క్షేత్రములను బొందుచుండగా, అసత్ = శుభము గలుగక పోవుచున్నది.

## వివాహవేదికాలక్షణము.

హస్తోచ్ఛ్రితాం హస్తచతుష్టయేన విస్తీర్ణితాం మందిరవామభాగే,
విచిత్రితాం స్తంభచతుష్కయుక్తాం సోపానరమ్యాంచ వివాహ
వేదీమ్. 216

టీ. హస్తోచ్ఛ్రితాం = ఒకహస్తప్రమాణం బున్నతంబైనట్టియు, హస్త చతుష్టయేన విస్తీర్ణితాం = నాలుగుహస్తములు ప్రమాణము విశాలంబయినట్టియు, స్తంభ చతుష్కయుక్తాం = నాలుగు స్తంభములతోఁ గూడినట్టియు, సోపానరమ్యాం = మెట్లచేత సుందరమైనట్టియు, విచిత్రితాం = చిత్రితంబయినట్టి, వివాహవేదిం పెండ్లియరుగును, మందిరవామభాగే = గృహంబున కీశాన్యభాగమునందు నిర్మించవలయుననుట.

## వివాహపీఠలక్షణము.

కుర్యాద్వివాహపీఠంతు శుభలక్షణసంయుతమ్,
సప్తత్రింశతికం దీర్ఘ మాయామం పంచకం తథా. 217
షడున్నతం చాంగుళానాం వివాహే పీఠ ముచ్యతే,

టీ. సప్తత్రింశతికందీర్ఘం = ముప్పదియేడంగుళములు పొడవుగలిగినట్టియు, తథా = అప్రకారము, పంచకమాయామం = అయిదంగుళములు వెడల్పుగలిగినట్టియు అంగుళానాంషడున్నతంచ = ఆఱంగుళములయెత్తుగలిగినదియు, శుభలక్షణసం యుతం = శుభకరములైన పసుపుకుంకుమతోరణము మొదలుగాఁగల చిహ్నంబులు గలిగినట్టి వివాహపీఠంతు = పెండ్లిపీటను, కుర్యాత్ = ఏర్పఱచవలసినది. ఇతి = ఈప్రకారము. వివాహే = వివాహమునందు, పీఠం = పెండ్లిపీటయొక్క లక్షణము, ఉచ్యతే = చెప్పఁబడుచున్నది.

## పంచకము.

తిథివారోడుభిర్యుక్తం తత్కాలోదయమిశ్రితమ్. 218
నవభిస్తు హరేర్భాగం శేషం పంచక మీరితమ్,

టీ. తిథివారోడుభిః = తిథివారనక్షత్రములతోడ, యుక్తం = కూడినట్టి, తత్కాలోదయమిశ్రితమ్ = తత్కాలలగ్నముతోఁ గలిసినమొత్తము, నవభిః = తొమ్మిదింటిచే, భాగం = భాగమును, హరేత్ = హరించినయెడల, శేషం = మిగిలిన సంఖ్య, పంచకం = పంచకమనంబడు. అనఁగా మూఁడు అయిదు ఏడు తొమ్మిది మిగిలినట్లైతే పంచక రహితంబయినదియని తెలియవలయును.

ఏకో మృత్యుర్ద్వయం వహ్నిశ్చత్వారో రాజపంచకమ్. 219
షట్చోరో వసు రోగస్స్యాదిత్యేతత్పంచకం స్మృతమ్,

టీ. ఏకః=ఒకటిమిగిలితే, మృత్యుః = మృత్యుపంచకము, ద్వయం=రెండు, వహ్నిః = అగ్నిపంచకము, చత్వారః=నాలుగు, రాజపంచకం = రాజపంచకము, షట్=ఆఱు, చోరః = చోరపంచకము, వసు=ఎనిమిది, రోగః = రోగపంచకము, స్యాత్ = అగుచున్నది. ఇతి = ఈప్రకారము, ఏతత్=ఈచెప్పినది, పంచకం = పంచకంబని, స్మృతం = స్మరింపఁబడినది. అనఁగా నిచ్చటఁ జెప్పినపంచకములు మంచివిగావనుట.

సేవాయాం రాజకం మార్గే చోరం రాజాగ్ని మాలయే. 220
మౌంజీబంధన ఉద్వాహే రోగం మృత్యుంచ వర్జయేత్,

టీ. సేవాయాం=రాజును సేవింపఁబోవునప్పుడు, రాజకం=రాజపంచకమును, మార్గే=ప్రయాణమునందు, చోరం=చోరపంచకమును, ఆలయే = నూతనగృహారంభమునందు, రాజాగ్నిం = రాజపంచకమును-అగ్నిపంచకమును, మౌంజీబంధనే = ఉపనయనమునందు, ఉద్వాహే = వివాహమందును, రోగం = రోగపంచకమును, మృత్యుంచ = మృత్యుపంచకమును, వర్జయేత్, = విడిచిపెట్టవలయును.

త్యజేద్భానువారేతురోగంశనౌమృత్యుకంభూమిపుత్రేతువహ్నిమ్,
గురౌ సోమవారేచ రాజాన మేవం బుధే భార్గవే తస్కరాఖ్యమ్.

టీ. భానువారేతు=ఆదివారమువాఁడైతే, రోగం=రోగపంచకమును,శనౌ = శనివారమునందు, మృత్యుకం=మృత్యుపంచకమును, భూమిపుత్రేతు=అంగారకవారమునందైతే, వహ్నిం=అగ్నిపంచకమును, గురౌ = గురువారమునందును, సోమవారేచ=ఇందువారమునందును, రాజానం=రాజపంచకమును, ఏవం = ఈప్రకారముగా, బుధే=సౌమ్యవారమునందును, భార్గవే=శుక్రవారమునందును, తస్కరాఖ్యం=చోరపంచకమును, త్యజేత్ =పరిత్యజింపవలయును.

చోరం రోగం త్యజే ద్రాత్రౌ దివా రాజాగ్ని మేవ చ,
అర్ధరాత్రే త్యజేన్మృత్యుపంచకం యత్ర దృశ్యతే. 222

టీ. రాత్రౌ=రాత్రికాలమునందు. చోరం రోగం=చోరరోగపంచకములను, దివా=పగటియందు, రాజాగ్ని మేవచ = రాజవహ్నిపంచకములను, అర్ధరాత్రే=నిశీథకాలమునందు, మృత్యుం = మృత్యుపంచకమును, త్యజేత్ = విడిచిపెట్టవలసినది. యత్ర = ఏవివాహమునందు, పంచకం=చోరరోగరాజాగ్ని మృత్యుపంచకములలో నేదియైనను, దృశ్యతే=కనఁబడుచున్నదో, అది త్యజింపదగినది యని పక్షాంతరం బనుట.

## స్వల్పదోషములు.

ఉపగ్రహాఖ్యం దూష్యంచ భగ్రహాం యుద్ధదూషితమ్,
విరుద్ధయోగనాడ్యశ్చ పంగ్వంధగ్రహజన్మభమ్, 223

టీ. దూష్యం=దూషింపఁబడిన, ఉపగ్రహాఖ్యం = ఉపగ్రహంబను పేరుగల దోషమును, యుద్ధదూషితం = యుద్ధమునందు దూషింపబడిన, భగ్రహం=భగ్రహం బనుదోషమును, విరుద్ధయోగసాద్యశ్చ=విరుద్ధంబులైన మరణయోగ నాశయోగాదుల యొక్క ఘడియలును, పంగ్వంధగ్రహాజన్మభం = కుంటిరాసులు గ్రుడ్డిరాసులు జన్మనక్షత్రమును ఈచెప్పినవి స్వల్పదోషంబులని తెలియవలసినది.

### ఈదోషములకు దేశవ్యవస్థ

ఉపగ్రహర్క్షం కురుబాహ్లికేషు కళింగవంగేషు చ లత్తసంభవమ్,
సౌరాష్ట్రఘూర్జ్జరేషు చ పాతజన్యం శేషేతు దేశే న విరుద్ధదోషః.

టీ. కురుబాహ్లికేషు=కురుదేశబాహ్లికదేశములయందు, ఉపగ్రహర్క్షం=ఉపగ్రహనక్షత్రదోషమును.. కళింగవంగేషుచ=కళింగవంగదేశములయందు, లత్తసంభవం =లత్తవలనఁబుట్టినదోషమును, సౌరాష్ట్రఘూర్జరేషుచ=సౌరాష్ట్రఘూర్జరదేశములయందు పాతజన్యం=పాతముకల్లఁ బుట్టినదోషము(అగుచున్నది.), శేషేతుదేశే=మిగిలినదేశములయందైతే నవిరుద్ధదోషః=ఈచెప్పిన విరుద్ధదోషంబులు లేవని తెలియవలయును.

యే కర్తరీదగ్ధాదయ ఏతే దోషా వివర్జనీయాః ఖలు మధ్యదేశే,
దుస్స్వప్న దుర్దర్శనదుర్నిమిత్తదుశ్శాకునాద్యా అపి యత్ర తత్ర.

టీ. కర్తరీదగ్ధాద్యయః = కర్తరినక్షత్రదగ్ధనక్షత్రములు మొదలైనవి, యే = ఏవో, తేదోషాః=ఆదోషంబులన్నియు, మధ్యదేశే = మధ్యదేశంబునందు, వివర్జనీయాఃఖలు = విడువదగినవిగదా.. దుస్స్వప్నదుర్దర్శనదుర్నిమిత్తదుశ్శాకునాద్యా అపి = చెడుకలలుపుట్టుట స్వప్నావలోకనములు అశనిపాతము మొదలగుదుర్నిమిత్తములు దుష్టశకునములు మొదలైనవియున్నియును, యత్ర=ఏదేశమునందుఁగనఁబడుచున్నవో, తత్ర = ఆదేశమెల్ల పరిత్యజింపవలసినది.

వజ్రేతు ఘటికాషట్కం జ్వాలాఖ్యేఘటికాష్టకమ్.
త్రిస్రః పంచోత్పాతమృత్యోర్నవ స్యుర్యమకంటకే. 226

టీ. వజ్రే=వజ్రనామయోగమునందు, ఘటికాషట్కం = ఆఱుగడియలును, జ్వాలాఖ్యే=జ్వాలాముఖనామయోగమునందు, ఘటికాష్టకం = ఎనిమిదిగడియలును, ఉత్పాతమృత్యోః = ఉత్పాతమృత్యునామయోగములయందు, త్రిస్రఃపంచ=క్రమముగా 3, 5 గడియలును, యమకంటకే=యమకంటకయోగమునందు, నవ=9గడియలును, వర్జ్యాః = వర్జింపఁదగినవి, స్యుః=అగును.

### దోషభంగములు.

శుక్రః పంచసహస్రాణి బుధః పంచశతానిచ,
లక్షమేకం తు దోషాణాం గురుః కేంద్రే వ్యపోహతి. 227

టీ. కేంద్రే=కేంద్రమునందుండిన, శుక్రః=శుక్రుఁడు, పంచసహస్రాణి=ఐదు వేలదోషములను, బుధః=కేంద్రమందున్న బుధుఁడు, పంచశతానిచ=ఐదునూర్ల దోషంబులను, కేంద్రేగురుః=కేంద్రస్థుఁడైన బృహస్పతి, దోషాణాం = దోషముల యొక్క, ఏకంలక్షం=ఒకలక్షను, వ్యపోహతి = నశింపఁజేయుచున్నాఁడు.

యేలగ్నదోషాఃకునవాంశదోషాఃపాపగ్రహైర్దృష్టినిపాతదోషాః,
లగ్నే గురుస్తా న్విమలీకరోతి బీజం యథాంభః కతకద్రుమస్య.

టీ. లగ్నేగురుః=వివాహలగ్నస్థితుండైనగురుఁడు, లగ్నదోషాః=లగ్నదోషములును, కునవాంశదోషాః=కునవాంశదోషములును, పాపగ్రహైర్దృష్టినిపాతదోషాః= పాపగ్రహములు లగ్నమునుజూచినందువలనఁ గలిగినదోషములును, యే=ఏవో, తాన్ =ఆదోషంబులన్నిటిని, కతకద్రుమస్య=చిల్లచెట్టుయొక్క, బీజం=విత్తనము,అంభో యథా=ఉదకమునువలె, విమలీకరోతి=పరిశుద్ధములనుగాఁ జేయుచున్నాఁడు.

గురు స్సుదీప్త స్తనుకేంద్రసంస్థిత
స్స్వవర్గసంస్థో భృగుజో బుధో వా,
బలాధికో లగ్నగతో విశేషతో
నిహంతి దోషా న్సకలాం స్తథావిధాన్. 229

టీ. గురుః = బృహస్పతి, సుదీప్తః=అస్తమునొందక మిక్కిలి ప్రకాశించు వాఁడై, తనుకేంద్రసంస్థితః = లగ్నకేంద్రమునం దుండినవాఁడై, స్వవర్గసంస్థః = స్వకీయశుభషడ్వర్గమునందున్న వాఁడైనను, భృగుజః = శుక్రుఁడైనను, బుధో వా = సౌమ్యుఁడైనను, బలాధికః = షడ్బలయుక్తుఁడై, లగ్నగతః = లగ్నంబును బొంది యుండినట్లయితే తథావిధాన్ = పూర్వోక్తంబులైన, సకలాన్దోషాన్ = సమస్త దోషంబులను, విశేషతః = అతిశయంబుగా, నిహంతి=కొట్టుచున్నాఁడు.

కావ్యో గురు ర్వా సౌమ్యో వా యదా కేంద్రత్రికోణగః,
నశ్యంతి సకలా దోషాః పాపానీవ హరిస్మృతేః. 230

టీ. కావ్యః=శుక్రుఁడైనను, గురుర్వా=జీవుండైనను, సౌమ్యోవా=బుధుండైనను, యదా=ఏముహూర్తమునందు, కేంద్రత్రికోణగః = కేంద్రత్రికోణములనుఁ బొందుచున్నారో, తస్మిన్=ఆముహూర్తమునందలి, సకలాదోషాః= సమస్తదోషంబులు,హరిస్మృతేః = విష్ణుస్మరణమువల్ల, పాపానీవ = దురితంబులువలె, నశ్యంతి = నశించుచున్నవి.

ముహూర్తలగ్నషడ్వర్గకునవాంశగ్రహోద్భవాః,
యేదోషా స్తాన్నిహంత్యేవ యత్రైకాదశగ శ్శశీ. 231

టీ. ఏకాదశగః = పదునొకండవయింటనుండిన, శశీ=చంద్రుఁడు, యత్ర = ఏలగ్నమునందలి, ముహూర్తలగ్నషడ్వర్గకునవాంశగ్రహోద్భవాః = ముహూర్త

లగ్నషడ్వర్గశుభనవాంశగ్రహములవల్ల నుత్పన్నంబులైన, దోషాః=దోషములు, యే = ఏవో, తాఀఆదోషంబుల నన్నిఁటిని, నిహంత్యేవ = కొట్టివేయుచున్నాఁడు.

యత్రైకాదశగ స్సూర్యో దోషా నాశం యయు స్తదా,
స్మరణాదివ రుద్రస్య పాపం జన్మశతోద్భవమ్. 232

టీ. యత్ర=ఏలగ్నమునందు, సూర్యః=సూర్యుఁడు; ఏకాదశగః=పదునొకొండవ యింటనున్నాఁడో,తదా (తత్ర)=అప్పుడాలగ్నమందలి, దోషాః=దోషములు, రుద్రస్యస్మరణాత్ =శివస్మరణమువల్ల,జన్మశతోద్భవం=అనేకజన్మములవలననుద్భవించిన, పాపమివ=దురితంబువలె, నాశం=నాశనమును, యయుః=పొందుచున్నవి.

బుధోఽపి మిత్రక్షగత స్తదంశసంస్థోఽపివా తేన నిరీక్షితో వా,
చేల్లగ్నగోదోషచయంనిహంతి రామోయథా రావణదైత్యబృన్దమ్.

టీ. బుధోపి=బుధుఁడును, మిత్రక్షగతః=మిత్రక్షేత్రములను బొందినవాఁడైనను, తదంశసంస్థోపివా = ఆమిత్రరాశ్యంశములయందున్నవాఁడైనను, తేన నిరీక్షితోవా = ఆమిత్రునిచేఁజూడబడినవాఁడైనను, లగ్నగశ్చేత్ = లగ్నముననుండిన యెడల, దోషచయం=దోషరాశిని,రామః=శ్రీరాముఁడు, రావణదైత్యబృందంయథా =రావణాసురుని నితరరాక్షస సమూహమునువలెనే, నిహంతి=కొట్టుచున్నాఁడు.

లగ్నస్థో భార్గవో జీవో యదివా చంద్రనందనః,
నాశయత్యఖిలాన్దోషాఀ తూలసంఘ మివానలః. 234

టీ. భార్గవః=శుక్రుఁడైనను, జీవః = గురుండైనను, చంద్రనందనోవా = బుధుండైనను, లగ్నస్థోయది=లగ్నమునందుండినట్లాయెనా, అఖిలాఀ=సమస్తములైన, దోషాఀ=దోషంబులను, అనలః=అగ్ని, తూలసంఘమివ=దూదిరాశినిగాల్చులెఱంగున, నాశయతి = నశింపజేయుచున్నాఁడు.

కాణాంధబధిరోద్భూతా దగ్ధలగ్నాదికోద్భవాః,
తే దోషా నాశ మాయాంతి కేంద్రసంస్థా శ్శుభగ్రహాః. 235

టీ. కాణాంధబధిరోద్భూతాః = కుంటిగ్రుడ్డిచెవిటిరాసులవల్ల నుత్పన్నంబులైనట్టియు, దగ్ధలగ్నాదికోద్భవాః = దగ్ధలగ్నము మొదలైనవానివలన నుద్భవించినట్టియు, దోషాః = దోషంబులు, యే=ఏవో, తే=ఆదోషంబులు. శుభగ్రహాః = గుర్వాదిశుభగ్రహంబులు, కేంద్రసంస్థాః = కేంద్రములయందుండగా, నాశమ్ = నాశనమును, ఆయాంతి = పొందుచున్నవి.

ఉచ్చగ శ్శుభ ఏకోఽపి లగ్నగో దోషసంచయమ్,
హంతి పాపాఀ హరితిథౌ చోపవాసవ్రతం యథా. 236

టీ. శుభః=శుభగ్రహము, ఏకోపి=ఒకటియైనను, ఉచ్చగః=ఉచ్చనుబొందినదైనను, లగ్నగః=లగ్నమును బొందినదైనను, దోషసంచయమ్ = దోషపుంజమును, హరితిథౌచ=ఏకాదశియందు, ఉపవాసవ్రతమ్=ఉపవాసవ్రతము, పాపంయథా=కిల్బిషమునువలెనే, హంతి = కొట్టుకొనుచున్నది.

ఏకోఽపి మిత్రరాశిస్థ శ్శుభోయది విలగ్నగః,
హంతి దోషాన్మహాదోషాన్ శివరాత్రివ్రతంయథా. 237

టీ. శుభః=శుభగ్రహము, ఏకోపి=ఒకటియైనను, మిత్రరాశిస్థః=మిత్రరాశియందును, విలగ్నగః=లగ్నగతమును, స్యాద్యది=అయ్యేనేని, శివరాత్రివ్రతం = మహాశివరాత్రివ్రతము, మహాదోషాన్యథా = మహాపాతకాదిదోషంబులవలె, దోషాన్ = దోషంబుల, హంతి = నశింపజేయుచున్నది.

విపది ప్రత్యగేచైవ చరమం చాద్యకం వినా,
స్వోచ్చస్వర్క్షగత శ్చంద్ర శ్శుభదస్సర్వకర్మసు. 238

టీ. చరమం=పరమమైత్రతారను, ఆద్యకంచ=జన్మతారను, వినా=విడిచిపెట్టి, విపది = విపత్తారయందును, ప్రత్యగేచైవ = ప్రత్యక్తారయందును, స్వోచ్చర్క్షగతః=స్వోచ్చస్వక్షేత్ర స్వనక్షత్రములయందుండిన, చంద్రః=చంద్రుఁడు, సర్వకర్మసు = సమస్తశుభకర్మములయందును, శుభదః=శుభదాయకుండని యెఱుంగవలయును.

జన్మర్క్ష లగ్న యో ర్వాపి చంద్ర శ్శ స్త శ్శుభేక్షితః,
కేంద్రే శుభే స్వవర్గేవా లగ్నా దుపచయేఽపి వా. 239

టీ. జన్మర్క్షలగ్నయోర్వాపి=జన్మతారాలగ్నములయం దుండినను, చంద్రః = చంద్రుఁడు, శుభేక్షితః=శుభగ్రహవీక్షితుండై, కేంద్రే=కేంద్రమునందైనను, శుభే=శుభకరంబైన, స్వవర్గేవా = స్వోచ్చమిత్రమూలత్రికోణములయందైనను, లగ్నాదుపచయేపివా=లగ్నముకంటె నుపచయస్థానములగు తృతీయ షష్ఠదశమైకాదశస్థానములయందైనను, స్థితశ్చేత్ =ఉన్నవాఁడేని. శస్తః=శుభప్రదుండగుచున్నాఁడు.

జీవే సితే కంటకస్థే పాపేవా త్రిషడాయగే,
వారర్క్ష తిథియోగానాం దోష మాశు వ్యపోహతి. 240

టీ. జీవే=గురుండైనను, సితే=శుక్రుండైనను. కంటకస్థేసతి=కేంద్రములయందుండఁగాను, పాపే=పాపగ్రహము, త్రిషడాయగేసతి=తృతీయషష్ఠలాభస్థానములను బొందియుండఁగాను, వారర్క్షతిథియోగానాం = వారనక్షత్రతిథియోగముల యొక్క, దోషం=దోషమును, ఆశు=శీఘ్రముగా, వ్యపోహతి=నశింపఁజేతురు.

ఏవం గుణాగుణాన్వీక్ష్య లగ్నం నిశ్చిత్య యత్నతః,
సిద్ధాంతోక్తేన మార్గేణ లగ్నకాలం సమానయేత్. 241

టీ. ఏవం=ఈప్రకారముగా, గుణాగుణాన్ = గుణదోషములను, వీక్ష్య = తెస్సగా విమర్శించి, యత్నతః = ప్రయత్నమువల్ల, లగ్నం = ముహూర్తమును, నిశ్చిత్య=నిశ్చయించి, సిద్ధాంతోక్తేనమార్గేణ=సిద్ధాంతమునందుఁజెప్పఁబడినమార్గము చేత, లగ్నకాలం=లగ్నసమయమును, సమానయేత్=పొందింపవలయును. అనఁగా సిద్ధాంతోక్తప్రకారముగా ముహూర్తనిశ్చయము సేయవలయును.

వైధవ్యం తరణి స్తనోతి హిమగు స్తామేవ హంత్యాదరా
ద్భౌమో దంపతిహా శశాంకతనయ స్సౌభాగ్య మాయచ్ఛతి,
అయుర్దా గురుభార్గవౌ మృదుగతి ర్దారిద్ర్యద స్సర్వదా
రాహు శ్చా ప్యనపత్యకృ న్నిజగుణై ర్లగ్నే వివాహేఽష్టభిః.

టీ. వివాహేలగ్నే=వివాహముహూర్తమునందుండిరేని, అష్టభిః = ఎనిమిది యైన, నిజగుణైః=తమతమయందుండునైజగుణవిశేషముల చేత, తరణిః=సూర్యుఁడు, వైధవ్యం = విధవత్వమును, తనోతి = విస్తరింపఁజేయుచున్నాఁడు. హిమగుః = చంద్రుఁడు, తామేవ = ఆకన్యకనే, ఆదరాత్=పట్టుదలతో, హంతి = చంపు చున్నాఁడు, భౌమః = అంగారకుఁడు దంపతిహా = వధూవరులనిద్దఱినుహరింపు చున్నాఁడు. శశాంకతనయః=బుధుఁడు, సౌభాగ్యం=ఐశ్వర్యమును, ఆయచ్ఛతి = ఇచ్చుచున్నాఁడు. గురుభార్గవౌ=గురుశుక్రులు, ఆయుర్దా = ఆయుర్దాయము నిచ్చు వారలు, మృదుగతిః=శనైశ్చరుఁడు, దారిద్ర్యదః=పేదరికమునిచ్చువాఁడు, సర్వదా ఎల్లప్పుడును, రాహుశ్చాపి = రాహువును, అనపత్యకృత్ = సంతానాభావమును జేయువాఁడు, భవతి =అగుచున్నాఁడు.

వివాహలగ్నమునకు సుగుణములు.

ధన త్రి బంధు తనయ ధర్మాఽఽజ్ఞాఽఽయేషు చంద్రమాః,
కరోతి సుతసౌభాగ్యభోగయుక్తా న్వివాహితాన్. 243

టీ. ధనత్రిబంధుతనయధర్మాజ్ఞాయేషు=వివాహలగ్నంబులకు ద్వితీయ తృతీయ చతుర్థ పంచమ నవమదశమైకాదశస్థానంబులయందుండెడి, చంద్రమాః=చంద్రుఁడు, వివాహితాన్=వివాహముసేయఁబడిన వధూవరులను, సుతసౌభాగ్యభోగయుక్తాన్= పుత్రసంతాన సౌభాగ్యభోగయుతులనుగా, కరోతి = చేయుచున్నాఁడు.

పాతాళాంబరపంచమే ద్వినవమే లగ్నేచ సౌమ్యగ్రహాః
క్రూరా షష్ఠ్చ గతా శ్శశీ ధనగత స్సర్వే త్రిరేకాదశమ్,
జామిత్రం గ్రహవర్జితం న చ భృగో షష్ఠ్యం కుజస్యాష్టమం
దంపత్యో ర్జనితోడు లగ్నసమయం లగ్నాష్టమద్వాదశమ్. 244

టీ. వివాహే=వివాహముహూర్తమునందు, సౌమ్యగ్రహాః = సౌమ్యగ్రహంబులైన గురుశుక్రబుధులు. పాతాళాంబరపంచమే = నాలుగు పది ఐదుస్థానముల యందును, ద్వినవమే=రెండుతొమ్మిదియింట్లయందును, లగ్నేచ=వివాహముహూర్తము నందునుండవలసినది. శశీ= చంద్రుడు, ధనగతః = రెండవయింట నుండవలసినది, సర్వే = ఎల్లరు, క్రూరాః =రవ్యంగారకరాహుకేతువులు, త్రిరేకాదశం = మూడు పదునొకండుస్థానములను, షట్చ=ఆఱవస్థానమును, గతాః=పొందియుండవలయును, జామిత్రమ్ = ఏడవయిల్లు, గ్రహవర్జితం=శుభపాపగ్రహరహితంబుగా నుండునది, భృగోష్షట్కం = ఆఱింటశుక్రుడుండుటయును, కుజస్యాష్టమమ్ = ఎనిమిదింట నంగారకుడుండుటయు, దంపత్యోః=వధూవరులయొక్క, జనితోడులగ్నసమయం =జననకాల లగ్ననక్షత్రరాసులును, లగ్నాష్టమద్వాదశం = వధూవరలగ్నంబుల కష్టమద్వాదశంబులైనరాసులు, నచ=ఈద్వాహశ్రీయులయుం దొప్పిదంబులుగావని యెఱుంగవలయును.

కేంద్రత్రికోణభవనే యదిశోభనైక స్స్వోచ్చస్వవర్గసహితో బల
వాన్ప్రవిష్టః, పాపై స్తథావిధగుణైః స్త్రిషడాయగైశ్చ యోగో వి
వాహ సమయే బహుపుత్రదాతా.

టీ. శోభనైకః=శుభగ్రహంబొకండు, స్వోచ్చస్వవర్గసహితః=స్వోచ్చమూల త్రికోణస్వకీయ షడ్వర్గయుక్తంబై, బలవాన్=స్థానాదిషడ్బలయుతంబై కేంద్రత్రికోణభవనే-కేంద్ర=కేంద్రములయందైనను, త్రికోణభవనే= త్రికోణస్థానముల యందైనను, ప్రవిష్టో యది= ప్రవేశించియుండెనేని, పాపైః = పాపగ్రహములు, తథావిధగుణైః=అట్టిస్వోచ్చస్వవర్గసహితత్వాదిగుణసంపన్నులై, త్రిషడాయగైస్స దిభిశ్చ = తృతీయ షష్ఠలాభస్థానములను బొందియుండఁగాను, వివాహసమయే = వివాహముహూర్తసమయమునందు, బహుపుత్రదాతా=దీర్ఘాయుష్మంతులైన అనేక పుత్రులనిచ్చెడు, యోగః= శుభయోగము వధూవరులకుఁ గలుగుచుండునని తెలియ వలయును.

లాభస్థే సూర్యపుత్రేచ షష్ఠే సూర్యేచ తిష్ఠతి,
విలగ్నేతు స్థితే జీవే తృతీయే ధరణీసుతే. 46
చంద్రేచ దశమస్థేతు శుక్రే రంధ్రే చ సంస్థితే,
ఏక స్తు స్యాత్సమాయోగో దంపత్యోః పుత్రపౌత్రదః. 47

టీ. సూర్యపుత్రే=శనైశ్చరుడు, లాభస్థే = పదునొకండవయింటనుండఁగా, సూర్యేచ=సూర్యుడు, షష్ఠే = ఆఱవస్థానమందు. తిష్ఠతిసతి=ఉండఁగా, జీవే = బృహస్పతి, విలగ్నే=వివాహలగ్నమునందు, స్థితేసతి=వర్తించుచుండఁగాను, ధరణీసుతే =అంగారకుడు, తృతీయే = మూడింటనొప్పుచుండఁగాను, చంద్రేచ = చంద్రుడును, దశమస్థేతు = దశమస్థానమునందు కొనరియుండఁగాను, శుక్రే =

భార్గవుఁడు, రంధ్రేచ=తొమ్మిదింట, సంస్థితే = ప్రవర్తించుచుండఁగా, వీకః = ముఖ్యమయిన, సమాయోగః = శుభయోగము, దంపత్యోః = దంపతులకు, పుత్రపౌత్రప్రదంబైనది, స్యాత్ = అగును.

లగ్నే గురుః కుజో లాభే దశమే భాస్కరో భవేత్,
ఉమాశంకర మిత్యాహు ర్దంపత్యోశ్చ సుఖావహమ్. 248

టీ. లగ్నే=వివాహలగ్నమునందు, గురుః=బృహస్పతియు, లాభే=పదునొకొండవయింట, కుజః = భౌముండును, దశమే = పదియవస్థానమునందు, భాస్కరః = సూర్యుండును, భవేచ్చేత్=అయెనేని, అనఁగా, నాయాస్థానంబులనీగ్రహంబులుండినేని, ఉమాశంకరమితి = పార్వతీపరమేశ్వరయోగంబనియు, నట్టియోగంబును, దంపత్యోః=వధూవరులకు, సుఖావహం=సుఖసంపాదకం బగుదానినిగా, అహుః= పెద్దలు చెప్పుచున్నారు.

కుజార్కశుక్రజీవా స్స్యుర్య రాపోక్లిబగతా యది,
రామవిష్ణు రితి ఖ్యాతో ర్దంపత్యోశ్చ సుఖావహః.

టీ. కుజార్కశుక్రజీవాః=కుజరవిశుక్రగురులు, ఆపోక్లిబగతాః=లగ్నంబునకు తృతీయషష్ఠద్వాదశస్థానంబులనుండువారు, స్యుర్యది = ఐరేని, రమావిష్ణురితి=లక్ష్మీనారాయణం బనుయోగంబు, ఖ్యాతః = ప్రసిద్ధంబై, దంపత్యోశ్చ=జాయాపతులుభయులకును, సుఖావహః=సుఖకరంబైనదియై యొసరుచుండును.

## రాహుకేతుదోషము.

లగ్నాస్తసంస్థౌ యది రాహుకేతూ నదోషదౌ వేతివదంతి కేచిత్,
త్రిస్కంధశాస్త్రాగమవేదినస్తు లగ్నాస్తగౌ తౌ చ హివర్జయంతి.

టీ. రాహుకేతూ=ఛాయాగ్రహంబులైన రాహుకేతువులు, లగ్నాస్తసంస్థౌ యది=వివాహలగ్నజామిత్రస్థానంబులనుండినను, నదోషదౌవేతి = దోషముసేయువారుగారని. కేచిత్=కొందఱుమునులు, వదంతి = పలుకుచున్నారు. త్రిస్కంధశాస్త్రాగమవేదినస్తు = త్రిస్కంధశాస్త్రాగమవేత్తలైతే, లగ్నాస్తగౌ=లగ్నసప్తమస్థానంబులబొందిన, తౌచ = ఆరాహుకేతువులును, వర్జయంతిహి = పరిత్యజించుచున్నారు. అనఁగావివాహముహూర్తవిషయమయి లగ్నాస్తగతరాహుకేతుదోషంబులు గొందఱిచేతనవలంబింపఁబడినవనియుఁ గొందఱిచేత నంగీకరింపఁబడలేదనియు తెలియంగవలయును.

## లగ్నాస్తగతరాహుకేతుదోషభంగము.

వివాహేషుచ దేవానాం ప్రతిష్ఠాసూపనాయనే,
ఛాయాగ్రహౌతు విజ్ఞేయౌ రాహుకేతూ న దోషదౌ. 251

టీ. వివాహేషుచ=వివాహకార్యములయందును, దేవానాం ప్రతిష్ఠాసుచ=దేవ

శౌప్రతిష్ఠలయందును, ఉపనాయనే=ఉపనయనవ్రతమునందును, ఛాయాగ్రహౌ=ఛాయాగ్రహంబులైన, రాహుకేతూ=లగ్నాస్తగతులైన రాహుకేతువులు, సదోషదౌ = దోషప్రదులుగారని, విజ్ఞేయౌ = తెలియఁదగినవారు.

చంద్రునిబాలత్వవృద్ధత్వాస్తమయములు.

వృద్ధత్వ మిందోః స్త్రిదినం దినార్ధం బాలత్వ మస్తత్వ మహర్ద్వయంచ, అస్తే విధౌ మృత్యు ముపైతి కన్యా బాలేఽన్నసక్తా విధవా చ వృద్ధే. 252

టీ. ఇందోః=చంద్రునికి, వృద్ధత్వం=ముసలితనము, త్రిదినం=మూఁడుదినములు, బాలత్వం=బాల్యము, దినార్ధం=అరదినము, అస్తత్వం = అస్తంగతత్వము అహర్ద్వయంచ=రెండుదినములు క్రమముగా నగుచున్నది. విధౌ=చంద్రుఁడు, అస్తేసతి=అస్తంగతుఁడగుచుండఁగా, కన్యా=కన్యక, మృత్యుం=మృతిని. ఉపైతి = పొందుచున్నది, బాలే=బాలుఁడగుచుండఁగా, అన్నసక్తా = అన్నవంతురాలగును. వృద్ధే=వృద్ధుఁడగునేని, విధవా=భర్తృహీనురాలగుచుండునని తెలియవలయు.

భవత్యమృతరశ్మిత్వా ద్బాలోఽపి శుభద శ్శశీ,
శశీ శిశు ర్ద్వితీయాయాం శుభం కార్యం సదా బుధైః. 253

టీ. శశీ=చంద్రుఁడు. బాలోపి=బాలుండేనియు, అమృతరశ్మిత్వాత్=సుధాకరుఁడగుటవలన, శుభదః=శుభం బొసరించువాఁడు, భవతి=అగుచున్నాఁడు. శశీ=చంద్రుఁడు, శిశురపి=చిన్నవాఁడైనను, ద్వితీయాయాం=విదియయందు. బుధైః = పెద్దలచేత, శుభమ్=శుభకార్యము, సదా=ఎప్పుడును, కార్యం = చేయఁదగినది.

గ్రహణదోషము.

గ్రస్తేస్తే త్రిదినం పూర్వం పశ్చా ద్గ్రస్తోదయే తథా,
సంధ్యాకాలే త్రిత్రిదినం నిశ్శేషే సప్తసప్తచ. 254

టీ. గ్రస్తేస్తే=గ్రస్తాస్తమయగ్రహణంబైనప్పుడు, పూర్వం=గ్రహణాత్పూర్వమునందు, త్రిదినం=మూఁడుదినములును, గ్రస్తోదయే = గ్రస్తోదయగ్రహణంబగునప్పుడు, పశ్చాత్ = గ్రహణానంతరమునందు, తథా=అప్రకారము మూఁడుదినములును, సంధ్యాకాలే=సంధ్యాకాలగ్రహణమునందు, త్రిత్రిదినం = పూర్వమందును, బరమందును మూఁడేసిదినములు, నిశ్శేషే=సర్వగ్రాసగ్రహణమునందు, సప్తసప్తచ=పూర్వపరములయందు నేడేసిదినములును, పరిత్యజేత్ =పరిత్యజింపవలయును.

ఉత్పాతగ్రహణా దూర్ధ్వం సప్తాహ మఖిలగ్రహే,
నాఖిలే త్రిదినం నేష్టంనేష్టం తద్భ మృతుత్రయమ్

టీ. ఉత్పాతగ్రహణాత్=కంకణగ్రహణము మొదలైన యరిష్టగ్రహముల కంటె, ఊర్ధ్వం=పరమునందు, అఖిలగ్రహే=సర్వగ్రాసమునందు, సప్తాహం=ఏడు దినములును, నాఖిలే=అసంపూర్ణగ్రాసగ్రహణమునందు. త్రిదినం = మూఁడుదినములును, నేష్టం=సమ్మతములుగావు, తద్భం = ఆగ్రహణముపట్టిననక్షత్రము, ఋతుత్రయం=ఆఱుమాసములదనుక, నేష్టం=శుభకరంబుగాదని యెఱుంగవలయును.

పక్షగ్రహణమధ్యే తు వివాహం చోపనాయనమ్,
యది కుర్యాత్స మూఢాత్మా నష్టాయుః స్త్రీవియోగవాన్. 256

టీ. పక్షగ్రహణమధ్యేతు = పూర్ణిమామావాస్యల గ్రహణమధ్యంబునందు, వివాహం=వివాహమును, ఉపనాయనంచ=ఉపనయనమును, కుర్యాద్యది=ఎవ్వండైనను జేసెనేనియు, సః=వాఁడు, మూఢాత్మా = మూఢమనస్కుఁడు, నష్టాయుః = అల్పాయుష్మంతుఁడును, స్త్రీవియోగవాన్=జాయావియోగముగలవాఁడును, భవేత్=అగును.

## త్రిజ్యేష్ఠస్వరూపము.

జ్యేష్ఠాంగనాకరతలగ్రహణం న కుర్యాత్ జ్యేష్ఠర్క్షజస్య పురుషస్య చ
శుక్రమాసే, చేదర్థహానికలహప్రదమాశు తద్వై జ్యేష్ఠాంగనా
పురుషయోశ్చ పరస్పరం చ. 257

టీ. శుక్రమాసే = జ్యేష్ఠమాసమునందు, జ్యేష్ఠర్క్షజస్య=జ్యేష్ఠానక్షత్రమునందుద్భవించిన, పురుషస్యచ=పురుషునకును, జ్యేష్ఠాంగనాకరతలగ్రహణం=జ్యేష్ఠకన్యకాపాణిపీడనమును. నకుర్యాత్ = చేయఁగూడదు. చేత్=ఒకవేళను జేసినట్లైతే (నట్టివివాహము), ఆశు=శీఘ్రముగా, అర్థహానికలహప్రదం = ద్రవ్యనాశనకలహములంజేయునది. తద్వత్ = అట్లేయగుననే, జ్యేష్ఠాంగనాపురుషయోశ్చ = జ్యేష్ఠకన్యకాజ్యేష్ఠపురుషుల కుభయులకును, పరస్పరం = అన్యోన్యమును వివాహమును సేయ నర్హంబుగాదు.

ఆద్యగర్భే ద్వయోర్యత్ర జ్యేష్ఠానక్షత్రజాతయోః,
జ్యేష్ఠమాసే న కుర్వీత జ్యేష్ఠపంచకమీరితమ్. 258

టీ. యత్ర = ఎచ్చటను, ఆద్యగర్భే=ప్రథమగర్భమునందుఁబుట్టిన, జ్యేష్ఠానక్షత్రజాతయోః = జ్యేష్ఠానక్షత్రజనితులైన, ద్వయోః=ఇద్దరైన స్త్రీపురుషులకు, జ్యేష్ఠమాసే = జ్యేష్ఠమాసమునందు, వివాహం = వివాహమును; నకుర్వీత=చేయఁగూడదు. ఆ ప్రకారము చెప్పినది. జ్యేష్ఠపంచకం = జ్యేష్ఠపంచకంబని, ఈరితం = చెప్పఁబడినదియై నిషిద్ధంబగుచున్నది.

నకుర్వీత ప్రయత్నేన తథా జ్యేష్ఠచతుష్టయమ్,
ద్విజ్యేష్ఠం మధ్యమం ప్రోక్తం జ్యేష్ఠ ఏక శ్శుభావహః. 259

టీ. తథా =పూర్వోక్తప్రకారము, జ్యేష్ఠచతుష్టయం=జ్యేష్ఠచతుష్టయమును, ప్రయత్నేన = ప్రయత్నముచేత, నకుర్వీత = చేయఁగూడదు, ద్విజ్యేష్ఠం=జ్యేష్ఠద్వయము, మధ్యమం = మధ్యమంబని, ప్రోక్తం = చెప్పంబడినది. ఏకః=ఒకటియైన, జ్యేష్ఠః=జ్యేష్ఠము, శుభావహః = మంగళకరంబు.

ఆద్యగర్భప్రసూతాయాః కన్యకాయా వరస్యచ,
జ్యేష్ఠమాసే న కుర్వీత కదాచి దపి మంగళమ్. 260

టీ. ఆద్యగర్భప్రసూతాయాః = తొలిచూలునజనించిన, కన్యకాయాః = కన్యకకు,వరస్యచ=వరునకును,జ్యేష్ఠమాసే=జ్యేష్ఠమాసమునందు,కదాచిదపి=ఒకప్పుడును, మంగళం = పాణిగ్రహణమును, నకుర్వీత = చేయఁగూడదు.

ఆద్యగర్భద్వయో ర్యత్ర వివాహం కారయే ద్యది,
మాసాధిపతిమిత్రత్వవశా దత్ర శుభావహః. 261

టీ. యత్ర=ఎచ్చటను, ఆద్యగర్భద్వయోః=ప్రథమగర్భజనితులైన స్త్రీపురుషులకు, మాసాధిపతిమిత్రత్వవశాత్ = మాసాధిపతులయొక్క మిత్రత్వానుసారముగా, వివాహం=ఉద్వాహమును, కారయేద్యది=చేసినటులైన, అత్ర=యీస్థలమునందు, వివాహః = పాణిగ్రహణము, శుభావహః = మంగళకరంబగునది. (అనఁగా జ్యేష్ఠగర్భమునందుదయించినవారలైనప్పటికిని స్త్రీపురుషులకు మాసాధిపతిమిత్రత్వము గలిగియుండెనేని వివాహము శుభప్రదం బగుననుట).

ఏకోదరవివాహము

వివాహశ్చైకజన్యానాం షణ్మాసాభ్యంతరే యది,
అసంశయం త్రిభి ర్వర్షై స్తత్రైకా విధవా భవేత్. 262

టీ. ఏకజన్యానాం=ఏకగర్భజనితులగువారలకు, షణ్మాసాభ్యంతరే=ఒకతెప వివాహంబైన యాఱుమాసములకులోగా, వివాహోయది=రెండవదానికి వివాహం బయ్యెనేని, తత్ర=అయిద్దఱిలో, ఏకా=ఒకతె, త్రిభిర్వర్షైః=మూఁడు సంవత్సరముల చేత, అసంశయం=నిస్సందేహంబుగా, విధవా = విధవ, భవేత్ =అగును. (అనఁగా సేకోదరులకు నాఱుమాసములకులోగా వివాహము సేయఁగూడదు. చేసిరేనియు, మూఁడు సంవత్సరముల కొచిన్నది విధవ యగుననుట.

కదాచి దేకజన్యానాం న వివాహ మృతుత్రయే,
యత్ర వర్షేణ తత్రైకా విధవైవ న సంశయః. 263

టీ. యత్ర=ఎచ్చటను, ఏకజన్యానాం=ఏకగర్భజనితులైనవారికి, ఋతుత్రయే=ఆఱుమాసములలోఁగా, కదాచిత్=ఒకానొకప్పుడును, వివాహం=కరగ్రహణమును, నకుర్యాత్=చేయఁగూడదు. చేత్=ఒకవేళఁ చేసినట్లులైన, తత్ర=ఆయిద్దఱిలో, ఏకా-ఒకతెయైనకన్యక, వర్షేణ=సంవత్సరములో,విధవైవ = భర్తృవిహీనురాలే యగును. నసంశయః=ఈయర్థంబునందు సందియంబు లేదు.

పుత్రీవివాహా త్పరత స్తథైవ శుభప్రదం పుత్రవివాహకర్మ,
పుత్రీద్వయంనైవ మృతుత్రయేఽపిపుత్రద్వయంవాపికదాచిదేవ.

టీ. పుత్రీవివాహాత్పరతః=కొమార్తవివాహంబైనపిమ్మట, తథైవ=అప్పుడే, పుత్రవివాహకర్మ=కుమారుని వివాహకార్యము, శుభప్రదం=మంగళకరంబైనది. పుత్రీద్వయం=కొమార్తెల నిద్దఱినిఁగూర్చియైన, పుత్రద్వయంవాపి = కుమారుల నిద్దఱిని గూర్చియైనను, ఋతుత్రయేపి=ఆఱుమాసములలోఁగా, కదాచిదేవ = ఒకానొకప్పుడును, వివాహకర్మ = వివాహకృత్యము,నైవ=చేయనర్హంబుగాదు.

మహానదీపర్వత మంతరావా కృత్వా వివాహం సహజస్య తస్య,
తస్యానుజస్యాపితథైవకార్యం మౌంజీనిబంధాఖ్యమిదంహిశస్తమ్.

టీ. మహానదీపర్వతమంతరావా=గంగాదిమహానదీ వ్యవధానమంబైనను పర్వతవ్యవధానమంబైనను, తస్యసహజస్య=జ్యేష్ఠుంబైనసోదరునకు, వివాహం=పాణిపీడనమును, కృత్వా = చేసి, తస్యానుజస్యాపి=వానితమ్మునికిని, తథైవ = అప్రకారమే, మౌంజీనిబంధాఖ్యం = ఉపనయనకర్మము, కార్యం=చేయుదగినది. ఇదం=ఈప్రకారముగా నుపనయనంబుసేయుట, శస్తంహి = లోకప్రసిద్ధంబనుట.

శుభకృత్పుత్రికోద్వాహా త్పశ్చాత్పుత్రకరగ్రహః,
ఏకతిథ్యామపి ప్రాహ భార్గవో భిన్నవేళయా. 267

టీ. పుత్రికోద్వాహాత్=కొమార్తవివాహముకంటె, పశ్చాత్=అనంతరమునందు, పుత్రకరగ్రహః=కుమారుని పాణిగ్రహణము, ఏకతిథ్యాంపి=ఒక్కదినమునందును. భిన్నవేళయా=కాలభేదముచేత, శుభకృత్=శుభముసేయునని, భార్గవః=భార్గవమహాముని ప్రాహ = పలికెను.

పృథ జ్మంటపయోః కేచి న్నార్యో రేకోదరస్థయోః,
ఇచ్ఛంతి భిన్నవేళాయాం తయోరుద్వాహమంగళమ్. 268

టీ. పృథఙ్మంటపయోః=పృథక్=ప్రత్యేకముగానిర్మింపఁబడిన, మంటపయోః వివాహమంటపములయందు, భిన్నవేళాయాం = భిన్నముహూర్తంబున, ఏకోదరస్థయోః = సమానోదరులైన, తయోః నార్యోః = ఆస్త్రీలకిద్దఱికిని, ఉద్వాహమంగళం=వివాహశుభకార్యమును. కేచిత్=కొందఱు, ఇచ్ఛంతి=కోరుచున్నారు,

(అనఁగా నొకతల్లి కడుపునఁబుట్టిన స్త్రీలకు నిద్దఱికి నేకదినమునందు భిన్న ముహూర్తంబున వివాహంబు సేయవచ్చుననియభిప్రాయము.)

ఏకలగ్నేఽపి భిన్నాంశే వసిష్ఠాత్రిపరాశరాః,
తయో ర్వివాహ మిచ్ఛన్తి పృథగ్గ్రామేఽథ మంటపే. 268

టీ. అథ=తర్వాత, వసిష్ఠాత్రిపరాశరాః=వసిష్ఠాత్రిపరాశరమహామునులు, పృథగ్గ్రామే=భిన్నగ్రామమునందు, మంటపే=భిన్నమంటపమునందు, ఏకలగ్నేపి = ఒక ముహూర్తముననైనను, భిన్నాంశే=అంశభేదంబుకలిగినేని, తయోః=ఆయేకోదర కన్యకలకు, వివాహం = ఉద్వాహమును, ఇచ్ఛన్తి-అంగీకరించుచున్నారు.

ఫాల్గునే చైత్రమాసేచ పుత్రోద్వాహోపనాయనే,
భేదా దబ్దస్య కుర్వీత న ఋతుత్రయవిళంబనమ్. 269

టీ. అబ్దస్య భేదాత్ = సంవత్సరభేదమువలన, ఫాల్గునే = ఫాల్గునమాసమునందును, చైత్రమాసేచ = చైత్రమాసమునందును, పుత్రోద్వాహోపనాయనే = పుత్రులకు వివాహోపనయనములను, కుర్వీత=చేయవలయు. నఋతుత్రయవిళంబనం = ఆసంవత్సరభేదముచేత నేకగర్భజనితులకుఁజేయు వివాహోపనయనములవిషయమై యాఱుమాసములపర్యంతం బైనకాలవిళంబము గాఁదగిన నిమిత్తంబులేదనియెఱుంగవలయును.

కుమార్యోః సుతయోః పుత్రపుత్ర్యో రేకోదరస్థయోః,
వివాహోఽబ్దాంతరే శస్త స్తయో ర్నద్యంతరే యథా. 270

టీ. ఏకోదరస్థయోః = ఒకతల్లికడుపునజనించిన, కుమార్యోః = కుమార్తెలకును, సుతయోః=కుమారులకును, పుత్రపుత్ర్యోః=పుత్రికాపుత్రులకును, అబ్దాంతరే =భిన్న సంవత్సరంబునందు, నద్యంతరే యథా = మహానదీవ్యవధానంబునందువలె, వివాహః = ఉద్వాహము, శస్తః = ప్రసిద్ధంబయినది.

కల్పయే ద్వేదికాం రమ్యాం మండపం చ పృథక్పృథక్,
భిన్నోదరప్రసూతానా మేకతిథ్యాం కరగ్రహః. 271

టీ. (వివాహకర్తా = వివాహముసేయుఁబూనినవాఁడు,) రమ్యాం=సుందరంబగు, వేదికాం=పెండ్లియరుగును, మండపంచ = మండపమును, పృథక్పృథక్ = వేఱువేఱుగా, కల్పయేత్=నిర్మించవలసినది. అట్టి భిన్నవేదికామండపములయందు, తిథ్యాం = ఒకదినంబున, భిన్నోదరప్రసూతానాం =భిన్నగర్భజనితులైనవారలకు, అనఁగా సవతి కొమార్లకును సవతికొమార్తెలకును, కరగ్రహః=పాణిగ్రహణము ప్రసిద్ధంబని యెఱుంగవలయుననుట.

ముండనా న్మండనంచైవ మండనా న్నతు ముండనమ్,

టీ. ముండనాత్ = ఉపనయనాంతరంబున, మండనంచైవ వివాహముసేయ నర్హంబుగాని, మండనాత్ = వివాహంబయినపిమ్మట, ముండనం=ఉపనయనము, నతు = చేయ నుచితంబుగాదని తెలియవలయును.

## అభిజిద్గోధూళిలక్షణము.

మధ్యందినగతే భానౌ ముహూర్తోఽభిజిదాహ్వయః,
సర్వదోషా న్నిహంత్యాశు పినాకీ త్రిపురం యథా. 272

టీ. భానౌ=సూర్యుఁడు, మధ్యందినగతే సతి = మధ్యాహ్నమును బొందుచుండఁగా, ముహూర్తః = ఆమధ్యాహ్నకాలికంబయిన ముహూర్తంబు, అభిజిదాహ్వయః=అభిజిత్తనెడు పేరుగలది, సః=ఆయభిజిన్ముహూర్తము, సర్వదోషాన్=సమస్తదోషంబులను, ఆశు=శీఘ్రముగా, పినాకీ=శివుఁడు, త్రిపురం యథా=త్రిపురములనువలె, నిహంతి = సంహరించుచున్నది.

సూర్యా చ్చతుర్థం యల్లగ్న మభిజిత్సంజ్ఞకం చ తత్,
సర్వదేశే ష్విదం ముఖ్యం సర్వవర్ణేషు సర్వదా. 273

టీ. సూర్యాత్ = సూర్యుఁడుండినరాశికంటె చతుర్థం = నాలవదియగు, లగ్నం = లగ్నము, యత్ =ఏదో, తత్ = ఆలగ్నము, అభిజిత్సంజ్ఞకం = అభిజిత్తనునామముగలది. ఇదం = ఈయభిజిల్లగ్నము, సర్వదేశేషు = సకలదేశములయందును, సర్వవర్ణేషు=సకలవర్ణములయందును, సర్వదా = ఎల్లప్పుడును, ముఖ్యం= శుభకార్యములు సేయ నావశ్యకింబనుట.

అశేషదోషాపహం శుభప్రదం జగుర్మునీంద్రా అభిజిన్ముహూర్తమ్.
తథైవ గోధూళికనామధేయం వివాహయాత్రావ్యఖిలప్రవేశేషు.

టీ. మునీంద్రాః = మునిసత్తములు, అభిజన్ముహూర్తం = అభిజిల్లగ్నంబును, అశేషదోషాపహారం = విష్టివ్యతీపాతాదిదోషంబులనెల్ల నపహరించునదానిఁగా, శుభప్రదం = మంగళప్రదమునుగా, జగుః = పలికిరి. తథైవ=ఆప్రకారమే, గోధూళికనామధేయం = గోధూళికయనిపేరొందఁబడినలగ్నము, వివాహయాత్రాద్యఖిలప్రవేశేషు=వివాహము ప్రయాణము గృహప్రవేశము వాస్తుకర్మము మొదలైన శుభకర్మలయందు, ముఖ్యం = శ్రేష్ఠంబయినది.

అభిజి త్సర్వకార్యేషు శస్తం నాత్రోపనాయనమ్,
సూర్యాత్సప్తమలగ్నం యద్గోధూళికమితి స్మృతమ్. 275

టీ. అభిజిత్ = అభిజిల్లగ్నము, సర్వకార్యేషు=సమస్తశుభకార్యములయందు, శస్తం = ప్రసిద్ధంబుగాని, అత్ర=ఈయభిజిన్ముహూర్తంబునందు, ఉపనాయనం = ఉపనయనము, నశస్తం = ప్రశస్తంబయినదిగాదు. సూర్యాత్ = సూర్యుఁడున్నరాశికంటె, సప్తమలగ్నం = ఏడవలగ్నము, యత్ = ఏదో, తత్ =అది, గోధూళికమితి = గోధూళిక లగ్నంబని, స్మృతం = చెప్పఁబడినది.

పాశ్చాత్యానాం కళింగానాం ముఖ్యం గోధూళికం స్మృతమ్,
అభిజి త్సర్వదేశేషు ముఖ్యం దోషవినాశకృత్. 276

టీ. పాశ్చాత్యానాం = పశ్చిమదేశ్యులకును, కళింగానాం = కళింగదేశ్యులకును, గోధూళికం = గోధూళిలగ్నము, ముఖ్యం = ఆవశ్యకమని. స్మృతం = స్మరింపఁబడినది. అభిజిత్ = అభిజిన్ముహూర్తము, సర్వదేశేషు = సకలదేశములయందు, దోషవినాశకృత్ = సకలదోషహరంబై, ముఖ్యం = ఉత్తమమయినది.

## నూతనవధూప్రవేశము.

వాసిష్ఠమందు :—

> షష్ఠేఽష్టమేవా దశమే దినేవా వివాహ మారభ్య వధూప్రవేశః,
> పంచాంగశుద్ధంచ దినం వినాపి తిథౌ న పద్నోచరకేపి కార్యః. 2/7

టీ. పంచాంగశుద్ధంచదినంవినాపి = తిథివారనక్షత్రయోగకరణముల చేత శుద్ధంబైనదినముగాకపోయినప్పటికిని, తిథౌనపద్నోచరకేపి = శుభగ్రహాంశ పత్రికోఁగూడిన దినముగాకపోయినప్పటికిని, వివాహమారభ్య = వివాహమైనది మొదలుకొని, షష్ఠే = ఆఱవదినమునందైనను. అష్టమేవా = ఎనిమిదవదినమునందైనను, దశమేదినేవా = పదియవదినమునందైనను, వధూప్రవేశః = నూతనవధూగృహప్రవేశము, కార్యః = చేయఁదగినది.

> వివాహ మారభ్య వధూప్రవేశో యుగ్మే దినే షోడశవాసరాంతే,
> తదూర్ధ్వ మబ్దే యుజిపంచమేవాశ ప్రశస్తమూర్ధ్వం విషమేష సీవా.

టీ. వివాహమారభ్య = వివాహమైనదినము మొదలుకొని షోడశవాసరాంతే = పదియాఱుదినంబులలోపల, యుగ్మేదినే = సరిదినమునందు, వధూప్రవేశః = నూతనవధూప్రవేశము, కార్యః = చేయఁదగినది. తదూర్ధ్వం = ఆపదియాఱుదినము లతిక్రమించిన పిమ్మట, అబ్దేయుజి = సరిసంవత్సరమునందైనను, పంచమేవా = బేసిదైనప్పటికి నైదవ సంవత్సరమునందైనను చేయఁదగినది. తదూర్ధ్వం = ఆయైదుసంవత్సరములును గడచిన పిమ్మట, విషమేసమేవా = బేసిసంవత్సరమునందైనను సరిసంవత్సరమునందైనను, వధూప్రవేశః = వివాహంబైనకన్యక క్రొత్తగానత్తగారింటికివచ్చుట, శస్తః = ప్రశస్తమైనది.

వ. ఆజియోగవిధము

> వధూప్రవేశం ప్రథమేచ వర్షే తృతీయవర్షేపి శుభం వదంతి,
> వర్షే ద్వితీయేఽప్యథవా చతుర్థే వధూప్రవేశ స్త్వథ భర్తృనాశః.

టీ. ప్రథమేచవర్షే = వివాహమైన మొదటిసంవత్సరమునందును, తృతీయవర్షేపి = మూఁడవసంవత్సరమునందైనను, వధూప్రవేశమ్ = నూతనవధూప్రవేశమును, శుభం = మంగళమునుగా, వదంతి = కొందరుమునులు, చెప్పుచున్నారు. అథ = పిమ్మట, వర్షేద్వితీయేపి = రెండవసంవత్సరమునందైనను, అథవా = అటుగాకపోతే, చతుర్థే = నాలవ

సంవత్సరమునందును, వధూప్రవేశః = నవీనకన్యకాగృహప్రవేశము, భర్తృనాశః = పతివియోగకరంబని తెలియవలయును.

### ప్రవేశత్రైవిధ్యము.

వధూప్రవేశో న దివా ప్రశస్తో నృపప్రవేశో న నిశి ప్రశస్తః,
దివాచరాత్రౌచ గృహప్రవేశః కరోతి కర్తుశ్శుభకార్యసిద్ధిమ్.

టీ. వధూప్రవేశః = నూతనవధూశ్వశురగృహప్రవేశము, దివా = పగటియందు, నప్రశస్తః = ప్రసిద్ధంబుగాదు. నృపప్రవేశః = రాజగృహప్రవేశము, నిశి = రాత్రియందు, నప్రశస్తః = ప్రసిద్ధంబయినదిగాదు. గృహప్రవేశః = గృహకర్తయొక్క నూతనగృహప్రవేశము, దివా = పగటియందును, రాత్రౌచ = రాత్రికాలమునందును, కర్తుః = గృహయజమానునికి, శుభకార్యసిద్ధిం = మంగళకరములైన కార్యముల యొక్కసిద్ధిని, కరోతి = చేయుచున్నది.

### వధూప్రవేశనక్షత్రవారాదులు.

నీహారాంశువసూత్తరాదితిగురుస్రాష్ట్రానురాధాశ్వినీ
శక్రాహస్కరవాయువారుణహరిత్వాష్ట్రేషు శస్తే తిథౌ,
కుంభాజాళిగతే తదా ఖరకరే ప్రాప్తోదయే భార్గవే
జీవేఽర్కేఽస్ఫుజితాధిపేనవవధూసద్మప్రవేశశ్శుభః. 281

టీ. నీహారాంశువసూత్తరాదితి గురుస్రాష్ట్రానురాధాశ్వినీశక్రాహస్కరవాయువారుణహారిత్వాష్ట్రేషు = మృగశీర్షధనిష్ఠోత్తరోత్తరాషాఢోత్తరాభాద్రా పునర్వసుపుష్య రోహిణ్యనూరాధాశ్వినీ జ్యేష్ఠాహస్తస్వాతీశతభిషక్ శ్రవణచిత్రానక్షత్రముల యందును, శస్తేతిథౌ = ప్రశస్తతిథులయందును, ఖరకరే = సూర్యుఁడు, కుంభాజాళిగతేసతి = కుంభమేషవృశ్చిక రాసులబొందియుండఁగా, తదా = అప్పుడు; భార్గవే = శుక్రుఁడును, జీవే = బృహస్పతియును, ప్రాప్తోదయేసతి = పొందఁబడిన యుదయము గలవారగుచుండఁగా. అర్కే = సూర్యుఁడు, అస్ఫుజితాధిపే = కేంద్రగతుఁడు గాకుండఁగా, నవవధూసద్మప్రవేశః = నూతనవధూగృహప్రవేశము, శుభకరంబు.

పౌషేఽధిమాసేచ హరౌ ప్రసుప్తే ద్వితీయవర్షేగురుశుక్రమూఢే,
నవోఢికాయా నకరోతిమందిరప్రవేశమేవం మునయో వదంతి.

టీ. పౌషే = పుష్యమాసమునందును, అధిమాసేచ = అధికమాసమునందు, హరౌప్రసుప్తేసతి = విష్ణుదేవుండు నిద్రపోవుచుండఁగాను, ద్వితీయవర్షే = వివాహంబైనరెండవ సంవత్సరమునందును, గురుశుక్రమూఢే = గురుశుక్రమౌఢ్యమునందును, నవోఢికాయాః = నూతనవివాహితవధువునకు, మందిరప్రవేశం = గృహప్రవేశము, చేయఁగూడదు, ఏవం = ఈప్రకారము, మునయః = మునివరులు, వదంతి = చెప్పుచున్నారు. (ఇవ్విధంబుగా షోడశకర్మంబులు ముగిసెననుట.)

సిద్ధాన్తశిరోమణియందు.

అసంక్రాంతిమాసోఽధిమాస స్స్ఫుట స్స్యా
ద్ద్విసంక్రాంతిమాసః క్షయాఖ్యః కదాచిత్,
క్షయః కార్తికాదిత్రయే నాన్యథా స్యా
త్తదా వర్షమధ్యేఽధిమాసద్వయం చ. 283

టీ. అసంక్రాంతిమాసః = సూర్యసంక్రమణంబులేకయుండుమాసము, అధిమాసః=అధికమాసంబని, స్ఫుటః=స్పష్టంబయినది, స్యాత్=అగును. ద్విసంక్రాంతిమాసః=రెండుసూర్యసంక్రమణములు గలిగినమాసము, క్షయాఖ్యః = క్షయమాసంబను నామముగలదియై, కదాచిత్=ఒకానొకప్పుడు (సంభవించును.) క్షయః=అట్టి క్షయమాసంబు, కార్తికాదిత్రయే = కార్తికమార్గశీర్షపుష్య మాసంబులమూఁటియందే, స్యాత్=అగును. అన్యథా=మఱియొకమాసమందు, నస్యాత్ = కలుగదు. తథా=అక్షయమాసము సంభవించునప్పుడు, వర్షమధ్యే = సంవత్సరములోన, అధిమాసద్వయంచ = అధికమాసద్వయమును సంభవించుచున్నది యని యెఱుంగవలయును.

క్షయమాసో యదా జాత స్సంసర్పాఖ్యద్వయం భవేత్,
సంసర్పః పూర్వమాస స్స్యా దధిమాసః పర స్స్మృతః. 284

టీ. యదా=ఏసంవత్సరమునందు, క్షయమాసః=క్షయమాసము, జాతః=పుట్టునో, తదా=ఆసంవత్సరమునందు, సంసర్పాఖ్యద్వయం = సంసర్పంబను పేరుగల యధికమాసద్వయము, భవేత్=అగును. తథా = ఆయధిమాసద్వయము సంభవించునపుడు, పూర్వమాసః = పూర్వమాసము, సంసర్పః=సంసర్పంబను నామముగలది, స్యాత్ = అగును.పరః=అనంతరమాసము,అధిమాసః=అధికమాసంబని,స్మృతః=స్మరింపఁబడును.

గర్భే వార్ధుషికే భృత్యే శ్రాద్ధకర్మణి మాసికే,
సపిండీకరణే నిత్యే నాధిమాసం వివర్జయేత్. 285

టీ. గర్భే = స్త్రీగర్భవిషయమైన కార్యమునందు, వార్ధుషికే=ఒకని కప్పిచ్చి తిరుగ వడ్డిలోడఁ బుచ్చుకొనువిషయమునందును, భృత్యే=వేతనవిషయమునందును, శ్రాద్ధకర్మణి=ఆబ్దికమునందును, మాసికే=మాసికమునందును, సపిండీకరణే=సాపింద్యమునందును, నిత్యే=నిత్యశ్రాద్ధమునందును, అధిమాసం = అధికమాసమును, నవివర్జయేత్ = విడిచిపెట్టగూడదు. అనఁగా నీశ్రాద్ధాదికార్యములను మలమాసమునందు విడిచి పెట్టక అవశ్యకముగాఁ జేయవలయును.

మఱియు,

చంద్రసూర్యగ్రహస్నాన శ్రాద్ధదాన జపాదికమ్,

కార్యం స్యాన్మలమాసేపి నిత్యనైమిత్తికం యథా. 286

టీ. మలమాసేపి= అధికమాసమునందును, నిత్యనైమిత్తికం యథా=నిత్యనై మిత్తికంబులైన శ్రాద్ధహోమాదికార్యంబులవలె, చంద్రసూర్యగ్రహస్నానశ్రాద్ధ దాన జపాదికం = సూర్యచంద్రగ్రహణప్రయుక్తంబులగు స్నానహిరణ్యశ్రాద్ధదాన జపంబులు మొదలైనది, కార్యం = చేయదగినది, స్యాత్ = అగును.

వాపీకూపతటాకాది ప్రతిష్ఠాయజ్ఞకర్మణి,
గృహప్రవేశహోమాది నానాక్రతుమహోత్సవాః. 287
తీర్థయాత్రోత్సవాదీని మహాదానవ్రతాని చ,
మాసప్రాధాన్యకం కర్మ ముక్త్వా తత్కామ్యకర్మ చ. 288

టీ. (మలమాసేపి=మలమాసమునందు, గురౌ = గురుడైనను, శుక్రేవా=శుక్రుం డైనను,అస్తగేసత్యపి=అస్తంగతుండగుచుండఁగా,)మాసప్రాధాన్యకం కర్మ=మాస ప్రయుక్తంబయినకర్మను,తత్కామ్యకర్మ చ=కామనచేఁ జేయుకర్మంబును,ముక్త్వా= విడిచి పెట్టి, అనఁగా నివి వినాగా, వాపీకూపతటాకాదిప్రతిష్ఠాయజ్ఞకర్మణి=బావులు నూతులు చెరువులు మొదలైన ఖాతకర్మలయొక్క ప్రతిష్ఠను యాగకర్మంబును,గృహ ప్రవేశహోమాది నానాక్రతుమహోత్సవాః=నూతనగృహప్రవేశము హోమము నానావిధంబులైన యాగంబులను మహోత్సవంబులను,తీర్థయాత్రోత్సవాదీని=పుణ్య తీర్థయాత్రలు సేవించుటయు దేవతోత్సవము మొదలైనవానిని, మహాదానవ్రతా నిచ = భూదానాదిమహాదానంబులను వ్రతంబులను, నకుర్యాత్ =చేయఁగూడదు. అనఁగా నధికమాసమునందు వాపీకూపతటాకప్రతిష్ఠాదికర్మంబులు సేయ నర్హంబులు గావు. మాసోక్త కర్మములును, కామ్యకర్మములును జేయనగును.

## నూతన రజోదర్శనవిషయము.

అనుపచయస్థే చంద్రే ధరణీసుతవీక్షణాద్వాపి,
ప్రథమరజోదర్శనత శ్శుభాశుభం భవతి వనితానామ్. 289

టీ. చంద్రే = చంద్రుఁడు, అనుపచయస్థే సతి=రజోలగ్నంబున నుపచయ స్థానంబులయందు అనఁగా ౬-౧౦-౧౧-3 స్థానములయందుండక పోవుచుండఁ గాను, ధరణీసుత వీక్షణాద్వాపి=రజోముహూర్తంబున కంగారకవీక్షణముగలుగుట వల్లను, వనితానాం = స్త్రీలకు, ప్రథమరజోదర్శనతః = ప్రథమరజోదర్శనము వలన, శుభాశుభం = శుభము అశుభమును, భవతి = అగుచున్నది.

## దిక్ఫలము.

శైలచంద్రాష్టజలధి రసాక్షినవది క్క్రిమాత్,
ప్రాగాది స్యా త్ప్రిజాసంఖ్యా బాలికాప్రథమార్తవే. 290

టీ. బాలికాప్రథమార్తవే=కన్యకలకు ప్రథమరజోదర్శనమునందు, ప్రాగాది=తూర్పుదిక్కు మొదలుకొని, క్రమాత్ = క్రమముగా, ప్రజాసంఖ్యా = సంతాన సంఖ్య, శైలచంద్రాష్టజలధిరసాక్షినవదిక్=౭, ౧, ౮, ౪, ౬, ౨, ౯, ౧౦, స్యాత్ = అగును.

ఆర్తవవస్త్రనిర్ణయము.

మేషసింహోక్షచాపానా ముదయే ధవళాంబరా,
అళికర్కటనక్రాణా ముదయే మలినాంబరా. 291
ఘటయుగ్మాంగనాతౌలీలగ్నే రక్తయుతాంబరా,
పృచ్ఛకాలే భవత్యేవం బాలికా ప్రథమార్తవే. 292

టీ. ప్రథమార్తవే = ప్రథమరజోదర్శనమునందలి, పృచ్ఛకాలే = ప్రశ్న చేసిన కాలమునందు, బాలికా=కన్యక, మేషసింహోక్షచాపానాముదయే = మేష సింహవృషభధనుర్లగ్నములయందు, ధవళాంబరా=తెల్లనివస్త్రములు గలిగినదియు, అళికర్కటనక్రాణాముదయే = వృశ్చికకర్కాటక మకరరాసులయందు, మలినాంబరా = మాసినబట్టగట్టుకొనినదియు, ఘటయుగ్మాంగనాతౌలీలగ్నే = కుంభమిథున కన్యాతులాలగ్నములయందు, రక్తయుతాంబరా = ఎఱ్ఱనివస్త్రముధరించినది, ఏవం =ఈచెప్పినప్రకారము, భవతి = అగుచున్నది.

వస్త్రఫలము.

సుభగా శ్వేతవస్త్రా స్యాద్దృఢవస్త్రా పతివ్రతా,
క్షౌమవస్త్రా క్షితీశా స్యాన్నవవస్త్రా శుభాన్వితా. 293
దుర్భగా జీర్ణవస్త్రా స్యాద్రోగిణీ రక్తధారిణీ,
నీలాంబరధరా నారీ విధవా పుష్పిణీ భవేత్. 294
మలినాంబరసంవీతా దరిద్రా స్యాద్రజస్వలా,
దృఢవస్త్ర ఫలం సమ్యగ్గదితం మునిపుంగవైః. 295

టీ. శ్వేతవస్త్రా= తెల్లనిబట్టగట్టుకొని రజస్వలయైనచిన్నది, సుభగా= సౌభాగ్య వతియును, దృఢవస్త్రా=గట్టిబట్టగట్టుకొనినది పతివ్రతా=పాతివ్రత్యముగలదియును, స్యాత్ = అగును. క్షౌమవస్త్రా = దుకూలవస్త్రధారిణియై పుష్పించినపడుచుక, క్షితీశా=పట్టపురాణియును నవవస్త్రా=నూతనవస్త్రమునుధరించినది, శుభాన్వితా=శుభ సంపన్నురాలును స్యాత్ = అగును. జీర్ణవస్త్రా = శిథిలవసనమును గట్టుకొనినది, దుర్భగా=దౌర్భాగ్యవంతురాలును, రక్తధారిణీ=ఎఱ్ఱనిపుట్టము గట్టుకొనినది,రోగిణీ = వ్యాధిగ్రస్తురాలును, స్యాత్ = అగును. నీలాంబరధరా = నల్లనివస్త్రమును

ధరించినదియై, పుష్పిణీ=పుష్పించిన, నారీ=స్త్రీ, విధవా = వైధవ్యమునుబొందినది, భవేత్ =అగును. మలినాంబరసంవీతా = మాసినవస్త్రమును జుట్టుకొనినదియై, రజస్వలా = రజోవంతురాలైన కన్యక, దరిద్రా=దారిద్ర్యమునుబొందునది, స్యాత్ = అగును. మునిపుంగవైః = ఋషిశ్రేష్ఠులచేత, దృఢవస్త్రఫలం = గట్టిబట్టయొక్క ఫలము, సమ్యక్=లెస్సగా, గదితం = చెప్పఁబడినది.

## రజోబిందు ఫలము.

ఇంద్రేగుణోఽగ్నౌ యమఏవవార్ధిరన్యేవృషేవాయుదిశిద్విసంఖ్యాం,
కుబేరఈశే శశిబిందురేకో వస్త్రేషు సక్తా నవపుష్పవత్యాః. 296

టీ. ఇంద్రే=తూర్పుదిక్కునను, అగ్నౌ=ఆగ్నేయమూలయందును, గుణః = మూఁడు బిందువులును, యమఏవ=దక్షిణదిక్కునందును, అన్యే = నైరృతిమూలయందును, వార్ధిః = నాలుగుబిందువులును, వృషే = పశ్చిమదిక్కునందును, వాయుదిశి=వాయవ్యమూలయందును, ద్విసంఖ్యాం = రెండు బిందువులును, కుబేరఈశే = ఉత్తరేశానదిక్కులయందు, శశిబిందురేకః = ఒకబిందువును, నవపుష్పవత్యాః = నూతనముగా రజోవతియైన స్త్రీయొక్క, వస్త్రేషు=కట్టుపుట్టములయందు, సక్తాః= కూడుకొనినవి. అనఁగా దైవజ్ఞుఁడు పృచ్ఛకునియొక్క దిక్కునుబట్టి ప్రాగాదిక్రమముగా 3, ౪, ౨, ౧ రజోబిందువులు పడినవి యని చెప్పవలయును.

ప్రాప్నోతి బిందునైకేన సౌభాగ్యంచ ద్విబిందునా,
భోగస్త్రిబిందునా రోగో దారిద్ర్యం బహుబిందునా. 297

టీ. రజోవతియైనస్త్రీకి, ఏకేనబిందునా = ఒకబిందువుచేత, సౌభాగ్యంచ = ఐశ్వర్యము, ప్రాప్నోతి=పొందుచున్నది. ద్విబిందునా=రెండుబిందువులచేత,భోగః = భోగమును, త్రిబిందునా = మూఁడుబిందువులచేత, రోగః = వ్యాధియును, బహుబిందునా = నాలుగు మొదలైన యనేకబిందువులచేత, దారిద్ర్యం = పేదరికమును, ప్రాప్నోతి = పొందుచున్నది.

## కాలఫలము.

పుష్పవత్యా శ్శుభం ప్రాతః పూర్వాహ్ణే తీర్థగామినీ,
మధ్యాహ్నే సుతసౌభాగ్యా చాపరాహ్ణే తు జారిణీ. 298
సాయాహ్నే బహుపత్నీ స్యా త్సంధ్యయో ర్వేశ్యతాం వ్రజేత్,
పూర్వరాత్రే చిరాయు స్స్యా న్నిశీథే విధవా భవేత్. 299
నిశాంతే సుఖహీనా స్యా ద్దుర్భగా సర్వసంధిషు,

టీ, ప్రాతః=ఉదయకాలమునందు, పుష్పవత్యాః=రజస్వలయైనస్త్రీకి, శుభం = మంగళము, పూర్వాహ్ణే = పూర్వాహ్ణమునందు, తీర్థగామినీ = దివ్యక్షేత్రములు

సేవించునది, మధ్యాహ్నే=మధ్యాహ్నకాలమునందు, సుతసౌభాగ్యా=పుత్రధనము గలిగినది, అపరాహ్ణేతు=పగటియుత్తరభాగమునందైతే, జారిణీ=వ్యభిచరించునది, సాయాహ్నే=సాయంకాలంబున,బహుపత్నీ=అనేకమంది మగలుగలిగినది,స్యాత్ = అగును. సంధ్యయోః=సాయంప్రాతస్సంధ్యలయందు, వేశ్యతాం=వెలయాలితనమును. వ్రజేత్ = పొందును. పూర్వరాత్రే = పూర్వరాత్రియందు, చిరాయుః = మిక్కిలి ఆయుస్సుగలది, స్యాత్ = అగును. నిశీథే = అర్ధరాత్రమునందు, విధవా=వైధవ్యమును బొందునది, భవేత్=అగును. నిశాంతే = ఉషఃకాలమునందు, సుఖహీనా = సౌఖ్యములేనిదియు, సర్వసంధిషు=ఈచెప్పఁబడిన సంధికాలములయందు, దుర్భగా=దౌర్భాగ్యము గలదియు, స్యాత్ = అగును.

### తిథిఫలము.

సంతానహీనా ప్రతిపద్దినేచ భవే, ద్ద్వితీయేఽల్పసుఖా, తృతీయే,
సమస్తసౌభాగ్యవతీ, చతుర్థ్యాం పాపాలయా భోగవివర్జితా చ.
పంచమ్యాం బహుపుత్రభోగసహితా షష్ఠ్యాంతు దుర్భాషిణీ
సప్తమ్యాం ధనధాన్యభూషణయుతా శౌర్యాన్వితాష్టమే.
దుఃఖార్తానవమే దినేఽహ్ని దశమే సౌభాగ్యయుక్తా వరా
శుద్ధా రుద్రదినే తథార్కదివసే స్యాద్దూషిణీ సర్వదా. 301
త్రయోదశ్యాంతు సంతుష్టా భూతాయాం పాపినీ భవేత్,
పూర్ణిమాయాంతు సంపుష్టా చామాయా మల్పభోగినీ. 302

టీ. ప్రతిపద్దినేచ=పాడ్యమినాడు రజస్వలయైనకన్య, సంతానహీనా=సంతానములేనిదియు, ద్వితీయే=విదియయందు, అల్పసుఖా=స్వల్పసౌఖ్యముగలది,తృతీయే=తదియయందు, సమస్తసౌభాగ్యవతీ = సకలైశ్వర్యములు గలిగినదియును, చతుర్థ్యామ్ = చవితినాఁడు, పాపాలయా = పాపంబులకు స్థానభూతురాలును, భోగవివర్జితాచ = భోగములేనిదియును, భవేత్=అగును. పంచమ్యాం=పంచమియందు, బహుపుత్రభోగసహితా = అనేకపుత్రికాపుత్రులును భోగములును గలిగినదియు, షష్ఠ్యాంతు=షష్ఠియందైతే, దుర్భాషిణీ = దుష్టవాక్యములు బలుకునదియును, సప్తమ్యామ్=సప్తమితిథియందు, ధనధాన్యభూషణయుతా=ధనధాన్యాభరణంబులతోఁగూడినదియు, అష్టమే=అష్టమినాఁడు, శౌర్యాన్వితా =మిక్కిలిశూరురాలును, నవమేదినే=నవమియందు, దుఃఖార్తా=దుఃఖముచే పీడింపఁబడునదియును,దశమేహ్ని = దశమియందు, సౌభాగ్యయుక్తా=సౌభాగ్యవతియును, వరా=శ్రేష్ఠురాలును, రుద్రదినే=ఏకాదశినాఁడు, శుద్ధా=శుచియ్యైనదురాలును, తథా = ఆప్రకారము, అర్కదివసే=ద్వాదశియందు, సర్వదా=ఎల్లప్పుడును, దూషిణీ=పరులదూషించునదియు,

స్యాత్ = అగును. త్రయోదశ్యాం = త్రయోదశియందు, సంతుష్టా = సంతోషవతి యును, భూతాయాం = చతుర్దశియందు, పాపినీ = పాపాత్మురాలును, పూర్ణిమాయాంతు = పున్నమయందైతే, సంపుష్టా = బలిసినదియును, అమాయాం = అమావాస్యయందు, అల్పభోగినీ = స్వల్పభోగముగలదియు, భవేత్ = అగును.

వారఫలము - కాశ్యపసంహితయందు.

రోగిణీ రవివారేచ సోమవారే పతివ్రతా,
దుఃఖితా భౌమవారేతు బుధే సౌభాగ్యసంయుతా. 303
శ్రీసంయుతా గురోర్వారే పతిభక్తా భృగోర్దినే,
మలినా మందవారే తు రాత్రావపి తథైవచ. 304

టీ. రవివారేచ = భానువారమునందుఁ బుష్పించినపడఁతుక, రోగిణీ = వ్యాధి పీడితురాలును, సోమవారే = ఇందువాసరమునందు, పతివ్రతా = పతివ్రతయును, భౌమవారేతు = కుజవారమునందైతే, దుఃఖితా = దుఃఖవంతురాలును, బుధే = బుధవారమునాఁడు, సౌభాగ్యసంయుతా = సౌభాగ్యవతియును, గురోర్వారే = గురువారమునందు శ్రీ సంయుతా = సంపన్నురాలును, భృగోర్దినే = శుక్రవారమునందు, పతిభక్తా = పెనిమిటియం దత్యంతభక్తిగలదియును, మందవారేతు = శనివారమందైతే, మలినా = కలుషస్వభావముగలదియు, తథైవ = ఆప్రకారమే, రాత్రావపి = రాత్రియందును, మలినా = మలినాత్మురాలగునని తెలియవలయును.

శుభనక్షత్రములు.

కరాదిపంచోత్తరమూలపూష విష్ణుత్రయాశ్వీజ్యవిధీందుభేషు,
ఆద్యంరజస్సౌఖ్యసుతాయురర్థంసౌభాగ్యవృద్ధింకురుతేంఽగనానామ్.

టీ. కరాదిపంచోత్తరమూలపూషవిష్ణుత్రయాశ్వీజ్య విధీందుభేషు-కరాదిపంచ = హస్తచిత్తస్వాతివిశాఖానురాధలయందును, ఉత్తర = ఉత్తరోత్తరాషాఢోత్తరాభాద్రలయందును, మూల = మూలయందును, పూష = రేవతియందును, విష్ణుత్రయ = శ్రవణధనిష్ఠాశతభిషములయందును, అశ్వి = అశ్వినియందును, ఇజ్య = పుష్యమియందును, విధి = రోహిణియందును, ఇందుభేషు = మృగశీర్షయందును, ఆద్యం = మొదటిదైన, రజః = ఆర్తవము, అంగనానాం = స్త్రీలకు, సౌఖ్యసుతాయురర్థం-సౌఖ్య = సౌఖ్యమును, సుత = కుమారులను, ఆయుః = ఆయుష్యమును, అర్థం = ధనంబును, సౌభాగ్యసిద్ధిం = సుభగత్వసిద్ధిని, కురుతే = చేయుచున్నది.

దుష్టనక్షత్రములు.

పూర్వత్రయే యామ్యభుజంగధిష్ణ్యే తాంబూలతైలం కుసుమం
హారిద్రాం, తద్భర్తృసందర్శనమేవ వర్జ్యం తాత్కాలికం శాంతి

విధిం ప్రకుర్యాత్, రౌద్రే మఖే శోకయుతాఽదితేర్భేసాంబధకీంద్రే
ఽప్యనలే దరిద్రా. ౩౦౬

టీ. పూర్వత్రయే = పుబ్బపూర్వాషాఢాపూర్వభాద్రలయందును యామ్య
భుజంగధిష్ణ్యే = భరణ్యాశ్లేషానక్షత్రములయందును (రజస్వలయైన స్త్రీచేత), తాం
బూలతైలం - తాంబూలం = తాంబూలచర్వణము, తైలం = తైలాభ్యంగమును,
కుసుమం = పుష్పధారణమును, హారిద్రాం = పసుపుపూఁతయు, తద్భర్తృసందర్శన
మేవ=పెనిమిటినిజూచుటయును, వర్జ్యం = పరిత్యజింపఁదగినది. ఇదియునుంగాక,
తాత్కాలికం = ఆరజోదర్శనకాలోచితంబయిన, శాంతివిధిం = శాంతికరవిధాన
మును, ప్రకుర్యాత్ = చేయువలసినది. రౌద్రే = ఆర్ద్రానక్షత్రమునందు, మఖే =
మఖానక్షత్రమునందును (రజోవతియైన స్త్రీ), శోకయుతా = దుఃఖవతియును, అది
తేర్భే=పునర్వసునక్షత్రమునందును ఇంద్రేపిచ=జ్యేష్ఠయందును, సా=ఆసమర్తాడిన
కన్యక, బంధకీ = వ్యభిచారిణి యగును. అనలే = కృత్తికానక్షత్రంబునందు,
దరిద్రా=దారిద్ర్యమునుగలది యగుచున్నది.

కృత్తికాదిత్యరౌద్రేఽపి మఖాజ్యేష్ఠే రజస్వలా,
ఆదిపాదే శుభం ప్రోక్తం సా కన్యా మంగళప్రదా. 307
ద్విపాదే చే ద్రజో దృష్టం పంచవింశతిభోజనమ్,
త్రిపాదేచ చతుష్పాదే శాంతిం కుర్యాద్యథావిధి. 308

టీ. కృత్తికాదిత్యరౌద్రేపి =కృత్తికాపునర్వస్వార్ద్రానక్షత్రములయందును,
మఖాజ్యేష్ఠే = మఖాజ్యేష్ఠనక్షత్రములయందును, ఆదిపాదే = ప్రథమపాదమందు,
రజస్వలాచేత్ =రజోవతియైన, శుభం = మంగళంబని, ప్రోక్తం = పలుకఁబడినది.
సాకన్యా=ఆచిన్నది, మంగళప్రదా=శుభకరురా లగును. ద్విపాదే=రెండవపాదము
నందు. రజః=ఆర్తవము, దృష్టంచేత్ = చూడఁబడినట్లైతే, పంచవింశతిభోజనం =
తచ్ఛాంతినిమిత్తముగా నిరువదియైదుగురికిభోజనంబు షడ్రసోపేతముగాఁ బెట్టవల
యును. త్రిపాదేచ = మూఁడవచరణమునందును, చతుష్పాదే = నాలవపాదము
నందు, యథావిధి = విధ్యుక్తప్రకారముగా, శాంతిం = శాంతిని, కుర్యాత్ =చేయ
వలయును.

శుభనక్షత్రఫలము - గ్రంథాంతరమున.

ధనిష్ఠావిష్ణుమూలాసు నార్యాస్స్యాత్సుతపంచకమ్,
మృగోత్తరకరత్వష్ట్రశతతారాసు వై దశ. 309
ద్వైదైవస్వాతిమూలాశ్విమైత్రేషుచ సుతాష్టకమ్,
ప్రాజాపత్యే సుతా స్సప్త చాంత్యేచ నవకం భవేత్. 310

టీ. ధనిష్ఠావిష్ణుమూలాసు=ధనిష్ఠా శ్రవణమూలానక్షత్రంబులయందు రజస్వలయైన, నార్యాః=ఆఁడుదానికి, సుతపంచకం=పుత్రపంచకము, స్యాత్ = అగును. మృగోత్తరకరత్వష్ట్రశతతారాసు = మృగశీర్షోత్తరాషాఢోత్తరాభాద్రలయందును, దశ=పుత్రదశకమును, ద్విదైవస్వాతిమూలాశ్విమైత్రేషుచ = విశాఖస్వాతిమూలాశ్విన్యనూరాధలయందును, సుతాష్టకం = కుమారాష్టకమును, ప్రాజాపత్యే = రోహిణియందు, సుతాస్సప్త=పుత్రసప్తకమును, అంత్యేచ=రేవతియందు, నవకం=పుత్రనవకమును, భవేత్=అగును. అనఁగా నాయానక్షత్రములయందు నయ్యాసంఖ్యగల కుమారులు గలుగుదురు.

## దుష్టనక్షత్రఫలము.

పూర్వత్రయే దరిద్రాస్యాత్కృత్తికాయాం తు దుర్భగా,
ఆర్ద్రాయాం పుత్రనాశస్స్యా ద్భరణ్యాం స్వమృతి ర్భవేత్. 311
మఖాయాం భర్తృనాశస్స్యా త్సార్పే చండాలగామినీ,
దరిద్రిణీచ జ్యేష్ఠాయాం రతిహీనా చ జాయతే. 312

టీ. పూర్వత్రయే=పుబ్బపూర్వాషాఢ పూర్వాభాద్రలయందు రజస్వలయైనపడుచు, దరిద్రా=ధనహీనురాలు, స్యాత్ = అగును. కృత్తికాయాం=కృత్తికానక్షత్రమునందు, దుర్భగా=దౌర్భాగ్యవతి యగును. ఆర్ద్రాయాం=ఆర్ద్రానక్షత్రమందు, పుత్రనాశః=పుత్ర సంతానంబులేకపోవుట, స్యాత్ = అగును. భరణ్యాం=భరణీనక్షత్రమునందు, స్వమృతిః=రజస్వలయైన స్త్రీ మరణము, భవేత్=అగును, మఖాయాం =మఖానక్షత్రమునందు, భర్తృనాశః=పతివియోగము, స్యాత్=అగును. సార్పే= ఆశ్రేషానక్షత్రమునందు, చండాలగామినీ = చండాలపురుషునితో విహరించునదియును, జ్యేష్ఠాయాం = జ్యేష్ఠానక్షత్రమునందు, దరిద్రిణీచ = పేదరికముగలిగినదియును, రతిహీనాచ = సురతవిహీనురాలును, జాయతే = అగుచున్నది.

పూర్వత్రయే భుజంగర్క్షే యామ్యర్క్షేచ రజస్వలా,
ప్రథమాంశే పతిఘ్నీ స్యా ద్ద్వితీయే మృతపుత్రకా. 313
తృతీయేతు దరిద్రా స్యా చ్చతుర్థే త్వశుభావహా,

టీ. పూర్వత్రయే=పుబ్బపూర్వాషాఢపూర్వాభాద్రలయందును, భుజంగర్క్షే = ఆశ్రేషానక్షత్రమునందును, యామ్యర్క్షేచ=భరణీనక్షత్రమునందును, ప్రథమాంశే= మొదటి పాదమునందును, రజస్వలా = రజోవతియైతే, పతిఘ్నీ = మగనిజంపునదియును, ద్వితీయే = రెండవపాదమునందు, మృతపుత్రకా = చచ్చిపోయెడు పుత్రసంతానము కలిగినదియును, స్యాత్=అగును. తృతీయేతు = మూడవపాదమందైతే, దరిద్రా = భాగ్యహీనురాలును, చతుర్థేతు = నాలవపాదమందైతే, అశుభావహా = అమంగళకరురాలును, స్యాత్ = అగును.

దుష్టతిథ్యాదులు

అమా రిక్తాఽష్టమీ షష్ఠీ ద్వాదశీ ప్రతిపత్స్వపి. 314
పరిఘస్యచ పూర్వార్ధే వ్యతీపాతేచ వైధృతౌ,
సంధ్యాసూపప్లవే విష్ట్యా మశుభం ప్రథమార్తవమ్. 315

టీ. అమారిక్తాష్టమీ షష్ఠీ ద్వాదశీ ప్రతిపత్స్వపి - అమా=అమావాస్యయందును, రిక్త=రిక్తతిథులయందును, అష్టమీ=ఉభయాష్టములయందును, షష్ఠీ=ఉభయషష్ఠులయందును, ద్వాదశీ=ఉభయద్వాదశులయందును, ప్రతిపత్స్వపి=ఉభయప్రతిపత్తులయందును, పరిఘస్యచపూర్వార్ధే=పరిఘనామయోగముయొక్క పూర్వభాగమునందును, వ్యతీపాతేచ=వ్యతీపాతనామయోగమందును, వైధృతౌ = వైధృతినామయోగమునందును, సంధ్యాసు=సంధ్యాకాలములయందును, ఉపప్లవే=అశనిపాతము మొదలైన యుపద్రవకాలములయందును, విష్ట్యామ్ = భద్రవాకరణమునందును, ప్రథమార్తవం = స్త్రీల తొలుతటిసమర్త, అశుభమ్ = శుభకరంబు గాదు.

ఆర్తవలగ్నగ్రహాఫలము

కేంద్రత్రికోణాయధనస్థితాశ్చ శుభాః స్త్రిషష్ఠాయగతాశ్చపాపాః,
శుభప్రదాస్స్యుః ప్రథమర్తుకాలే తథా విధిజ్ఞా జగురార్యవర్యాః

టీ. ప్రథమర్తుకాలే=స్త్రీలకు ప్రథమరజోదర్శనకాలమునందు, కేంద్రత్రికోణాయధనస్థితాః=కేంద్రత్రికోణలాభస్థానంబులయందుండిన, శుభాశ్చ= సౌమ్యగ్రహములును, త్రిషష్ఠాయగతాః=తృతీయషష్ఠలాభస్థానంబులనొందిన, పాపాశ్చ=క్రూరగ్రహములును, శుభప్రదాః=శుభమునిచ్చునవి, స్యుః=అగును. తథా=ఆప్రకారము, విధిజ్ఞాః=దైవజ్ఞులైన, ఆర్యవర్యాః=పూజ్యులగు మునిసత్తములు, జగుః = పలికిరి.

అష్టమస్థే నిశానాథే భర్తుర్నైధనకారకమ్,
చంద్రతారాబలయుతే రజః పుత్రార్థసంపదః. 317

లగ్నాద్వా జన్మలగ్నాద్వా భూమిజే వాఽథవా విధౌ,
సత్పుత్రా ప్రథమార్తా స్యాత్కన్యా చోపచయే స్థితే. 318

టీ. నిశానాథే=చంద్రుఁడు, అష్టమస్థేసతి=అష్టమస్థానగతుఁడగుచుండఁగా, రజః=ఆర్తవము, భర్తుర్నైధనకారకం = పతినాశనముఁజేయునది. చంద్రతే = తారాబలయు చంద్రతారాబలసంపన్నంబు లగునపుడు, రజః=ప్రథమార్తవము, పుత్రార్థసంపదః=పుత్రధనసంపత్తులనుఁజేయునది, లగ్నాద్వా= రజోలగ్నమునుండిగాని, జన్మలగ్నాద్వా=జననకాలలగ్నమునుండిగాని, భూమిజేవా = అంగారకుఁడైను, అథవా=అటుగాకపోతే, విధౌవా=చంద్రుఁడైనను, ఉపచయస్థితేపి=తృతీయ

షష్ఠదశమలాభస్థానంబులయందుండగా, ప్రథమార్తవే=తొలుతటిసమర్తయందు, కన్యా=కన్య, సత్పుత్రా = సద్గుణసంపన్నులగు కొమాళ్లుగలది, స్యాత్ అగును.

ఆర్తవలగ్న శుభాశుభఫలము.

మేషేతు వ్యభిచారస్స్యాన్ద్వృషభే సౌఖ్యవర్ధనమ్,
మిథునే స్యాత్పుత్రవతీ కర్కటే చాతిజారిణీ. 319
సింహే పుత్రవతీ నారీ కన్యాయాం శ్రీమతీ భవేత్,
భాగ్యయుక్తా తులాయాం చ వృశ్చికే వ్యభిచారిణీ. 320
దుశ్చరీ ధనుఃపూర్వే స్యాదపరే తు పతివ్రతా,
మకరే మానహీనా స్యాత్కుంభే ధనవతీ భవేత్. 321
మీనే పుత్రవతీచైవ ప్రథమర్తావిదం ఫలమ్. 322

టీ. మేషేతు=మేషలగ్నమునందైతే, వ్యభిచారః=వ్యభిచారమును, వృషభే=వృషభలగ్నమునందు, సౌఖ్యవర్ధనం=సౌఖ్యాభివృద్ధియు, స్యాత్=అగును. మిథునే=మిథునలగ్నమునందు, పుత్రవతీ=పుత్రసంతానవతియును, కర్కటేచ = కర్కటకలగ్నమునందు, అతిజారిణీ=మిక్కిలి జారసాంగత్యము గలిగినదియును, స్యాత్ = అగును. సింహే = సింహలగ్నమందును, నారీ=రజస్వలయైనస్త్రీ, పుత్రవతీ=పుత్రవంతురాలును, కన్యాయాం = కన్యాలగ్నమునందు, శ్రీమతీ=సంపద్యుక్తరాలును, భవేత్=అగును. తులాయాం = తులాలగ్నమునందు, భాగ్యయుక్తా = భాగ్యవంతురాలును, వృశ్చికే = వృశ్చికలగ్నమున, వ్యభిచారిణీ = వ్యభిచారముగలదియును, స్యాత్ = అగును, ధనుఃపూర్వే = ధనుర్లగ్నముయొక్క పూర్వభాగమునందు, దుశ్చరీ = జారిణియును, అపరేతు = ధనుస్సుయొక్క యుపరభాగమునందైతే, పతివ్రతా = పాతివ్రత్యము గలిగినదియును, మకరే=మకరలగ్నమునందు, మానహీనా =అభిమానములేనిదియును, స్యాత్ = అగును. కుంభే=కుంభరాశియందు, ధనవతీ=ధనధాన్యసమృద్ధిగలిగినదియును, మీనే = మీనలగ్నమునందు, పుత్రవతీ=పుత్రసంతానముగలదియును, భవేత్ = అగును. ప్రథమర్తౌ = ప్రథమరజస్సునందు, ఇదంఫలం = ఈపూర్వోక్తప్రకారంబైన ఫలంబు గలుగును.

గ్రంథాంతరమందు

మేషేఽపి సింహేఽపిచ కన్యకాయాం
గ్రామస్య బాహ్యే ప్రథమార్తవం స్యాత్,
వృషేచ గోష్ఠే ధనుషి స్వగేహే
గ్రామే ఘటేఽన్యస్య గృహేఽంగనాయాః. 323
మీనే మృగే కర్కటకే ఘటేఽంబు
తీరే నృయుగ్మేతు దిగంబరా స్యాత్,

వనే చమధ్యేఽప్యథ వృశ్చికే చ
గర్గాదయోఽప్యేవ ముదీరయంతి. 324

టీ. మేషేచ=మేషమందును, సింహేపిచ = సింహరాశియందును, కన్యకాయాం=కన్యారాశియందును, గ్రామస్య=గ్రామమునకు, బాహ్యే=బయలున, ప్రథమార్తవం=ప్రథమరజోదర్శనము, స్యాత్ =అగునని, పృచ్ఛకునకుదైవజ్ఞుఁడు చెప్పవలయు. వృషేచ=వృషభలగ్నమందు, గోష్ఠే=గోస్థానమందనియు, ధనుషి = ధనుర్లగ్నమునందు, స్వగేహే=తనయింటిలోననియు, ఘటే = తులయందు, అంగనాయాః = కన్యయొక్క, గ్రామే = గ్రామమునందు, అన్యస్యగృహే = మఱియొకనియింటిలోననియు, మీనే = మీనరాశియందును, మృగే=మకరమందును, కర్కటకే = కటకరాశియందును, ఘటే=కుంభరాశియందును. అంబుతీరే=జలసమీపంబునందనియు, నృయుగ్మేతు = మిథునమందైతే = రజస్వలయైన స్త్రీ, దిగంబరా = దిసమొలగలది, స్యాత్ =అగుననియు, అథ=పిమ్మట, వృశ్చికేచ=వృశ్చికరాశియందు, వనేచమధ్యే= అరణ్యమధ్యంబునందనియుఁ జెప్పవలయు. ఏవం=ఈప్రకారమే, గర్గాదయోపి = గర్గుఁడు మొదలగుమహామునులు, ఉదీరయంతి = చెప్పుచున్నారు.

### రజోదర్శనస్థానఫలము

గ్రామబాహ్యే పరగామే సాస్త్రీ స్యాద్వ్యభిచారిణీ,
పతివ్రతా పశుస్థానే సుజీవా గృహమధ్యమే. 325
గ్రామమధ్యే సువృద్ధి స్స్యా ద్విధవా స్యాద్దిగంబరా,
అన్యస్య గేహే దుశ్శీలా దీర్ఘాయుర్జలసన్నిధౌ. 326
వనమధ్యేతు సౌభాగ్యధనధాన్యసమన్వితా,

టీ. గ్రామబాహ్యే=గ్రామంబునకు బహిఃప్రదేశమునందు, పరగ్రామే=అన్యగ్రామమునందు, యా=ఏకన్యక, రజస్వలా=రజోవతియగునో, సాస్త్రీ = ఆచిన్నది, వ్యభిచారిణీ=వ్యభిచారముకలది, స్యాత్ =అగును. పశుస్థానే=గొడ్లదొడ్డియందు, పతివ్రతా=పాతివ్రత్యముగలిగినదియు, గృహమధ్యమే=స్వకీయగృహాభ్యంతరమునందు, సుజీవా = సుఖజీవనంబుగలిగినదియును, గ్రామమధ్యే = స్వగ్రామమధ్యమునందు, సువృద్ధిః = మిక్కిలి వృద్ధిచేత చొప్పుచుండునదియును, దిగంబరా = దిసమొలతో రజస్వలయైన పడఁతి, విధవా = వైధవ్యమును బొందునదియు, స్యాత్ = అగును. అన్యగేహే = పరగృహమందు, దుశ్శీలా = దుష్టస్వభావము కలిగినదియునియు, జలసన్నిధౌ=జలసమీపంబున, దీర్ఘాయుః=దీర్ఘాయుష్మంతురాలనియు, వనమధ్యేతు =అరణ్యమధ్యంబునందైతే, సౌభాగ్య ధనధాన్యసమన్వితా = ధనధాన్యైశ్వర్యములతోఁ గూడియుండునదియు నని చెప్పవలయును.

### ఆర్తవనక్షత్రమందలి గ్రహఫలము

పథమార్తవనక్షత్రే సమక్షేఽజే మృతప్రజా. 327

జ్ఞశుక్రసహితే వంధ్యా సగురౌ స్యాత్తపస్వినీ,
సాదిత్యేతు పతిఘ్నీ స్యాద్రాహుయుక్తేతు జారిణీ. 328
శనౌ తిష్ఠతి చేద్దాసీ గ్రహహీనే సువాసినీ,

టీ. ప్రథమార్తవనక్షత్రే=ప్రథమరజోనక్షత్రము, సమహీజేసతి=అంగారక సహితంబగుచుండఁగా, మృతప్రజా=చచ్చిపోయిన సంతానముగలిగినదియు, జ్ఞశుక్రసహితే=బుధశుక్రసమేతంబగునక్షత్రమునందు, వంధ్యా=గొడ్డుబోతురాలును, సగురౌ=బృహస్పతియున్న నక్షత్రంబునందు, తపస్వినీ=తపోవంతురాలును, స్యాత్=అగును. సాదిత్యేతు=సూర్యాధిష్ఠితంబైన నక్షత్రంబునందైతే, పతిఘ్నీ=పెనిమిటినిజంపునదియును, రాహుయుక్తేతు=రాహుసంయుక్తనక్షత్రంబునందైతే, జారిణీ=జారులు గలిగినదియును, శనౌ=శనైశ్చరుఁడు, తిష్ఠతిచేత్ = ఆర్తవనక్షత్రమునం దుండినటులాయెనా, దాసీ=దాస్యము సేయునదియు, గ్రహహీనే = ఏగ్రహము లేకయుండు నక్షత్రమునందు, సువాసినీ=దీర్ఘసౌమంగల్యము గలిగినదియును, స్యాత్ = అగును.

రజస్వలాచక్రము

రజస్వలాయాం కన్యాయాం దిక్చక్రే భాని విన్యసేత్. 329
ప్రాచ్యాదిదిక్షు చత్వారి త్రీణి త్రీణి విదిక్షుచ,

టీ. కన్యాయాం=కన్యక, రజస్వలాయాం సత్యాం=రజోవతియగుచుండఁగా, దిక్చక్రే=దిగాకారంబుగాఁ జక్రంబు నేర్పఱచి, యందలి, ప్రాచ్యాదిదిక్షు = ప్రాగ్దక్షిణపశ్చిమోత్తరదిక్కులయందు, చత్వారి = సూర్యుఁడున్న నక్షత్రము మొదలుకొని నాలుగేసి నక్షత్రములను, విదిక్షుచ = ఆగ్నేయాదిదిక్కులయందు, త్రీణి త్రీణి = మూఁడేసి నక్షత్రంబులను, విన్యసేత్ = లిఖింపవలయును.

భానుభాచ్చంద్రనక్షత్రపర్యంతం గణయేత్క్రమాత్. 330
ఆయుస్సంపద్వైధవ్య పుత్రాన్దిక్షు వినిర్దిశేత్,
విదిక్షు క్షతరోగార్తి మరణాని వదేత్క్రమాత్. 331

టీ. భానుభాత్=సూర్యుఁడున్న నక్షత్రము మొదలుకొని, చంద్రనక్షత్రపర్యంతం = చంద్రాధిష్ఠితనిత్యనక్షత్రపర్యంతమును, క్రమాత్ = వరుసగా, గణయేత్ = లెక్కింపవలయు. దిక్షు=ప్రాగాదిదిక్కులయందు, క్రమాత్=క్రమముగా, ఆయుస్సంపదవైధవ్యపుత్రాన్=ఆయుష్యము సంపదను వైధవ్యము లేకపోవుటయును పుత్రసంతానమును, వినిర్దిశేత్ = నిర్దేశించవలసినది. విదిక్షు = విదిక్కులయందు, క్రమాత్ = క్రమముగా, క్షతరోగార్తిమరణాని - క్షత = గాయమును, రోగ = వ్యాధిని, ఆర్తి = పీడను, మరణాని = మృతిని, వదేత్ = చెప్పవలయును.

## రజస్వలాశుద్ధి.

ప్రథమేఽహని చండాలీ ద్వితీయే పతితా స్మృతా,
తృతీయే రజకీ ప్రోక్తా చతుర్థే శూద్రికా భవేత్.
పంచమేఽహని శుద్ధాస్స్యాద్ధవ్యకవ్యాదికర్మసు,
చతుర్థేఽహని భర్తుస్స్యా చ్ఛుద్ధా సంభోగకర్మణి. 333

టీ. రజస్వలా = రజోవతియైనకన్యక, ప్రథమేహని= మొదటిదినమునందు, చండాలీ= చండాలస్త్రీతుల్యురాలు, ద్వితీయే= రెండవదినమునందు, పతితా= పతితురాలితో సమానురాలని, స్మృతా= చెప్పబడినది. తృతీయే = మూఁడవదినమునందు, రజకీ = చాకలివెలఁదుకతో సమానయని, ప్రోక్తా = చెప్పఁబడినది. చతుర్థే= నాలవదినమునందు, శూద్రికా= శూద్రస్త్రీసమురాలు, భవేత్ = అగును, పంచమేహని = ఐదవదినమునందు, హవ్యకవ్యాదికర్మసు = దేవపితృకార్యములవిషయమై, విశుద్ధా= పరిశుద్ధురాలు, స్యాత్ =అగును. చతుర్థేఽహని = నాలుగవదినమునందు, భర్తుః = పెనిమిటికి, సంభోగకర్మణి = సురతకర్మయందు, శుద్ధా= స్నానముచేత శుచిర్భూతురాలు, స్యాత్ = అగును.

## నారదీయమందు

రజస్వలా యది స్నాతా పునరేవ రజస్వలా,
అష్టాదశదినాద ర్వాగశుచిత్వం నవిద్యతే 334

టీ రజస్వలా=బహిష్ఠయైనస్త్రీ, స్నాతా= స్నానముచేత శుచియై, పునరేవ= తిరుగ, అష్టాదశదినాదర్వాక్ =పదునెనిమిదిదినంబులలోఁగా, రజస్వలాయది = రజస్సుచేనొనరినట్లైతే, అశుచిత్వం= అపవిత్రత, నవిద్యతే= లేదు. అనఁగా బహిష్ఠయైనస్త్రీ తిరుగఁబదునెనిమిదిదినములలోఁగా బయటనుండెనేనియు నాచిన్నది స్నానమాత్రముచేఁ బవిత్రురాలగుచుండుఁగాని యపవిత్రురాలుగాదని యెఱుంగఁదగినది.

ఏకోనవింశతే రర్వాగేకాహం స్యా త్తదూర్ధ్వతః,
వింశత్యుత్తరకాలేతు త్రిరాత్రంతు శుచి ర్భవేత్. 335

టీ. ఏకోనవింశతేరర్వాక్ =పందొమ్మిది దినములలోపలనైతే, ఏకాహం=ఒక దినము, స్యాత్ =అగును, తదూర్ధ్వతః= ఆపందొమ్మిది దినములకుపైన, వింశత్యుత్తరకాలేతు= ఇరువది దినంబులకు మిగిలినకాలంబునందైతే, త్రిరాత్రం= మూఁడుదినముల యందు, శుచిః = పరిశుద్ధురాలు, భవేత్ = అగును, అనఁగా బందొమ్మిది దినములలోఁగా దిరుగ రజోవతియయ్యెనేని యొకదినముచేతఁ బరిశుద్ధురాలగుననియు, నిరువది దినంబుల కనంతరకాలంబునం దయ్యెనేని మూఁడురాత్రులచే శుచిర్భూతురా లగుననియు నెఱుంగవలయును.

## నిషేకము.

విష్ణు ప్రజేశ రవి మిత్ర సమీర పౌష్ణ
మూలోత్తరా వరుణభాని నిషేకకార్యే,
పూజ్యాని పుష్య వసు శీతకరాశ్వి చిత్రా
దిత్యాశ్చ మధ్యమఫలా విఫలా స్స్యురన్యే. 336

టీ. నిషేకకార్యే = పునస్సంధానప్రయోజనమునందు, విష్ణుప్రజేశరవిమిత్రసమీరపౌష్ణమూలోత్తరావరుణభాని = శ్రవణరోహిణీ హస్తానూరాధాస్వాతీరేవతీమూలోత్తరోత్తరాషాఢోత్తరాభాద్రాశతభిషఙ్నక్షత్రములు, పూజ్యాని=పూజింపఁదగినవి. అనఁగా మంచినక్షత్రంబులు, పుష్యవసుశీతకరాశ్విచిత్రాదిత్యాశ్చ = పుష్యధనిష్ఠమృగశీర్షాశ్వినీచిత్రాపునర్వసునక్షత్రంబులు, మధ్యమఫలాః = మధ్యమఫలదాయకంబులు అనఁగా మధ్యనక్షత్రములు. అన్యే = తద్వ్యతిరిక్తనక్షత్రంబులన్నియు, విఫలాః = విగతఫలంబులుగలవి, అనఁగా నధమనక్షత్రంబులు.

షష్ఠ్యష్టమీ పంచదశీ శ్చతుర్థీం
చతుర్దశీ మప్యుభయత్ర హిత్వా,
శేషా శ్శుభా స్స్యుస్తిథయో నిషేకే
వారాశ్శశాంకార్యసితేందుజానామ్. 337

టీ. షష్ఠ్యష్టమీపంచదశీః=షష్ఠ్యష్టములను పూర్ణిమను, అమావాస్యను చతుర్థీం=చవితిని, చతుర్దశీమపి=చతుర్దశికిని, ఉభయత్ర=శుక్లకృష్ణపక్షంబులరెంటియందును, హిత్వా=పరిత్యజించి, శేషాః=మిగిలిన, తిథయః = తిథులును, శశాంకార్యసితేందుజానాం = చంద్రగురుశుక్రబుధులయొక్క, వారాశ్చ=వారములును, నిషేకే = నిషేకముహూర్తమునందు, శుభాః = శుభకరంబులు, స్యుః = అగును.

వృషమిథునకులీరసింహకన్యాతులఘటచాపఝషా శ్శుభం వహంతి,
యదిశుభఫలశాలినోఽనుకూలే నిధనవిశుద్ధియుతే నిషేకకార్యే.

టీ. నిషేకకార్యే = నిషేకప్రయోజనమునందు, నిధనవిశుద్ధియుతే=అష్టమశుద్ధితోఁగూడినముహూర్తము, అనుకూలేయది = అనుగుణంబైనట్లైతే, శుభఫలశాలినః = శుభఫలంబుచేత నొనరుచుండు, వృషమిథునకులీరసింహ కన్యాతులఘటచాపఝషాః=వృషభ మిథున కటక సింహ కన్యా తులా కుంభ ధను ర్మీనరాసులు, శుభం=మంగళమును, వహంతి=వహించుచున్నవి. అనఁగా నీచెప్పఁబడినలగ్నంబులు నిషేకముహూర్తవిషయమై శుభకరంబులని యెఱుంగవలయును.

## పుంసవనము.

కుర్యాత్పుంసవనం ప్రసిద్ధవిషయే మాసే తృతీయే ధవః

పశ్యన్ స్త్రీస్ఫీతతనౌ తుషారకిరణే పుష్యేఽథవా వైష్ణవే,
హిత్వా కర్కటకన్యయుగ్మమఖిలేష్వన్యేష్వరిక్తే తిథౌ
శుద్ధే నైధనధామ్ని శుక్రశశభృద్విజ్ఞాంత్రిణాం వాసరే. 339

టీ. ప్రసిద్ధవిషయే=స్పష్టగర్భవిషయమై, తృతీయేమాసే=మూఁడవమాసమునందు, తుషారకిరణే=చంద్రుఁడు, పుష్యే=పుష్యమీనక్షత్రమందైనను, అథవా = అటుగాకయుండిన. వైష్ణవే = శ్రవణమందైనను, స్ఫీతతనౌసతి = ప్రకాశించుచుండు శరీరముగలవాఁడగుచుండఁగా, కర్కటకన్యయుగ్మం=కటక కన్యామిథునరాసులను, హిత్వా=విడిచి, అన్యేషు = ఇతరములైన, అఖిలేషు = సమస్తరాసులయందును, నైధనధామ్ని = లగ్నమునుండి యెనిమిదవస్థానము, శుద్ధేసతి=గ్రహవర్జితంబగుచుండఁగా, అరిక్తేతిథౌ=అరిక్తతిథులయందును, శుక్రశశభృద్విజ్ఞాంత్రిణాంవాసరే=శుక్ర సోమ బుధ గురువాసరములయందును, ధవః=పెనిమిటి, పశ్యన్=చూచుచున్నవాఁడై, పుంసవనం=పుంసవనంబను కర్మను, కుర్యాత్ =చేయవలసినది.

## సీమంతము.

చతుర్థషష్ఠాష్టమమాసభేదే భర్త్రాఽద్యగర్భే ప్రథమం విధేయమ్,
సీమంతకర్మ ద్విజభామినీనాం మాసేఽష్టమే విష్ణుబలించకుర్యాత్,

టీ. ఆద్యగర్భే=ప్రథమగర్భమునందు, చతుర్థషష్ఠాష్టమమాసభేదే=నాలవనెలనైనను ఆఱవనెలనైనను ఎనిమిదవనెలనైనను భర్త్రా=పెనిమిటిచేత, సీమంతకర్మ=సీమంతంబనుకర్మము, ప్రథమం=ముఖ్యముగా, విధేయం = చేయఁదగినది. అష్టమేమాసే=ఎనిమిదవమాసమునందు, ద్విజభామినీనాం=బ్రాహ్మణస్త్రీలకు, విష్ణుబలించ = గర్భసంరక్షణార్థంబుగా విష్ణుదేవతాబలిని, కుర్యాత్ = చేయవలయును.

## నక్షత్రవారాదులు.

సీమంతే తిష్యహస్తాదితిహరిశశభృత్త్వాష్ట్రవిధ్న్యుత్తరాఖ్యాః
పక్షచ్ఛిద్రాంశ్చరిక్తాః పితృతిథిమపహాయాపరాస్స్యుః ప్రశస్తాః,
సింహాళీ వర్జయిత్వా శుభఫలబహుళా రాశయోఽప్యంగశకాని
శ్రేష్ఠాస్స్యుశ్శీతరోచిర్భృగుబుధధిషణానాం విశుద్ధేఽష్టమేపి.

టీ. సీమంతే=సీమంతకర్మయందు, తిష్యహస్తాదితిహరిశశభృత్త్వాష్ట్రవిధ్న్యుత్తరాఖ్యాః = పునర్వసుశ్రవణమృగశీర్షారేవతీరోహిణ్యుత్తరోత్తరాషాఢోత్తరాభాద్రలును, పక్షచ్ఛిద్రాంశ్చ=పక్షఛిద్రతిథులను, రిక్తాః=రిక్తతిథులను, పితృతిథిం=అమావాస్యను, అపహాయ=విడిచి, అపరాః= శేషించినతిథులు, ప్రశస్తాః ప్రసిద్ధంబులైనవి, స్యుః = అగును, సింహాళీ = సింహావృశ్చికరాసులను, వర్జయిత్వా = పరిత్యజించి,

అన్యే = ఇతరములైన, శుభఫలంబులచేత నధికంబులగు, రాశయోపి = రాసులును, అంశకాని = ఈ చెప్పినరాశ్యంశములును, శీతరోచిర్భృగుబుధధిషణానాం = సోమశుక్ర బుధ గురు సంబంధములైన వారములును, అష్టమేవిశుద్ధేపి = సీమంతలగ్నంబున కెనిమిదవయిల్లు గ్రహవర్జితం బగుచుసుండఁగా, శ్రేష్ఠాః = ఉత్తమంబులు, స్యుః = అగును.

శుభగ్రహేషు ధీధర్మ కేంద్రేష్వరిభవత్రిషు,
పాపేషు షట్సు చంద్రోఽంత్యనిధనాత్తా దివర్జితః. 342

టీ. శుభగ్రహేషు = సౌమ్యగ్రహములు, ధీధర్మ కేంద్రేషు = కోణకేంద్రముల యందుండఁగాను, పాపేషు = క్రూరగ్రహములు, అరిభవత్రిషు = షష్ఠలాభతృతీయస్థానములఁ బొందియుండఁగాను, చంద్రః = చంద్రుఁడు, అంత్యనిధనాత్తాదివర్జితః = ద్వాదశాష్టమజన్మములయం దుండనివాఁడై, షట్సు = ఈ వెనుకఁ జెప్పిన కేంద్రకోణ తృతీయ షష్ఠలాభస్థానంబులయం దుండవలయును.

సీమంతలగ్నా దేకోఽపి క్రూరః పంచాష్టరిష్ఫగః,
యది సీమంతినీం హన్యా త్తద్గర్భం వా నసంశయః. 343

టీ. సీమంతలగ్నాత్ = సీమంతలగ్నముకంటె, ఏకః క్రూరోపి = ఒకానొక క్రూరగ్రహమును, పంచాష్టరిష్ఫగో యది = పంచమాష్టమద్వాదశస్థానంబుల నొందియుండెనేని, సః = ఆపాపగ్రహము, సీమంతినీం = గర్భిణిస్త్రీనైనను, తద్గర్భం వా = ఆగర్భిణీ గర్భంబునైనను, హన్యాత్ = నశింపఁజేయును. నసంశయః = సందియంబు లేదు.

## ఏకవింశతిమహాదోషనిర్ణయము

ఆద్యః పంచాంగశుద్ధి స్స్యాద్ద్వితీయ స్సూర్యసంక్రమః,
తృతీయః కర్తరీదోష శ్చంద్ర షష్ఠాష్టరిష్ఫగః. 344
ఉదయాస్తాంశ యోశ్శుద్ధిరహితో దుర్ముహూర్తజః,
గండాంతం పాపషడ్వర్గం భృగుషట్కంకుజాష్టమమ్. 345
దంపత్యో రష్టమం లగ్నం రాశే ర్విషఘటీ భవేత్,
కునవాంశో వారదోషః ఖర్జూరికసమాంఘ్రిభమ్. 346
గ్రహణో త్పాతభం క్రూరవిద్ధర్క్షం క్రూరసంయుతమ్,
అకాలగర్జితం వృష్టి ర్మహాపాత స్సవైధృతిః. 347
మహాదోషా అమీ హ్యేషాం ఫలం వక్ష్యే పృథక్పృథక్,

టీ. పంచాంగశుద్ధిః = పంచాంగశుద్ధియను పేరుగలదోషము, ఆద్యః=౧. సూర్యసంక్రమః = సూర్యసంక్రమణము, ద్వితీయః = ౨. కర్తరీదోషః = కర్తరి దోషము, తృతీయః= ౩, చంద్రష్షష్ఠాష్టరిప్ఫగః=చంద్రదోషము ౪. ఉదయాస్తాంశయోశ్శుద్ధిరహితః=ఉదయాస్తశుద్ధియనుదోషము ౫. దుర్ముహూర్తజః = వారజనిత దుర్ముహూర్తదోషము ౬. గండాంతం=గండాంతదోషము ౭. పాపషడ్వర్గం=క్రూర గ్రహషడ్వర్గము ౮. భృగుషట్కం=భృగుషట్కము ౯. కుజాష్టమమం=కుజాష్టమము ౧౦. దంపత్యోరష్టమం లగ్నం=దంపత్యష్టములగ్నదోషము ౧౧. రాశేర్విషఘటీ= రాశివిషఘటికాదోషము ౧౨. కునవాంశః = కునవాంశము ౧౩. వారదోషః = వారజనితదోషము ౧౪. ఖర్జూరికసమాంఘ్రిభమ్ = ఖార్జూరచక్రసమాంఘ్రిభ దోషము ౧౫. గ్రహణోత్పాతభం = గ్రహణోత్పాతదోషము ౧౬, క్రూరవిద్ధర్క్షం= క్రూరగ్రహవిద్ధనక్షత్రదోషము ౧౭. క్రూరసంయుతం = క్రూరసంయుతదోషము ౧౮. అకాలగర్జితం వృష్టిః=అకాలగర్జితవృష్టిదోషము ౧౯. మహాపాతః=మహాపాతాది దోషము ౨౦. వైధృతిః = వైధృతిదోషము ౨౧. అమీ = ఈ చెప్పినదోషములు, మహాదోషాః = ఏకవింశతిమహాదోషంబులు, ఏషాం = ఈ యేకవింశతిమహాదోషంబులయొక్క, ఫలం = ఫలమును, పృథక్పృథక్=వేఱువేఱుగా, వక్ష్యే=ముందుఁ జెప్పఁబోవుచున్నాను.

### పంచాంగశుద్ధిదోషస్వరూపము.

తిథిర్వారశ్చ నక్షత్రం యోగశ్చ కరణం తథా. 348
ఏతే పంచ శుభా యత్ర పంచాంగం శుద్ధిమద్భవేత్,
యస్మిన్పంచాంగజో దోష స్తల్లగ్నం పరివర్జయేత్. 349
త్రిద్యుస్పృగవమా వేధక్రాంతవైప్రాస్తథైవచ,
ఏతే పంచవిధా దోషాః పంచాంగదళదోషకాః. 350

టీ. యత్ర=ఏముహూర్తమునందు, తిథిః వారశ్చ=తిథివారములును,నక్షత్రం = నక్షత్రమును, యోగశ్చ=యోగమును, తథా=ఆప్రకారము. కరణంచ=కరణమును,ఏతేపంచ=ఈయైదును, శుభాః=శుభకరములైనవో, సః=అది, పంచాంగం=ఆశుభతిథి వార నక్షత్రయోగకరణస్వరూపంబున పంచాంగము, శుద్ధిమత్ =శుద్ధిగలది,భవేత్ = అగును. యస్మిన్ = ఏముహూర్తమునందు, పంచాంగజోదోషః=పంచాంగదోషము సంప్రాప్తంబగునో,తల్లగ్నం=ఆపంచాంగదోషగ్రస్తంబైనలగ్నమును,పరివర్జయేత్ = విడువవలెను తిథివారనక్షత్రయోగకరణంబులైదునుశుభకరంబులుగా నుండవలయు ననుట. త్రిద్యుస్పృగవమా=దినత్రయత్రిద్యుస్పృక్కులును, వేధ=వేధలును,క్రాంత= క్రాంతలును, వైప్రాః=వైప్రయును, తథైవ = ఆప్రకారము, ఏతే=ఈచెప్పిన, పంచ

విధాః=ఐదువిధంబులైన, దోషాశ్చ=దోషములును పూర్వశ్లోకమునందు చెప్పఁబడిన యైదు దోషములునుగలవి యీపదియును, పంచాంగదశదోషకాః = పంచాంగ దోషంబు లని పేర్కొనఁబడుచుండును.

## సూర్యసంక్రాంతిదోషము.

త్యాజ్యా స్సూర్యస్య సంక్రాంతేః పూర్వతః పరత స్సదా,
వివాహాదిషు కార్యేషు నాడ్య ష్షోడశ షోడశ. 351

టీ. సూర్యసంక్రాంతేః=సూర్యసంక్రమణప్రవేశకాలంబునకు, పూర్వతః = పూర్వమందును, పరతః = పరమునందును, షోడశషోడశ=పదియాఱుపదియాఱయిన, నాడ్యః=ఘటికలు, వివాహాదిషు=వివాహము మొదలయిన, కార్యేషు=సకలశుభ కార్యంబులయందును, సదా=ఎల్లప్పుడును, త్యాజ్యాః=పరిత్యజింపఁదగినవి. అనఁగా నిది సూర్య సంక్రమణదోషం బనుట.

## కర్తరీదోషము.

లగ్నాంత్యముఖయోః పాపవక్రయోః శ్శుభయోనయోః,
సా కర్తరీతి విజ్ఞేయా దంపత్యోర్గళకర్తరీ. 352

టీ. లగ్నాంత్యముఖయోః=వివాహముహూర్తంబునకు ద్వాదశద్వితీయస్థానం బులయందు, పాపవక్రయోః=వక్రించినక్రూరగ్రహంబులు, శుభయోనయోః = శుభ గ్రహసంబంధముగలిగినప్పటికిని, స్థితయోశ్చేత్=ఉండె నేని, సా=అది, కర్తరీతి= కర్తరిదోషమనంబడునట్టిదోషము, దంపత్యోః = వధూవరులకు, గళకర్తరీ = కంఠ మునుగత్తిరించెడు కత్తెరయని, జ్ఞేయా=తెలియఁదగినది.

కర్తరీదోషదుష్టం యల్లగ్నం తత్పరివర్జయేత్,
యది సౌమ్యగ్రహైర్యుక్తం గుణై స్సర్వై స్సమన్వితమ్. 353

టీ. కర్తరీదోషదుష్టం=కర్తరీదోషముచేదూషింపఁబడిన,యల్లగ్నం=ఏలగ్నమో, తత్=ఆలగ్నము, సౌమ్యగ్రహైర్యుక్తంయది=శుభగ్రహంబులచే గూడియుండినను, సర్వైః=సమస్తంబులైన, గుణైః=గుణంబులతోడ, సమన్వితం యది = సంయుక్తం బైనను, పరివర్జయేత్=వివాహాదిశుభకార్యములయందుఁ బరిత్యజింపవలయు.

## షష్ఠాష్టరిష్ఫగచంద్రదోషము.

షడష్టరిష్ఫగే చంద్రే లగ్న దోష స్స్వసంజ్ఞితః,
తల్లగ్నం వర్జయే ద్యత్నా జ్జీవశుక్రసమన్వితమ్. 354

టీ. యస్మిఁల్లగ్నే=ఏలగ్నమునందు, చంద్రే=చంద్రుఁడు, షడష్టరిష్ఫగేసతి= షష్ఠాష్టమవ్యయస్థానంబులనొందియుండఁగా, స్వసంజ్ఞితః = తనసంజ్ఞగల, దోషః= దోషము గలుగుచున్నదో, తల్లగ్నం=అట్టిచంద్రషష్ఠాష్టరిష్ఫదోషగ్రస్తం బైలగ్న

మును, జీవ శుక్ర సమన్వితమపి=గురుశుక్ర సహితంబైనప్పటికిని, యత్నాత్=ప్రయత్నమువల్ల, వర్జయేత్ = పరిత్యజించవలయును.

సగ్రహచంద్ర దోషము.

శశాంకే గ్రహసంయుక్తే దోష స్సగ్రహసంజ్ఞితః,
తస్మిం త్సగ్రహదోషే తు వివాహం నైవ కారయేత్. 355

టీ. శశాంకే=చంద్రుఁడు, గ్రహసంయుక్తే=శుభపాపగ్రహాన్యతరగ్రహంబులతోఁగూడియుండెనేని, సగ్రహసంజ్ఞితః=చంద్రసగ్రహంబను పేరుగల, దోషః=దోషము, తస్మిన్ సగ్రహదోషేతు=ఆసగ్రహదోషమునందైతే, వివాహం=ఉద్వాహమును, నైవకారయేత్ = చేయఁదగదు.

ఉదయాస్తశుద్ధి

లగ్నలగ్నాంశకౌ స్వస్య పతినా వీక్షితౌ యుతౌ,
నచే దన్యోన్యపతినా శుభమిత్రేణ వా తథా. 356
వ్యత్యయ శ్చే త్తథా మృత్యు స్తాభ్యాం సప్తోదయాంశకౌ,
ఏవం యుతౌ మృత్యుకరౌ క్రూరగ్రహయుతౌ యథా. 357

టీ. లగ్నలగ్నాంశకౌ=వివాహలగ్నమును లగ్ననవాంశమును, స్వస్యపతినా=లగ్ననవాంశాధిపతులచేత, వీక్షితౌ = చూడఁబడినవైనను, యుతౌ=కూడుకొనినవైననుండవలయును. తథా=అప్రకారము, నచేత్=కాకయుండిన, అన్యోన్యపతినా = పరస్పరాధిపతులచేతనైన, శుభమిత్రేణవా = శుభగ్రహములచేతనైన మిత్రులచేతనైనను వీక్షితయుతములై యుండవలయు. వ్యత్యయశ్చేత్=పూర్వముకంటె వినియమంబయినట్టులైతే, తదా=అప్పుడు, తాభ్యామ్=ఆలగ్ననవాంశములవల్ల, మృత్యుః=మృత్యువు సంభవించుచున్నది. సప్తోదయాంశకౌ = వివాహలగ్నంబునకు సప్తమలగ్నతన్నవాంశంబులు, ఏవంయుతౌ = వెనుక చెప్పినరీతిగా శుభమిత్రాదిగ్రహంబులతోఁగూడియుండెనేని, క్రూరగ్రహయుతౌయథా = పాపగ్రహాయుక్తములైనవానివలె, మృత్యుకరౌ=మృత్యుప్రదంబులైనవి. భవతః = అగుచున్నవి. అనఁగా వివాహలగ్నవిషయమై లగ్నాధిపతి బలవంతుఁడై లగ్నమందుండవలయు. నట్లుగాకుండిన శుభమిత్రగ్రహంబులలో నేదియైననొకటి లగ్నమందుండినఁగాని లేక చూచిగాని యొప్పియుండవలసినది. ఆప్రకారమే సప్తమాధిపతియును బలములైన స్థానములయందుండవలయు. లేదా యుచ్చమిత్ర స్వక్షేత్రాదులయందైన నొనరియుండవలయును.

దుర్ముహూర్తవిషయము.

రుద్రాహిమిత్రపితరో వసువారవిశ్వే వేధో విధి శ్శతమఖః పురు

హూతవహ్నీ, నక్తంచరాఖ్యవరుణార్యమయోనయశ్చప్రోక్తందినస్య
దశపంచ దివా ముహూర్తమ్.

టీ. రుద్రాహిమిత్రపితరః = రుద్రాహిమిత్రపితృసంజ్ఞకంబులనియు, వసువార విశ్వే = వసువారవిశ్వేదేవతలనియు, వేదః = వేదంబనియు, విధిః=విధియనియు, శతముఖః = శతముఖంబనియు, పురుహూతవహ్నీ = పురుహూతవహ్నులనియు, నక్తంచరాఖ్యవరుణార్యమయోనయశ్చ = రాక్షసవారుణార్యమంబులనియు, దశపంచ=ఈపదియేను, దినస్య=దినముయొక్క, దివా=పగటియందు, ముహూర్తమ్ = ముహూర్తంబులని యొఱుంగునది.

## రాత్రిముహూర్తములు.

నిశాముహూర్తాగిరిశాజపాదాహిర్బుధ్న్యపూషాశ్వియమాగ్నయ
శ్చ, విధాతృచంద్రాదితిజీవవిష్ణుతిగ్మద్యుతిత్వష్టృసమీరణాశ్చ.

టీ. గిరిశాజపాదాహిర్బుధ్న్యపూషాశ్వియమాగ్నయశ్చ = గిరిశాజపాదాహిర్బుధ్న్యపూషాశ్వియమాగ్ని నామకంబులనియు, విధాతృచంద్రాదితిజీవవిష్ణుతిగ్మద్యుతిత్వష్టృసమీరణాశ్చ=విధాతృచంద్రాదితిజీవవిష్ణుతిగ్మ ద్యుతిత్వష్టృ సమీరణంబులనియు నీపదియేను, నిశాముహూర్తాః = రాత్రిముహూర్తములు అనఁగా రెండుగడియకాల ముహూర్తంబని యెఱింగియెన్నిగడియలకు ముహూర్తంబు నిశ్చయింపవలసి యుండునో యాకాలంబునకు సరిగా వెనుక చెప్పిన లెక్కప్రకారం బెంచఁగానైన ముహూర్తంబు ఫలానిముహూర్తంబని తెలిసినట్టిముహూర్తంబులలో 'భగఇంద్రాగ్ని ఆహిర్బుధ్న్యాఖ్య రౌద్రపితృ' ఈయాఱుముహూర్తంబులు కీడుగానివియనియు, కడమముహూర్తంబులు శుభంబులనియు, రాత్రిముహూర్తంబులలో, రౌద్రఅజాంఘ్రియమఅగ్ని=ఈనాలుగు ముహూర్తంబులు మంచివిగావు మిగిలిన పదునొకొండు ముహూర్తములు మంచివనియుం దెలియవలయుననుట.

## వారజనితదుర్ముహూర్తములు.

అర్యమ్ణోఽర్కే తుహినకిరణే రాక్షసబ్రహ్మసంజ్ఞౌ
పిత్ర్యాగ్నేయౌ క్షితిసుతదినే చంద్రపుత్రేఽభిజిచ్చ,
పైత్రబ్రాహ్మౌ భృగుసుతదినే రాక్షసాప్యౌచ జీవే
భౌజంగేశౌ సవితృజదినే వర్జనీయౌ ముహూర్తాః. 360

టీ. అర్కే=ఆదివారమునాఁడు, అర్యమ్ణః=అర్యమముహూర్తమును, తుహినకిరణే=సోమవారమునాఁడు, రాక్షసబ్రహ్మసంజ్ఞౌ=రాక్షసబ్రహ్మముహూర్తంబులు రెండును, క్షితిసుతదినే=అంగారకవారమునాఁడుపిత్ర్యాగ్నేయౌపితృవహ్నిముహూర్తం

బులు రెండును, చంద్రపుత్రే = బుధవారమునాఁడు, అభిజిచ్చ=అభిజిన్ముహూర్త మును, భృగుసుతదినే=శుక్రవారమునాఁడు, పైత్రబ్రాహ్మే=పితృబ్రహ్మముహూర్తం బులు రెండును, జీవే=గురువారమునాఁడు, రాక్షసాహ్వ్యేచ=రాక్షసోదకముహూర్తం బులు రెండును, సవితృజదినే=శనివారంబున, భౌజంగేశా=భుజంగేశానముహూర్తం బులు రెండును, నివి, ముహూర్తాః=వారజనితదుర్ముహూర్తంబులుగాన నివిఃయున్నియు, వర్జనీయాః = వివాహాది శుభకార్యములయందు విడిచిపెట్టఁదగినవి యని యెఱుంగ వలయు.

అహస్కరాదివారేషు యే ముహూర్తాస్తు నిందితాః,
వివాహాదిషు తే వర్జ్యా అపి లక్షగుణై ర్యుతాః. 361

టీ. అహస్కరాదివారేషు = భాన్వాదివారములయందు, యేముహూర్తాస్తు= ఏముహూర్తంబులైతే, నిందితాః=నిందింపఁబడినవో, తే=అదుర్ముహూర్తంబులు, లక్షగుణైర్యుతా అపి=లక్షగుణంబులతోఁ గూడియున్నప్పటికిని, వివాహాదిషు = పాణిగ్రహణాదులయందు, వర్జ్యాః = విడువఁదగినవి.

గండాంతదోషములు తిథిగండము.

పూర్ణానందాఖ్యయో స్తిథ్యోస్సంధౌ నాడీచతుష్టయమ్,
గండాంతం మృత్యుదం జన్మయాత్రోద్వాహవ్రతాదిషు. 362

టీ. పూర్ణా నందాఖ్యయోః = పూర్ణనందలను పేరుగల, తిథ్యోః=తిథుల యొక్క, సంధౌ = సంధియందు, నాడీచతుష్టయమ్ = పూర్ణతిథ్యంతంబునందు రెండుగడియలును, నందతిథ్యాదియందు రెండుగడియలునుగలసి నాలుగుగడియల పర్యంతంబైన సంధికాలము, గండాంతం=గండాంతదోషం బనఁబడునట్టిదోషము, జన్మయాత్రోద్వాహవ్రతాదిషు = జననయాన పాణిపీడనోపనయనాదులయందు, మృత్యుదమ్=మృత్యుప్రదంబు, అనఁగా నిట్టి గండాంతకాలమునందు నేశుభకార్య మును సేయు మేలుగాదు.

లగ్నగండము.

కులీరసింహయోః కీటచాపయోర్మీనమేషయోః.
గండాంత మంతరాళం స్యాద్ఘటికార్ధంమృతి ప్రదమ్. 363

టీ. కులీరసింహయోః=కటకసింహములయొక్కయు, కీటచాపయోః=వృశ్చిక ధనుస్సులయొక్కయు, మీనమేషయోః=మీనమేషములయొక్కయు, అంతరాళం= మధ్యమము, ఘటికార్ధం=గడియన్నరకాలము, గండాంతం = లగ్నగండాంతదోష మనం బడునట్టిదోషము, మృతిప్రదం = శుభకార్యంబులయందు మరణకరంబు,

### నక్షత్రగండములు.

సార్పేంద్రపౌష్ణభేష్వంత్యే షోడశాంశాభసంధయః,
తదగ్రభేష్వాద్యపాదే పాదగండాంతసంజ్ఞకాః. 364

టీ. సార్పేంద్రపౌష్ణభేషు=ఆశ్రేషజ్యేష్ఠరేవతీనక్షత్రంబులయందలి, అంత్యే=నాలవపాదములయందును, తదగ్రభేషు = ఆనక్షత్రంబులకు మొదటివియైన మఖ మూలాశ్వినీతారలయందలి. ఆదిపాదే=ప్రథమపాదములయందును, షోడశాంశాః = నాలుగుగడియలపరిమితంబులైన, భసంధయః = నక్షత్రసంధికాలములు, పాదగండాంతసంజ్ఞకాః =పాదగండాంతంబులను సంజ్ఞలచే నొప్పుచుండును, వెనుకఁ జెప్పినరీతిగా నీలగ్నములకు పాపషడ్వర్గము వదలి శుభషడ్వర్గము చూచుకోవలెను.

### భృగుషట్కదోషము.

షట్కం విహాయ దోషం చ లగ్నాత్షష్ఠగతే సితే,
ఉచ్చగే శుభసంయుక్తం తల్లగ్నం సర్వదా త్యజేత్. 365

టీ. లగ్నాత్=వివాహలగ్నముకంటె, సితే=శుక్రుఁడు, షష్ఠగతేసతి=ఆఱవయింటనుండఁగా, షట్కందోషంచ=భృగుషట్కదోషమును, విహాయ=విడిచిపెట్టి, ఉచ్చగే=శుక్రుఁడుచ్చంగతుఁడైనను,తల్లగ్నం=ఆభృగుషట్కదోషదుష్టంబైనలగ్నంబును, శుభసంయుక్తమపి=శుభగ్రహసహితంబయినను, సర్వదా =ఎల్లప్పుడు, త్యజేత్=విడువవలయు. అనఁగా నాఱింట శుక్రుఁడుండగా, భృగుషట్కదోషంబులుగలుగు. నాదోషమును వివాహాదిశుభకార్యములయందుఁ బరిత్యజించవలయును.

### కుజాష్టదోషము.

కుజాష్టమో మహాదోషో లగ్నాదష్టమగే కుజే,
శుభత్రయయుతం లగ్నం త్యజే ద్యత్తుంగగే యది. 366

టీ. కుజే=అంగారకుఁడు,లగ్నాత్=ముహూర్తలగ్నముకంటె, అష్టమగేసతి=అష్టమస్థానమునఁ బొందియుండఁగా, కుజాష్టమోమహాదోషః=కుజాష్టమం బను పేరు గలమహాదోషము సంభవించును.తుంగగేయది=అంగారకుఁడుచ్చంగతుఁడయ్యెనేని, యత్=ఏలగ్నము, కుజాష్టమదోషగ్రస్తంయిన ముహూర్తంబును, శుభత్రయయుతమపి=శుభగ్రహత్రయముతోఁ గూడినను, త్యజేత్=విడువవలయును.

కుజేఽష్టమే షష్ఠగతే భృగౌ వా షష్ఠాష్టమద్వాదశగేచ చంద్రే,
తద్దోషనాశం రవిరాయసంస్థోలగ్నే యదా కేంద్రగతే సురేజ్యే. 367

టీ. కుజే=అంగారకుఁడు, అష్టమే=ముహూర్తంబున కెనిమిదింటనుండఁగా నైనను, భృగౌ=శుక్రుఁడు, షష్ఠగతే వా = ఆఱవయింటనుండఁగానైనను, చంద్రే = చంద్రుఁడు, షష్ఠాష్టమద్వాదశగేచ=ఆ ఆరెనిమిది పండ్రెండుస్థానంబులయందుండఁగా

నైనను, యదా=ఎప్పుడు, సురేజ్యో=బృహస్పతి, కేంద్రగతేసతి = లగ్నాదికేంద్రస్థుఁడై యుండెనేని యాబృహస్పతియు, ఆయసంస్థః = పదునొకొండవయింటనున్న, రవిః=సూర్యుఁడును, తద్దోషనాశం=అయావజాష్టమాదిదోషంబుల యొక్క నాశనమును, కరోతి = చేయుచున్నాఁడు.

అష్టమలగ్నదోషము.

ఉభయో రష్టమం లగ్నం వివాహశుభకర్మణి,
యది లగ్నగత స్సోపి దంపత్యోర్మరణప్రదః. 368

టీ. ఉభయోః=స్త్రీపురుషరాశి జన్మలగ్నంబులకు,అష్టమంలగ్నం=ఎనిమిదవ లగ్నము,వివాహశుభకర్మణి=వివాహశుభకార్యమందు మేలు సేయునదిగాదు,సోపి=ఆ యష్టమాధిపతియు, లగ్నగతో యది=లగ్నమునందుండెనేని, దంపత్యోః = దంపతులకు, మరణప్రదః=మృత్యుప్రదుఁ డగును.

విషనాడీదోషము.

ఆద్యే పరే స్యుర్ఘటికా శ్చతస్రో విషనాడికాః,
విషనాడీసమాయుక్తం తల్లగ్నం సర్వదా త్యజేత్. 369

టీ. ఆద్యేపరే=లగ్నంబునకు బూర్వమందును బరమందును, చతస్రః=నాలుగైన, విషనాడికాః=విషనాడికలైన, ఘటికాః=గడియలు, వర్జ్యాః=విడువఁదగినవి. విషనాడీసమాయుక్తం=విషఘటికలతోఁగూడిన,తల్లగ్నం=ఆలగ్నమును, సర్వథా=సర్వప్రకారములచేత, త్యజేత్ = విడువవలయును.

ఇందలివిశేషము.

లగ్నస్యాదౌ విషం త్యక్త్వా పశ్చాత్కర్మాణి కారయేత్,
లగ్నాంత్యే విషసంయుక్తం తల్లగ్నం పరివర్జయేత్. 370

టీ. లగ్నస్య=లగ్నముయొక్క, ఆదౌ=మొదటను, విషం=విషఘటికలను, త్యక్త్వా=విడిచిపెట్టి, పశ్చాత్=అనంతరము, లగ్నాంత్యే=లగ్నపుచివరను, కర్మాణి శుభకర్మలను, కారయేత్=చేయవలసినది. విషసంయుక్తం = విషఘటికాసహితంబైన, తల్లగ్నం=ఆలగ్నమును, పరివర్జయేత్ = విడిచిపెట్టవలయుననుట.

ఖర్జూరచక్రసమాంఘ్రినక్షత్రదోషము.

ఏకా మూర్ధ్వగతాం త్రయోదశ తథా తిర్యగ్గతా స్థాపయే
ద్రేఖాచక్రమిదం బుధై రభిహితం ఖర్జూరికం తత్రతు,
వ్యాఘాతాదిషు మూర్ధ్ని భంతు కథితం తత్రైకరేఖాస్థయో
స్సూర్యాచంద్రమసో ర్మిథో నిగదితో దృక్పాతవకార్గళః. 371

వ్యాఘాతశూల పరిఘావ్యతిపాతపూర్వ
గండాతిగండకులిశేషు సవైధృతేషు,
ఆదిత్యచంద్ర పితృసార్పభదస్ర మూల
మైత్రాఖ్యతిష్యసురవర్ధకిభాని మూర్ధ్ని. 372
చతుర్థక స్త్వాద్యపాద మాద్యగస్తు చతుర్థకమ్,
ద్వితీయగ స్తృతీయం చ తృతీయ స్తు ద్వితీయకమ్. 373
సమాంఘ్రివేధ స్సర్వత్ర విజ్ఞేయో ధిష్ణ్యమండలే,

**టీ.** ఏకామూర్ధ్వగతాం=నిడుపుగానొకరేఖను, తథా=ఆప్రకారము, త్రయోదశతిర్యగ్గతాః=అడ్డముగాఁ బదుమూఁడురేఖలను. స్థాపయేత్ = ఏర్పఱచవలెను. ఇదం=ఈప్రకారముగా లిఖింపఁబడిన, రేఖాచక్రం=రేఖాచక్రము, ఖర్జూరికం = ఖార్జూరికచక్రంబని, బుధైః=పెద్దలచేత, అభిహితం=చెప్పఁబడినది, తత్రతు=ఆఖార్జూరికచక్రమునందైతే, వ్యాఘాతాదిషు = వ్యాఘాతముమొదలైన తొమ్మిదియోగములయందు, కథితం=చెప్పఁబడిన, భంతు=ఆయానక్షత్రమును, మూర్ధ్ని=చక్రశిరోభాగమునం దుపన్యసించవలయు, తత్ర=ఆప్రకారము నక్షత్రవిన్యాసముతోఁగూడిన చక్రమునందలి, ఏకరేఖాస్థయోః=ఒకరేఖయందుండిన సూర్యచంద్రులున్ననక్షత్రములకు, మిథః=అన్యోన్యముగలిగిన, దృక్పాతః = దృష్టిప్రసరణము, ఏకార్గళః = ఏకార్గళదోషంబని, గదితః = చెప్పఁబడినది. సవైధృతేషు = వైధృతినామయోగముతోఁగూడిన, వ్యాఘాతశూలపరిఘావ్యతిపాతపూర్వ గండాతిగండకులిశేషు = వ్యాఘాతశూలపరిఘా వ్యతిపాతవిష్కంభ గండాతి గండవజ్రనామయోగంబులయందు, ఆదిత్యచాంద్రపితృసార్పభదస్ర మూలమైత్రాఖ్యతిష్యసురవర్ధకిభాని = పునర్వసు మృగశీర్షమఖాశ్రేషాశ్వనీమూలానూరాధా. పుష్య చిత్తానక్షత్రంబులు, మూర్ధ్ని=చక్రపుశిరస్సునఁగ్రమంబుగా నాయాయోగంబులకు నిర్ణీతంబైననక్షత్రమును వ్రాయవలయు, ధిష్ణ్యమండలే = ఖర్జూరచక్రమందు విన్యసింపబడిన నక్షత్రమండలమునందు, సర్వత్ర = అంతట, చతుర్థగస్తు = సూర్యుఁడు నాలవపాదమునందుండెనేని, ఆద్యపాదం = చంద్రుఁడున్ననక్షత్రముయొక్క మొదటిపాదమును గూర్చియు, ఆద్యగస్తు=ప్రథమపాదమునందుండినటులైతే, చతుర్థకమ్= నాలవపాదమునుగూర్చియు, ద్వితీయగః = రెండవపాదమందుండెనేని, తృతీయంచ=మూఁడవమునుగూర్చియు, తృతీయగస్తు=మూఁడవపాదమున నున్నపక్షమునందు, ద్వితీయకం= రెండవపాదమునుగూర్చియు, సమాంఘ్రి వేధః=సమపాదవేధయని, విజ్ఞేయః = తెలుసుకోఁదగినది. అనఁగా నిడుపుగా నొకరేఖయు నడ్డముగాఁ బదుమూఁడు రేఖలును దీసిన నది ఖార్జూరిక చక్రమనంబడు నట్టిచక్రంబునందు, వ్యాఘాతమునకుఁ బునర్వసు, విష్కంభమున కశ్వని, గండకుమూల, అతిగండమున కనూరాధ, వజ్రమునకుఁ బుష్యమి, వ్యతీపాతకాశ్రేషశూలకు మృగశీర్ష, వైధృతికి చిత్తయునని యొకింగి

యాయోగంబులలో నేయోగంబునందు ముహూర్తంబుంచవలయును. నాయోగంబునకు జెప్పియున్న నక్షత్రంబును శిరస్సునుండి ప్రదక్షిణక్రమంబుగా నిరువదియేడు నక్షత్రంబులు లిఖించిచూడఁగా ముహూర్తనక్షత్రం బున్న రేఖకెదుటి రేఖయందు సూర్యుఁడున్ననక్షత్రం బచ్చటదవిలియుండె నేని ఖార్జూరికదోషము సంభవించును. భిన్నరేఖయయ్యె నేని దోషంబులేదు. ఏకార్గళదోషంబు సాఖార్జూరిక చక్రము నందు పాదభేదముచేత నెఱుంగఁదగినది. ఎట్లనిన; సూర్యుఁడు ప్రథమపాదమం దుండునప్పుడు చంద్రుఁడు నాలవపాదముననుండెనా యేకార్గళ దోషంబు గలుగు చుండు. నీప్రకారంబుగా నాలవపాదంబునకుఁ బ్రథమపాదము, మూఁడవపాదము నకు రెండవపాదమునకు రెండవపాదంబునకుఁ మూఁడవపాదము, నేకార్గళ దోషంబనియు, పాదభేదము గలిగె నేని దోషములేదనియుఁ దెలియవలయును.

### గ్రహణోత్పాతనక్షత్రదోషము.

గ్రహణోత్పాతభం త్యాజ్యం మంగళేతు ఋతుత్రయమ్,
యావచ్చ రవిణా భుక్తం ముక్తం దగ్ధ మివేంధనమ్. 375

టీ. గ్రహణోత్పాతభం = గ్రహణోదయంబయిననక్షత్రమును, ఉత్పాతము పుట్టిన నక్షత్రమును, మంగళేతు=వివాహకర్త యందయితే, ఋతుత్రయం = ఆఱు మాసములపర్యంతము, త్యాజ్యం=విడువఁదగినవి. రవిణా=సూర్యునిచేత, భుక్తం= అనుభవింపఁబడిన, యావచ్చ=నక్షత్రంబంతయును, దగ్ధమ్=దహింపఁబడిన, ఇంధనమివ = కాష్ఠమువలె, ముక్తం = విడువఁబడుచున్నది.

### క్రూరవిద్ధనక్షత్రదోషము.

క్రూరగ్రహేణ సంవిద్ధం క్రూరగ్రహసమన్వితమ్,
అఖిలర్క్షం పంచగవ్యం సురాబిందుయుతం యథా. 376

టీ. క్రూరగ్రహేణ సంవిద్ధం=పాపగ్రహముచేత వేధింపఁబడిననక్షత్రమును, క్రూరగ్రహసమన్వితం=పాపగ్రహముతోఁగూడియుండునక్షత్రమును, అఖిలర్క్షం= యావన్నక్షత్రమును, సురాబిందుయుతం=సురాబిందువుగలసిన, పంచగవ్యంయథా= పంచగవ్యంబునువలెను, త్యాజ్యమ్=వివాహాదిశుభకార్యములయందుఁ బరిత్యజింపఁ దగినది.

క్రూరవిముక్తం దగ్ధం క్రూరగతం జ్వలితధూమితం పురతః,
తేషాం క్రూరగతాంశాంత్సమస్తకార్యేషు వర్జయే ద్ధీమాన్. 377

టీ. క్రూరవిముక్తం=క్రూరగ్రహముచే విడువఁబడిన నక్షత్రము, దగ్ధం=దగ్ధంబనియు, క్రూరగతం=క్రూరగ్రహమును బొందియున్న నక్షత్రము జ్వలితంబనియు, పురతః=క్రూరగ్రహాధిష్ఠితనక్షత్రంబునకుఁ బైననక్షత్రము, ధూమితం = ధూమితంబనియు నెఱుంగవలయు, తేషాం=ఆనక్షత్రములయొక్క, క్రూరగతాంశాన్=పాపగ్రహమిళి

తంబులైనయంశములను, సమస్తకార్యేషు = వివాహాది శుభకార్యంబులయందెల్ల, ధీమాన్=బుద్ధిమంతుఁడగువాఁడు, వర్జయేత్ = పరిత్యాగము సేయవలయును.

### మహాపాతదోషము.

యస్మిన్దినే మహాపాత స్తద్దినం పరివర్జయేత్,
అపి సర్వగుణోపేతం దంపత్యోర్మృత్యుదం భవేత్. 378

టీ, యస్మిన్దినే=ఏముహూర్తదినమునందు,మహాపాతః=వైప్రసిద్ధమాదిదోషంబులు గలుగునో, తద్దినం=ఆదినమును, పరివర్జయేత్=త్యజింపవలయు, తత్=ఆమహాపాతపతితమైనదినంబు, సర్వగుణోపేతమపి=సమస్తగుణంబులతోఁగూడినను, దంపత్యోః=జాయాపతులకు, మృత్యుదం=మృతికరంబయినది, భవేత్=అగును,

పరిత్యజ్య మహాదోషాం చ్ఛేషయోర్గుణదోషయోః,
గుణాధికం స్వల్పదోషం సకలం మంగళప్రదమ్. 379

టీ. మహాదోషాన్=ఈచెప్పఁబడినయేకవింశతిమహాదోషంబులును, పరిత్యజ్య=విడిచిపెట్టి, శేషయోః=మిగిలిన,గుణదోషయోః=గుణదోషంబులలోపల, గుణాధికం=గుణములచేత నధికంబయిన, స్వల్పదోషం=అల్పదోషములుగలిగిన, సకలం = సమస్తలగ్నమును, మంగళప్రదం=శుభకరంబు.

### గుళికాయమకంటకార్ధప్రహారకాలనిర్ణయము.

అహః ప్రమాణం వసుభాగితంచ తద్వారనాథే ప్రథమాద్యభాగా,
శేషంషడంశం క్రమవీక్షణీయం శనేస్తుభాగం గుళికాం వదంతి.
శన్యంశో గుళికాజ్ఞేయా గుర్వంశో యమకంటకః,
అర్ధప్రహారస్సౌమ్యాంశ శ్చార్కాంశః కాలసంజ్ఞికః. 381

టీ. అహః ప్రమాణం=పగటియొక్క ప్రమాణము, వసుభాగితంచ=ఎనిమిదింట భాగించఁగా నాయెనిమిదిభాగములలో. ప్రథమాద్యభాగా = ఒకటిరెండుభాగములు, తద్వారనాథే = ఆవారాధిపతియం దగుదున్నవిశేషంషడంశం = మిగిలిన యాఅంశములు, క్రమవీక్షణీయం = వరుసగాఁ జూడఁదగినవి, శనేర్భాగంతు = శన్యంశమును, గుళికాం=గుళికాకాలమునుగా, వదంతి=చెప్పుచున్నారు. ఇదియునుంగాక, శన్యంశః = శనిభాగము, గుళికా = గుళికాకాలంబనియు, గుర్వంశః=గురుభాగము, యమకంటకః=యమకంటకంబనియు, సౌమ్యాంశః= బుధభాగము, అర్ధప్రహారః = అర్ధప్రహారంబనియు, అర్కాంశః = సూర్యాంశము, కాలసంజ్ఞికః = కాలంబనియు, జ్ఞేయః = ఎఱుంగవలయును.

### యాత్రాప్రకరణము.

నందాభిధానా స్తిథయస్తు పూర్వే భద్రాయ భద్రాః కథితా య

మేచ, జయా జయార్థం యది పశ్చిమే చ పూర్ణా ఉదీచ్యాం న
గతం తు రిక్తే. 382

టీ. పూర్వే=ప్రాగ్దిగ్భాగమునందు, నందాభిధానాః = నందలను నామముగల, తిథయస్తు=తిథులును, యమేచ=దక్షిణదిగ్భాగమునందు, భద్రాః = భద్రతిథులును, భద్రాయ=శుభముకొఱకు, కథితాః=చెప్పఁబడినవి. పశ్చిమేచ=పడమటిదిక్కునకు, జయాః=జయతిథులును, ఉదీచ్యాం=ఉత్తరదిగ్యాత్రయందు పూర్ణాశ్చ=పూర్ణతిథులును. జయార్థం=విజయముకొఱకు, కథితాః=పలుకఁబడినవి. రిక్తేషు=రిక్తతిథులయందైతే, నగతం=ఏదిక్కునను గమనము కూడదనుట.

తిథిశూలలు.

ప్రతిపన్నవమీ పూర్వే ద్వితీయాదశము త్తరే,
తృతీయైకాదశీ చాగ్నౌ చతుర్ద్వాదశ నైరృతే. 383
పంచత్రయోదశీ యామ్యే జలే షష్ఠి త్రయోదశీ,
సప్తమీ పూర్ణిమా వాయౌ వమావాస్యాష్టమీ శివే. 384

టీ. పూర్వే=ప్రాగ్దిశయందు, ప్రతిపన్నవమీ=పాడ్యమినవములును, ఉత్తరే=ఉత్తరదిగ్భాగమునందు, ద్వితీయాదశమీచ=విదియదశములును, ఆగ్నౌ = ఆగ్నేయమూలయందు తృతీయైకాదశులును, నైరృతే=నైరృతిమూలయందు, చతుర్ద్వాదశ=చతుర్థీద్వాదశులును, యామ్యే=దక్షిణదిశయందు, పంచత్రయోదశీ=పంచమీత్రయోదశులును, జలే=పడమటియందు, షష్ఠీత్రయోదశీ = షష్ఠీత్రయోదశులును, వాయౌ = వాయవ్యమూలయందు, సప్తమీపూర్ణిమా = సప్తమీపౌర్ణమాస్యలును, శివే=ఈశాన్యమూలయందు, అమావాస్యాష్టమీ=అష్టమ్యమావాస్యలును తిథిశూలలని యెఱుంగునది.

వారశూలలు.

న పూర్వే శనిసోమౌచ నగురుర్దక్షిణే తథా,
న పశ్చాద్భానుశుక్రౌచ నోత్తరే బుధమంగళౌ. 385

టీ. పూర్వే=తూర్పుదిక్కునందు, శనిసోమౌచ=మందేందువారములు రెండును, న=గమనయోగ్యంబులుగావు. తథా=ఆప్రకారమే, దక్షిణే = దక్షిణదిక్కుయందు, నగురుః=గురువాసరము యుక్తంబుగాదు. పశ్చాత్ = పడమటిదిశయందు, భానుశుక్రౌచ=భానుభార్గవవారములు రెండును, న=గమనసమీచీనంబులుగావు. ఉత్తరే=ఉత్తరాపథమునందు, బుధమంగళౌ = సౌమ్యాంగారకవారములు రెండును, న=యాత్రాపాత్రంబులుగాక యొప్పుచుండును. అనఁగా నీశ్లోకోక్తప్రకారంబై యేదిక్కులను

గూర్చి యేయే వారంబులు నిషేధింపఁబడియున్నవో యాయా వారంబులయందు వార శూలాసంజ్ఞికంబైనదోషం బుదయించి గమనప్రతిషేధకం బగుచుండును.

శని ర్గురు శ్చాప్యాగ్నేయే సోమశుక్రౌచ నైరృతే,
కుజాఽదిత్యౌచ వాయవ్యే బుధ ఈశాన్యఏవచ. 386

టీ. ఆగ్నేయే=ఆగ్నేయభాగమునందు, శనిః గురుశ్చాపి=గురుమందవారము లును, నైరృతే=నిరృతిభాగమునందు, సోమశుక్రౌచ=ఇందుభార్గవవారములును, వాయవ్యే = వాయవ్యమూలయందు, కుజాదిత్యౌచ = భాన్వంగారకవారములు రెండును, ఈశాన్య ఏవచ=ఈశాన్యమూలయందును, బుధః = సౌమ్యవారమును, త్యాజ్యాః= గమనవర్జనీయంబులు, అనఁగా నీయీవారము లీయీదిక్కులయందు గమనవిషయమై వారశూలలని యెఱుంగవలయు.

## వారశూలాభంగము

ద్వావింశతిర్గురౌచైవ ద్వాదశేందుజభౌమయోః,
పంచాదశ భృగౌ భానౌ మందేంద్వో శ్చాష్టనాడికాః. 387
వారశూలా ఇమా స్త్యాజ్యా శ్శేషం గమనశోభనమ్,

టీ. గురౌ=గురువారమునాఁడు, ద్వావింశతిః=౨౨ ఘడియలును, ఇందుజభౌమయోః=చంద్రమంగళవారములయందు, ద్వాదశ=౧౨ ఘడియలును, భృగౌ భానౌ చ=భానుభార్గవవారముల రెంటియందు, పంచదశ=౧౫ ఘడియలును, మందేంద్వో శ్చ=ఇందుమందవారముల రెంటియందు,అష్టనాడికాః౮ ఘడియలును, వారశూలాః= వారశూలలను పేరుగలవి. ఇమాః=ఈవారశూలలు, త్యాజ్యాః = యాత్రయందు వర్జింపఁదగినవి. శేషం మిగిలినఘటికలు, గమనశోభనం = ప్రయాణంబునకు శుభ కరంబులగును. అనఁగా నీయీవారములయం దిన్నేసిగడియలను విడిచిపెట్టి మిగిలిన ఘటికలయందు గమనము సేయ శుభంబగును.

## దిగ్వారఫలము

అంగారకే ప్రాగ్గమనంచ లాభ స్సోమే శనౌ దక్షిణ మర్థలాభః,
గురౌబుధేఽవాగ్దిశి కార్యసిద్ధిః రవౌ భృగౌ చోత్తరధాన్యలాభః.

టీ. అంగారకే=మంగళవారమునాఁడు, ప్రాగ్గమనంచ=తూర్పుదెసనుగూర్చి ప్రయాణము చేసిన, లాభః=నవీనవస్తువిస్తారలాభము గలుగును. సోమేశనౌ = ఇందు మందవారములందు, దక్షిణం=యామ్యదిగ్యానంబయ్యె నేని, అర్థలాభః=ధనలాభము గలుగును. బుధే గురౌ = బుధగురువారములందు, అవాగ్దిశి=పశ్చిమదిగ్గమనంబు సేసి తేని, కార్యసిద్ధిః=స్వోద్దిష్టప్రయోజనంబునఫలంబగును. రవౌభృగౌచ=భానుభార్గవ

వారములయందు, ఉత్తరధాన్యలాభః = ఉత్తరదిక్ప్రస్థానం బావటిల్లెనేని ధాన్య లాభంబు గలుగునని తెలియవలయును.

ప్రత్యేకవారఫలము

అర్కే క్లేశ మనర్థకంచ గమనం సోమేచ బంధుప్రియం
భూజాతేఽనలతస్కరజ్వరభయం ప్రాప్తవ్య మర్థం బుధే,
క్షేమారోగ్యమిదం కరోతి ధిషణే శుక్రేచ లాభం స్థిరం
వ్యాధిం భంగమిదం కరోతి సతతం మందే దినే గమ్యతా. 389

టీ. అర్కే=ఆదివారమునాఁడు, గమనం=ప్రయాణము, క్లేశం = కష్టమును, అనర్థకంచ = ప్రయోజనవైఫల్యమును, కరోతి=సేయునది. సోమేచ=ఇందువారమునందు, గమనం=యానము, బంధుప్రియం=బంధువులవలన సమందానందముఁగలుగఁజేయును. భూజాతే=భౌమవారము నందలిగమనము, అనలతస్కరభయం = అగ్నిభయమును చోరభయమును జ్వరభయమును జేయునది. బుధే = బుధవారమునాటి ప్రయాణము, ప్రాప్తవ్యం=పొందఁదగినది, అర్థం=ప్రయోజనము నిచ్చును. ధిషణే=గురువారమునందు, ఇదం=ఈప్రస్థాపనము క్షేమారోగ్యం = క్షేమారోగ్యములను, కరోతి=సేయుచున్నది. శుక్రేచ=భార్గవవారమునందు, స్థిరం=స్థిరంబయిన,లాభం=లాభమును, కరోతి=సేయుచున్నది. మందేదినే = శనివారమునాఁడు, గమ్యతా = గమనము, వ్యాధిం=రోగమును,భంగం=కార్యభ్రంశమును,కరోతి=సేయుచుండును.

వారజనితదోషభంగము

క్షీరంచ భానౌ దధి శీతరశ్మౌకుజేచ మాషాశ్చబుధే చ లాజాః,
జీవేఽపిచాజ్యంభృగుపాయసంచ మందేచ వారే తిలపిష్టమాహుః.

టీ. భానౌ=ఆదివారమునాఁడు, క్షీరంచ=పాలును, శీతరశ్మౌ=సోమవారమునాఁడు, దధి=పెరుఁగును, కుజే=అంగారకవాసరమునందు, మాషాః=మినుములు, బుధేచ=బుధవారమునాఁడు, లాజాః = లాజలను, జీవేచ = గురువారమునాఁడు, ఆజ్యం= నేయియు, భృగుపాయసంచ = శుక్రవారమునాఁడు పాయసమును, మందేవారేచ = శనివారమునాఁడు, తిలపిష్టం=నువ్వుపిండియును దానము సేయఁదగినవియని, ఆహుః=పెద్దలు సెప్పిరి. అనఁగా నీప్రకారం బాయావారంబులకు జెప్పిన దానములు చేసిన వారదోషంబును దొలఁగును.

తిథివిషయముఁనవిశేషము.

ద్వితీయాచ తృతీయాచ పంచమీసప్తమీ తథా,
దశమ్యేకాదశీచైవ యాత్రాసిద్ధిం త్రయోదశీ. 391

కృష్ణేవా యదివా శుక్లే వర్జనీయా చతుర్దశీ,
పౌర్ణమాస్యామమాయాంచ నగంతవ్యం కదాచన. 392

టీ. ద్వితీయాచ=విదియయును,తృతీయాచ=తదియయును, పంచమీ=పంచమియును,తథా=ఆప్రకారము, సప్తమీ=సప్తమియును, దశమీ=దశమియును,ఏకాదశీచైవ=ఏకాదశియును, త్రయోదశీ=త్రయోదశియు, నీయేడుతిథులును,యాత్రాసిద్ధిం=గమనసిద్ధిని, కుర్వంతి=చేయుచున్నవి. యది=విచారింపఁగా,కృష్ణేవా=కృష్ణపక్షమునందైనను, శుక్లేవా=శుక్లపక్షమునందైనను, చతుర్దశీ=చతుర్దశి, వర్జనీయా=గమనమునందు త్యజింపఁదగినది. పౌర్ణమాస్యాం=పున్నమయందును, అమాయాంచ=అమవసయందును, కదాచన=ఒకానొకప్పుడును నగంతవ్యం=గమనము సేయఁగూడదు.

ఇంద్రే దధి యమే తైలం వారుణే గుడమేవచ,
ఉత్తరే క్షీర మాజ్యం చ వారదోషో నవిద్యతే. 393

టీ. ఇంద్రే=తూర్పుదిక్కునుగూర్చి పోవునెడల, దధి = పెరుగును, యమే = దక్షిణదిశయందు, తైలం=నూనెను, వారుణే=పశ్చిమదిగ్యానమునందు, గుడమేవచ=బెల్లమును, ఉత్తరే=ఉత్తరదిక్కుయందు, క్షీరం = పాలును, ఆజ్యంచ = నేతిని, దానము సేయవలయు. నాప్రకారము దానము సేయఁగా. వారదోషః=వారజనితదోషము, నవిద్యతే = లేదనుట.

### ప్రయాణయోగ్యనక్షత్రములు

మృగాశ్వినీపుష్యపునర్వసూచ హస్తానురాధా శ్రవణాని మూలా,
ధనిష్ఠ రేవత్యఖిలేప్రయాణే ఫలం లభేచ్ఛీఘ్రనివర్తనం చ. 394

టీ. మృగాశ్వినీ=మృగశీర్షాశ్వనులును, పుష్యపునర్వసూచ=పుష్యమీపునర్వసులును, హస్తానురాధా శ్రవణాని=హస్తానూరాధా శ్రవణనక్షత్రములును, మూలా=మూలయును, ధనిష్ఠ=ధనిష్ఠయును, రేవతీ = రేవతియును, నీపదితారలును, అఖిలే ప్రయాణే=సకలయాత్రలయందు, శస్తాః=ప్రశస్తంబులైనవి. గాన నీనక్షత్రములయందుగమనముజేసినటులైతే, ఫలం = స్వప్రయోజనఫలమును, శీఘ్రనివర్తనంచ = వేగదిరుగ వచ్చుటయును, లభేత్ = లభించును.

కృత్తికాభరణీసార్పద్విదైవత్యత్రిపూర్వకాః,
రుద్రభం దూషితాశ్చైవ శేషాస్సుర్మధ్యతారకాః. 395

టీ. కృత్తికాభరణీ సార్పద్విదైవత్యత్రిపూర్వకాః=కృత్తికాభరణ్యాశ్రేషా విశాఖ పుబ్బపూర్వాషాఢా పూర్వాభాద్రలును, రుద్రభం=ఆర్ద్రయు, నీయొనిమిది

నక్షత్రంబులు, దూషితాః = నిందింపఁబడినవి. అనఁగా నధమంబులు శేషాః = మిగిలినవి, మధ్యతారకాః = మధ్యమనక్షత్రంబులు, స్యుః = అగుచున్నవి.

ఉత్తమం చాంత్యభంచైవ మధ్యమే మధ్యమే తథా,
ఆద్యం హీనం యథాపాదం తదంశఘటికాస్త్యజేత్. 396

టీ. అంత్యభంచైవ = ప్రయాణయోగ్యంబులైన నక్షత్రంబులలో నాలవ పాదము, ఉత్తమమ్=ఉత్తమంబయినది. తథా = ఆప్రకారము, మధ్యమే=మధ్యమంబులైన తృతీయపాదంబులు, మధ్యమే = మధ్యమంబైనవి, ఆద్యం = మొదటి పాదము, హీనమ్=అధమంబయినది, యథాపాదం=పాదానుక్రమంబు గాకయుండు నటుల, తదంశఘటికాః=ఆయాహీనపాదఘటికలను, త్యజేత్=విడువవలయును.

నక్షత్రశూలలు.

పూర్వేజ్యేష్ఠధనిష్ఠేచ శ్రవణాశ్విని దక్షిణే,
పశ్చిమే పుష్యరోహిణ్యౌ హస్తాఫల్గుని చోత్తరే. 397
ఏతన్నక్షత్రశూలాఖ్యం నయాత్రాపునరాగమః,

టీ. పూర్వే=ప్రాగ్దిశయందు, జ్యేష్ఠేధనిష్ఠేచ = జ్యేష్ఠధనిష్ఠానక్షత్రములును, దక్షిణే=దక్షిణదిక్కునయందు, శ్రవణాశ్విని = శ్రవణాశ్వినీనక్షత్రములును, పశ్చిమే = పడమటికడయందు, పుష్యరోహిణ్యౌ = పుష్యమిరోహిణీనక్షత్రములును, ఉత్తరే=ఉత్తరదిశయందు, హస్తాఫల్గునీచ = హస్తాఫల్గునీనక్షత్రములును నక్షత్రశూలలని యెఱుంగునది. ఏతన్నక్షత్రశూలాయాం=ఈ చెప్పిననక్షత్రశూలలయందు, యాత్రాపునరాగమః = ప్రయాణమైతిరిగివచ్చుట, న=సంభవించదు.

ప్రయాణలగ్నములు.

చరలగ్నేచ గంతవ్యం ద్విస్వభావే సదా నృపైః. 398
లగ్నేస్థిరే న గంతవ్యం యాత్రాయాం క్షేమమిచ్ఛతా,

టీ. యాత్రాయాం = ప్రయాణమునందు, క్షేమమిచ్ఛతా = కుశలము నిచ్ఛయించు పురుషునిచేత, చరలగ్నేచ = చరలగ్నమునందు, గంతవ్యం = పోఁదగినది, ద్విస్వభావే = ద్విస్వభావరాశియందు, సదా = ఎల్లప్పుడు, నృపైః = రాజులచేత, గంతవ్యం=నిర్గమింపఁదగినది, స్థిరేలగ్నే=స్థిరలగ్నమునందు, నగంతవ్యం=ప్రయాణమేఁగఁ దగినది గాదనుట.

దిగీశాః సూర్యశుక్రార రాహ్వార్కీందుజ్ఞసూరయః. 390
దిగీశ్వరే లలాటస్థే యాతుర్న పునరాగమః,

టీ. సూర్యశుక్రారరాహ్వార్కీందుజ్ఞసూరయః = రవిశుక్రాంగారకరాహుమందేందుబుధబృహస్పతులు, దిగీశాః=ప్రాగాదిదిక్పతులగుచుందురు. దిగీశ్వరే = దిశాసా

ఘుండు, లలాటస్థేసతి=లలాటమునందుండఁగా,యాతుః= ప్రయాణముసేయువానికి, నపునరాగమః = పునరాగమనము గలుగ నేరదు. అనఁగా సూర్యశుక్రకుజరాహు శనైశ్చరచంద్రబుధగురువు లీయెనిమిదిగ్రహములును. క్రమంబుగాఁ బ్రాగాదిదిక్కుల కధిపతులై దనర వాదిక్పతులెదురై చూచుచుండగాఁ నాదిక్కునఁ బోరాదు.

లలాటయోగము.

లగ్నస్థో భాస్కరః ప్రాచ్యాం దిశి యాతు ర్లలాటకః. 400
ద్వాదశై కాదశే శుక్ర ఆగ్నేయ్యాంతు లలాటకః,
దశమస్థః కుజో లగ్నా ద్యామ్యాయాంతు లలాటకః. 401
నవమాష్టమగో రాహు ర్నైరృత్యాంతు లలాటకః,
లగ్నా త్సప్తమగ స్సౌరిః ప్రతీచ్యాంతు లలాటకః. 402
షట్పంచమగత శ్చంద్రో వాయవ్యాంతు లలాటకః,
చతుర్థస్థానగ స్సౌమ్య ఉత్తరస్యాం లలాటకః. 403
ద్విత్రిస్థానగతో జీవ ఐశాన్యాం తు లలాటకః,

టీ. భాస్కరః=సూర్యుఁడు, లగ్నస్థః = ప్రయాణలగ్నంబునం గుండెనేని, ప్రాచ్యాందిశి=తూర్పుదిక్కున, యాతుః=ప్రయాణకర్తకు, లలాటకః=లలాటయోగము, శుక్రః=శుక్రుఁడు,ద్వాదశైకాదశే=గమనముహూర్తంబున కేకాదశద్వాదశం, బులయం దుండినట్లైతే, ఆగ్నేయ్యాంతు = ఆగ్నేయమూలయందు, లలాటకః = లలాటయోగము, లగ్నాత్ =యాత్రాముహూర్తంబునకు, కుజః = అంగారకుఁడు, దశమస్థః=పదియవస్థానమునం దుండెనేని, యామ్యాయాంతు=దక్షిణదిక్కునందైతే, లలాటకః = లలాటయోగము, రాహుః = రాహువు, నవమాష్టమగః = ౯, ౮. వ యిండ్ల నున్నట్టులైతే, నైరృత్యాంతు=నిర్ృతిమూలయందైతే, లలాటకః = లలాట యోగము. సౌరిః=శనైశ్చరుఁడు, లగ్నాత్సప్తమగః = ప్రస్థానలగ్నమున్న నేడవ యింటనుండెనేని, ప్రతీచ్యాంతు = పడమరదిక్కుయందు, లలాటకః = లలాట యోగము, చంద్రః = చంద్రుఁడు, షట్పంచమగతః = ౬, ౫. రాసులనొప్పెనేని, వాయవ్యాంతు=వాయవ్యమూలయందు, లలాటకః = లలాటయోగము, సౌమ్యః = బుధుఁడు, చతుర్థస్థానగః = నాలవయింటనుండఁగా, ఉత్తరస్యాం = ఉత్తరదిశ యందు, లలాటకః=లలాటయోగము, జీవః = గురుఁడు ద్విత్రిస్థానగతః=రెండవ మూఁడవస్థానంబుల నుండఁగా, ఐశాన్యాంతు=ఈశాన్యదిక్కుయందు, లలాటకః= లలాటయోగంబు గలుగును. అనఁగా నీదిక్కుల కీయధిపతులు ప్రయాణలగ్నంబున కాయాస్థానంబులయం దుండిరేని యాదిక్కులకు లలాటయోగము సంభవించునట్టి యోగంబునందుఁ బ్రయాణము శుభంబనుట.

శుక్రమౌఢ్యాదిదోషము.

మౌఢ్యే శుక్రే కార్యహానిః ప్రతిశుక్రే పరాజయః. 404
ప్రతీందుజకృతో దోషో హంతి ప్రత్యారమేవచ,

టీ. శుక్రే=శుక్రుడు, మౌఢ్యేసతి=అస్తంగతుఁడగుచుండఁగా,(శుక్రమౌఢ్యమునందు,) కార్యహానిః=ప్రయోజననాశనంబగును. ప్రతిశుక్రే=శుక్రుం డెదురగుచుండఁగా, పరాజయః=పరులవలన నోటమిసంభవించును. ప్రతీందుజకృతః=ప్రతిబుధజాతంబైన దోషః=దోషమును, ప్రత్యారమేవచ=ప్రత్యంగారకదోషమును, హంతి=ప్రయాణకర్తను నశింపజేయును.

ప్రతిశుక్రభంగము.

ఏకగ్రామే చతుశ్శాలే వివాహే యజ్ఞకర్మణి, 405
దుర్భిక్షే రాజకలహే ప్రతిశుక్రం న విద్యతే,

టీ. ఏకగ్రామే=ఒకయూరనగుగృహప్రవేశమునందును, చతుశ్శాలే=చతుశ్శాలయందును, వివాహే=వివాహమునందును, యజ్ఞకర్మణి = యాగమునందును, దుర్భిక్షే=దుర్భిక్షకాలమునందును, రాజకలహే=రాజయుద్ధములయందును, ప్రతిశుక్రం=ఎదురుచుక్కవాలుదోషము, నవిద్యతే=లేదని తెలియవలయును.

త్రికోణకేంద్రగాః సౌమ్యాః క్రూరాస్త్ర్యాయారిగా యది. 406
యాత్రాసిద్ధిర్భవేద్దృష్టే శవే రోదనవర్జితే.

టీ. సౌమ్యాః=శుభగ్రహములు, త్రికోణకేంద్రగాః=కేంద్రకోణములయందుండఁగా, క్రూరాః=పాపగ్రహములు, త్ర్యాయారిగాయది=తృతీయలాభషష్ఠస్థానంబులయందుండఁగాను, రోదనవర్జితే=ఏడుపులేనట్టి, శవే=పీనుఁగు, దృష్టేసతి = ఎదురుపడుచుండఁగా, యాత్రాసిద్ధిః = ప్రయాణసిద్ధి, భవేత్ = అగును,

యాత్రాప్రకరణంబు ముగిసెను.

---

తారాబలము.

జన్మనక్షత్ర మారభ్య నిత్యభాంతంచ గణ్యతే. 407
నవసంఖ్యాహృతం భాగం నవతారాః ప్రకీర్తితాః,

టీ. జన్మనక్షత్రమారభ్య = జన్మనక్షత్రముమొదలుకొని, నిత్యభాంతంచ = నిత్యనక్షత్రపర్యంతమును, గణ్యతే=లెక్కింపఁబడును. ఈఘుణకమును, నవసంఖ్యాహృతం = తొమ్మిదింటభాగింపఁబడినదికాఁగా, భాగం = శేషించినసంఖ్యలు, నవతారాః = తొమ్మిదితారలని, ప్రకీర్తితాః = చెప్పఁబడినవి,

జన్మ సంపద్విపత్ క్షేమ ప్రత్యక్సాధన నైధనమ్. 408
మిత్రం పరమమైత్రంచ నవ తారాః ప్రకీర్తితాః,

టీ. జన్మ=జన్మతారయనియు, సంపత్=సంపత్తారయనియు, విపత్=విపత్తారయనియు, క్షేమప్రత్యక్సాధననైధనం-క్షేమ = క్షేమతార యనియు, ప్రత్యక్ = ప్రత్యక్తారనియు, సాధన = సాధనతారయనియు, నైధనం=నైధనతారయనియు, మిత్రం=మిత్రతారయనియు,పరమమైత్రంచ=పరమమైత్రతారయనియు. నవతారాః =తొమ్మిదితారలు, క్రమేణ జన్మాదిక్రమంబుగా, ప్రకీర్తితాః = చెప్పఁబడినవి.

జన్మభం దేహనాశాయ సంపత్సంపదఏవచ. 409
విపచ్చ కార్యనాశాయ క్షేమం క్షేమకృతే భవేత్,
ప్రత్యక్చ కార్యనాశాయ సాధనం కార్యసాధనే. 410
నైధనం నిధనాయ స్యాన్మిత్రంచ సుఖసంపదే.
సుఖాయ పరమంమైత్రం తారాబల మితి క్రమాత్. 411

టీ. జన్మభం=జన్మతార, దేహనాశాయ = శరీరనాశముకొఱకు, సంపత్ = సంపత్తార, సంపదఏవచ=ఐశ్వర్యముకొఱకును,విపత్=విపత్తార, కార్యనాశాయచ= కార్యనాశనముకొఱకును, క్షేమం = క్షేమతార, క్షేమకృతే = కుశలముకొఱకును, ప్రత్యక్చ=ప్రత్యక్తార, కార్యనాశాయ=ప్రయోజనహానికొఱకును, భవేత్=అగును. సాధనం = సాధనతార, కార్యసాధనే=ప్రయోజనసాధనమునందును, నైధనం = నైధనతార, నిధనాయ = మరణముకొఱకును, మిత్ర=మిత్రతార, సుఖసంపదే = సౌఖ్యసౌభాగ్యముకొఱకును,పరమం మైత్రం=పరమమైత్రతార, సుఖాయ=సుఖముకొఱకును, స్యాత్ = అగును. ఇతిక్రమాత్=ఇత్తెఱంగున, తారాబలం=తారాబలమును, (వింద్యాత్ = ఎఱుంగవలయును.

తారాధిపతులు,

జన్మన్యర్కో హిమకరసుతస్సైంహికేయ స్సురేజ్యః
కేతు శ్చంద్రో దినకరసుతో భార్గవో భూమిపుత్రః,
తాపం లాభం క్షితిధృతిలయాన్కీర్తిహానిప్రమోదా
న్మృత్యుం తారాబల మనుదినం తే దిశంతి క్రమేణ. 412

టీ. జన్మని=జన్మతారయందు, అర్కః=సూర్యుఁడు,హిమకరసుతః=(సంపత్తారకు) బుధుఁడు, సైంహికేయః= (విపత్తారకు) రాహువు, సురేజ్యః (క్షేమతారకు) బృహస్పతి, కేతుః=(ప్రత్యక్తారకు) కేతువు, చంద్రః=(సాధనతారకు) సోముఁడు, దినకరసుతః = (నైధనతారకు) మందుఁడు, భార్గవః= (మిత్రతారకు) శుక్రుఁడు, భూమిపుత్రః = (పరమమైత్రతారకు) కుజుఁడు, వీర అధిపతులగుచుందురు. తే =

ఆయాధిపతులు, క్రమేణ = క్రమంబుగా, తాపం = సంతాపమును, లాభం=ద్రవ్య లాభమును, తుతిధృతిలయాన్=తుతి=నాశనమును, ధృతి=ధైర్యమును, లయాన్= మృతిని, కీర్తిహానిప్రమోదాన్-కీర్తి=యశస్సును, హాని=ప్రయోజననిష్ఫలత్వమును, ప్రమోదాన్ = సంతోషమును, మృత్యుం=మరణమును, అనుదినం=ప్రత్యహమును, దిశంతి = ఇచ్చుచున్నారు.

## తారావాహనములు.

మయూరహయ మేషాశ్చ గజవాయసజంబుకాః
మృగేంద్రో వైనతేయశ్చ హంస స్స్యుర్జన్మ భాదిషు. 413

టీ. జన్మభాదిషు=జన్మతారమొదలైనతారలయందు, మయూరహయమేషాశ్చ - మయూర=నెమలియు, హయ=గుఱ్ఱమును, మేషాశ్చ=మేఁకయును, గజవాయసజంబుకాః-గజ=ఏనుఁగును, వాయస=కాకమును, జంబుకాః=నక్కయును, మృగేంద్రః= సింహమును, వైనతేయశ్చ=గరుత్మంతుఁడును, హంసః=హంసయును, వాహనాని= వాహనములు, స్యుః = క్రమముగా నగును.

## తారావాహనఫలము.

మయూరశ్చ మనస్తాపం హయో లాభార్థసంపదౌ,
మేషస్తు కలహం చైవ రాజ్యప్రాప్తిం గజ స్తథా. 414
వాయసః కార్యనాశం చ జంబుక స్సుఖమేవచ,
సింహో రణభయం చైవ వైనతేయ స్సుఖం బహు. 415
హంసశ్చ కార్యవిభ్రంశం వాహనాదిఫలం లభేత్,

టీ. మయూరశ్చ=నెమలివాహనము, మనస్తాపం=మనస్సంతాపమును,హయః= గుఱ్ఱపువాహనము, లాభార్థసంపదౌ=లాభధనసంపత్తులను, మేషస్తు=మేషవాహనం బైతే, కలహంచైవ=కయ్యమును, తథా=అప్రకారము, గజః=ఏనుఁగువాహనము, రాజ్యప్రాప్తిం = రాజ్యలాభమును, వాయసః = కాకవాహనము, కార్యనాశంచ= కార్యహానిని, జంబుకః = సృగాలవాహనము, సుఖమేవచ=సౌఖ్యమును, సింహః = సింహము, రణభయంచైవ = సంగరభీతిని, వైనతేయః = గరుడవాహనము, బహు సుఖం=విశేషసౌఖ్యమును. హంసశ్చ=హంసవాహనము, కార్యవిభ్రంశం=ప్రయోజనభంగమును, కరోతి=చేయుచుండును. ఏవమ్=ఇవ్విధంబుగా, వాహనాదిఫలం= వాహనాదిఫలమును, లభేత్ = పొందును.

## గ్రంథాంతరమందు.

జన్మర్క్షేస ప్తనాడ్య స్స్యుస్త్రిస్రస్తు విపదిస్మృతాః 416
ప్రత్యగే నైధనే చాష్టౌ నింద్యా శ్శేషా శ్శుభావహాః,

టీ. జన్మర్క్షే=జన్మతారయందు,సప్తనాడ్యః=ఏడుగడియలును,విపది=విపత్తారయందు, తిస్రః = మూఁడుగడియలును, ప్రత్యగే=ప్రత్యక్తారయందు, నైధనేచ= నైధనతారయందును, అష్టౌ=ఎనిమిదిగడియలును, నింద్యాః = నిందింపఁదగినవియై, స్మృతాః = చెప్పఁబడినవి. స్యుః = అగును. శేషాః=మిగిలినఘటికలు, శుభావహాః= మంగళకరంబులు.

జన్మత్రిపంచసప్తాఖ్యాస్తారా నేష్టఫలప్రదాః. 417
తద్దోషపరిహారాయ దద్యాదేత ద్ద్విజాతయే,
శాకం గుడంచ లవణం సతిలం కాంచనం క్రమాత్. 418

విపది ప్రత్యగేచైవ చరమం చాద్యకం వినా,
స్వోచ్చస్వర్క్షగత శ్చంద్ర శ్శుభద స్సర్వకర్మసు. 419

టీ. జన్మత్రిపంచసప్తాఖ్యాః = జన్మవిపత్ప్రత్యక్నైధనంబులనుపేరుగల, తారాః = తారలు, నేష్టఫలప్రదాః=ఇష్టఫలంబుల నిచ్చునవి కావు, తద్దోషపరిహారాయ = అజన్మాది ఏతారాదోషపరిహారార్థమై, ద్విజాతయే = బ్రాహ్మణునికొఱకు, క్రమాత్=క్రమముగా, ఏతత్=ఈచెప్పఁగల, శాకం=శాకమును, గుడంచ=గుడమును, లవణం = ఉప్పును, సతిలం=తిలసహితంబగు, కాంచనం = హిరణ్యమును, దద్యాత్=దానమివ్వవలయు. చరమంచాద్యకం వినా = పరమమైత్ర జన్మతారలు వినాగా,విపది=విపత్తారయందును, ప్రత్యగేచ=ప్రత్యక్తారయందును, స్వోచ్చస్వర్క్షగతః=స్వోచ్చస్వక్షేత్రములయందుండిన, చంద్రః=చంద్రుఁడు, సర్వకర్మసు=సకలశుభకర్మయందు, శుభదః=మంగళప్రదుఁ డగును.

చంద్రబలము.

జన్మానలబ్ధితో సప్తదశమైకాదశే శుభః,
అబ్ధ్యష్టద్వాదశే కృష్ణే శుక్లే ద్వినవపంచమే. 420
యథా మాతా సుతాన్ రక్షే త్తథా రక్షతి చంద్రమాః,

టీ. జన్మానలబ్ధితో = జన్మతృతీయషష్ఠములయందును, సప్తదశమైకాదశే = సప్తమదశమైకాదశములయందును, గతః=పొందిన,చంద్రమాః=చంద్రుఁడు,శుభః= శుభకరుఁడు,కృష్ణే=కృష్ణపక్షమునందు,అబ్ధ్యష్టద్వాదశే=నాలుగు నెనిమిదిపండ్రెండు ఇండ్లనున్న, చన్ద్రమాః=చంద్రుఁడును, శుక్లే=శుక్లపక్షమునందు, ద్వినవపంచమే = ద్వితీయనవమపంచమస్థానములయందు నుండినచంద్రుఁడు, యథా = ఏప్రకారము, మాతా=తల్లి, సుతాన్=కుమారులను, రక్షేత్ = రక్షించునో, తథా=అప్రకారము, రక్షతి = పోషించుచున్నాఁడు.

యాత్రావివాహసీమంత మౌంజీబంధనభుక్తిషు. 421
విద్యారంభే చ తారాయాః ప్రధానం బల మిందువత్,

టీ. యాత్రావివాహసీమంతమౌంజీబంధనభుక్తిషు=ప్రయాణవివాహసీమంతోపనయనాన్నప్రాశనములయందును, విద్యారంభేచ=విద్యారంభమునందును, తారాయాః బలం=తారాబలము, ఇందువత్=చంద్రబలమువలె, ప్రధానం=ముఖ్యము.

## వా స్తు ప్ర క ర ణ ము.

వక్ష్యతే తదను వాస్తులక్షణం పూర్వశాస్త్ర మనుసృత్యయత్నతః.
మూఢదోషరహితేఽథ మాసితత్ప్రారభేత సుదినే శుభోదయే,

టీ. తదను=అనంతరము, పూర్వశాస్త్రం=ప్రథమశాస్త్రమును, అనుసృత్య=అనుసరించి, యత్నతః=ప్రయత్నపూర్వకముగా, వాస్తులక్షణం=గృహనిర్మాణము, వక్ష్యతే=చెప్పఁబడుచున్నది. అథ=పిమ్మట, మూఢదోషరహితే = గురుశుక్రమౌఢ్య దోషంబులేని, మాసి=మాసమునందును, సుదినే=పంచాంగశుద్ధదినమునందలి, శుభోదయే = శుభలగ్నమునందును, తత్ = ఆగృహనిర్మాణమును, ప్రారభేత = ఆరంభింపవలయును.

గృహసంస్థాపనం చైత్రే ధనలాభశుభప్రదమ్. 423
వైశాఖేతు శుభం విద్యా జ్జ్యేష్ఠేతు మరణం ధ్రువమ్,
ఆషాఢే గోకులం హంతి శ్రావణే భృత్యవర్ధనమ్. 424
భాద్రపదే రోగపీడాపి చాశ్వినే కలహం తథా,
కార్తిక్యాం ధనలాభ స్స్యా న్మార్గశీర్షే ధనక్షయః. 425
పుష్యే చాగ్నిభయం నిత్యం మాఘేతు బహుపుత్రదమ్,
ఫాల్గునే తనునాశ స్స్యాన్మాసానాంచ ఫలాఫలమ్. 426

టీ. చైత్రే=చైత్రమాసమునందు, గృహసంస్థాపనం=గృహనిర్మాణారంభము, ధనలాభశుభప్రదం=ధనప్రాప్తిరూపంబయిన, శుభమునిచ్చునది. వైశాఖేతు=వైశాఖమాసమునందైతే, శుభం=శుభమును, విద్యాత్ = తెలియవలయును. జ్యేష్ఠేతు=జ్యేష్ఠమాసమునందు, మరణం=మృతి, ధ్రువం=నిశ్చయముగాఁ గలుగును. ఆషాఢే=ఆషాఢమాసమునందు, గృహసంస్థాపనం = గృహారంభము, గోకులం=గోసమూహమును, హంతి=కొట్టుచున్నది. శ్రావణే=శ్రావణమాసమునందు, భృత్యవర్ధనం = పరిచారకజనసమృద్ధియు, భాద్రపదే=భాద్రపదమాసమునందు, రోగపీడాపిచ = వ్యాధిబాధయును, తథా=ఆప్రకారము, అశ్వినే = ఆశ్వయుజమాసమునందు, కలహం=కయ్యమును. కార్తిక్యాం=కార్తికమాసమునందు, ధనలాభః=ధనలాభమును, స్యాత్ = ఆగును. మార్గశీర్షే=మార్గశీర్షమాసమునందు, అగ్నిభయం=అగ్నిభీతియును, మాఘేతు=

=మాఘమాసమునందైతే, బహుపుత్రకం = అనేకపుత్రప్రాప్తియును, ఫాల్గునేచ= ఫాల్గునమాసమునందు, తనునాశః = శరీరనాశనమును, స్యాత్ =అగును. మాసానాంచ =చైత్రాదిద్వాదశమాసములయొక్క. ఫలాఫలం=శుభాశుభఫలము గలుగుచుండును. అనఁగా నీమాసములయందు నూతన గృహారంభము చేసిరేని యాయాఫలంబులులబ్ధంబులగును.

గో కర్కి హరి కుంభాజతౌలికీటమృగస్థితే,
దివాకరే గృహారంభః పుత్రపౌత్రాభివృద్ధిదః. 427

టీ. దివాకరే=సూర్యుఁడు, గోకర్కిహరికుంభాజతౌలికీటమృగస్థితేసతి = వృషభ కటక సింహ కుంభ మేష తులా వృశ్చిక మకరరాసులయందుండఁగా, గృహారంభః = నూతన గృహారంభము, పుత్రపౌత్రాభివృద్ధిదః = పుత్రపౌత్రసంతానాభివృద్ధినిఁగలుగఁజేయునది.

స్థిరరాశిగతే సూర్యే గృహకర్మ సుశోభనమ్,
చరేతు మధ్యమం విద్యాత్ ద్విస్వభావేతు నిందితమ్. 428

టీ. సూర్యే=సూర్యుఁడు,స్థిరరాశిగతేసతి = స్థిరరాసులఁబొంది యుండఁగా, గృహ కర్మ=నవీనగృహనిర్మాణము, సుశోభనం = మిక్కిలి శుభకరంబు. చరేషు = చరలగ్నమునందైతే, మధ్యమం=మధ్యమఫలప్రదంబనియు, ద్విస్వభావేషు=ద్విస్వభావరాశియందైతే, నిందితం=నిందింపఁబడునదియనియు, వింద్యాత్ = తెలియవలయును. అనఁగా గృహనిర్మాణవిషయమై స్థిరరాసు లుత్తమంబులు, చరరాసులు మధ్యమంబులు, ద్విస్వభావరాసులధమంబులు.

గురుభార్గవయోర్మాఘ్యే బాల్యవార్ధకయోరపి,
చాతుర్మాస్యాం శూన్యమాసే గృహకర్మ న కారయేత్. 429

టీ. గురుభార్గవయోః =గురుశుక్రులయొక్క, మాఘ్యే=మాఘ్యంబునందును, బాల్యవార్ధకయోరపి=శిశుత్వ వృద్ధత్వములయందును, చాతుర్మాస్యాం = చాతుర్మాసములయందును, శూన్యమాసే = శూన్యమాసమునందును, గృహకర్మ = గృహనిర్మాణకృత్యమును, నకారయేత్ =చేయ నొప్పిదంబు గాదు.

గృహద్వారనిర్ణయము.

సింహేఽర్కే పశ్చిమే ద్వారం వృషభే చోత్తరే తథా,
కుంభే పూర్వదిశే ద్వారం వృశ్చికే చైవ దక్షిణే. 430
ఏవం కృతం చేత్తద్వేశ్మ శోభనం సౌఖ్యవర్ధనమ్,

టీ. అర్కే=సూర్యుఁడు, సింహే=సింహమందుండఁగా, పశ్చిమే=పడమరదిశ యందు ద్వారం=ద్వారమును, తథా=ఆప్రకారము, వృషభేచ=సూర్యుఁడువృషభరాశి యందుండఁగా, ఉత్తరే=ఉత్తరదిగ్భాగమునందును, కుంభే = కుంభరాశిగతుఁడై యుండగా, పూర్వదిశి=తూర్పుదిశయందును, వృశ్చికేచైవ=వృశ్చికమునందుండఁగా, దక్షిణే=దక్షిణ దిక్కునందును, ద్వారం=ద్వారము నుంచవలయును. ఏవం=ఇవ్విధం బుగా, కృతంచేత్ = ద్వారము నిర్మింపఁబడెనేని, తద్వేశ్మ=ఆయిల్లు, శోభనం = శుభకరమును, సౌఖ్యవర్ధనం = సుఖాభివృద్ధికరంబు నగును.

మృగేఽర్కే పశ్చిమద్వారం తులాయాం చోత్తరం కృతమ్. 431
కర్కటస్థే పురోద్వారం మేషస్థే దక్షిణం స్మృతమ్,
ఏవం కృతే తు తద్వేశ్మ మధ్యమం పరికీర్తితమ్. 432

టీ. అర్కే=సూర్యుఁడు, మృగే = మకరమందుండఁగా, పశ్చిమద్వారం = పశ్చిమదిశాభిముఖంబైనద్వారమును, తులాయాంచ=తులారాశినధిష్ఠించుచుండఁగా, ఉత్తరం=ఉత్తరద్వారమును, కర్కటస్థేసతి=కటకమునందుండఁగా, పురోద్వారం= ప్రాగ్ద్వారమును, మేషస్థే=మేషరాశినుండఁగా, దక్షిణం=దక్షిణద్వారమును, స్మృతం= స్మరింపఁబడుచున్నవి. ఏవం = ఈప్రకారము, కృతేసతి = ద్వారము సేయఁబడు చుండఁగా, తద్వేశ్మ=అట్టిద్వారయుతంబైనగృహము, మధ్యమం=మధ్యమఫలప్రదం బని, పరికీర్తితం = చెప్పఁబడినది.

నక్షత్రములు.

ఉత్తరాత్రితయం చిత్రా రోహిణీ స్వాతిరేవ చ,
జ్యేష్ఠా మృగశిరో మూలా చాశ్వినీ హస్తపుష్యకాః. 433
మైత్రం చైతే ప్రశస్తాహి సర్వదా వాస్తుకర్మణి,

టీ. ఉత్తరాత్రితయం=ఉత్తరోత్తరాషాఢోత్తరాభాద్రలను, చిత్రా=చిత్రా నక్షత్రమును, రోహిణీ=రోహిణియు, స్వాతిరేవచ=స్వాతియును, జ్యేష్ఠా=జ్యేష్ఠా నక్షత్రమును, మృగశిరః=మృగశీర్షయును, మూలాచ = మూలయును, అశ్వినీహస్త పుష్యకాః=అశ్వినీహస్తపుష్యములును, మైత్రంచ=అనూరాధయును, తే = ఈనక్ష త్రములు, వాస్తుకర్మణి=గృహవాస్తుకర్మయందు, సర్వదా=ఎల్లప్పుడును, ప్రశస్తా హి = యోగ్యమైనవి గదా.

వాసిష్ఠమందు.

రోహిణీమృగ చిత్రాఽర్క వాసవోత్తరవైశ్వభమ్. 434
శ్రవణం చైవ భాన్యష్టౌ శస్తాని గృహకర్మణి.

టీ. రోహిణ్యశ్విమృగచిత్రార్క వాసవోత్తరవైశ్వభం=రోహిణీమృగశిర చిత్రహస్త శ్రేష్ఠ ఉత్తరఫల్గున్యుత్తరాషాఢలును, శ్రవణంచ=శ్రవణమును, అష్టౌ=ఈయెనిమిది నక్షత్రములును, గృహకర్మణి=గృహకర్మయందు, శస్తాన్యేవ=ప్రశస్తములయినవే.

స్వాతీపుష్యానురాధాశ్వి శతాహిర్బుధ్న్యపౌష్ణభమ్,
సప్తమధ్యఫలాన్యత్ర శేషాణి పరివర్జయేత్. 435

టీ. స్వాతీపుష్యానురాధాశ్వి శతాహిర్బుధ్న్యపౌష్ణభం = స్వాతి పుష్యమి అనూరాధ అశ్విని శతభిష ఉత్తరాభాద్ర రేవతులును, సప్త = ఈయేడునక్షత్రములును, అత్ర=ఈవాస్తుకర్మయందలి, మధ్యముఫలాని = మధ్యమఫలము నిచ్చునవి, స్యుః=అగును. శేషాణి=తక్కిననక్షత్రములను, పరివర్జయేత్=విడిచిపెట్టవలయును.

యోగములు.

పరిఘస్యచ పూర్వార్ధం కృత్స్నం వైధృతిపాతయోః,
గండాతిగండయోష్షట్చ నాడికాః పంచ శూలకే. 436

టీ. పరిఘస్య=పరిఘనామయోగముయొక్క, పూర్వార్ధంచ = మొదటిసగమును, వైధృతిపాతయోః=వైధృతివ్యతీపాతలయొక్క, కృత్స్నం = యావత్తును, గండాతిగండయోః=గండాతిగండనామయోగములయొక్క, షట్ నాడికాశ్చ = ఆఱుగడియలును, శూలకే=శూలానామయోగమందు, పంచ = అయిదుగడియలును, వర్జనీయాః = విడిచిపెట్టఁదగినవి.

వ్యాఘాతే నవ నాడీశ్చ వాస్తుకర్మణి వర్జయేత్,
నింద్యయోగేషు సర్వేషు విష్ట్యాం సర్వం వివర్జయేత్. 437

టీ. వ్యాఘాతే = వ్యాఘాతనామయోగమందు, నవనాడీశ్చ = తొమ్మిదిగడియలను, సర్వేషు = సమస్తములైనటువంటి, నింద్యయోగేషు = నిందింపఁదగిన యోగములయందు, సర్వం = సమస్తమును, విష్ట్యాం = భద్రాకరణమందు, సర్వం చ = సమస్తమును, వివర్జయేత్ = విడిచిపెట్టఁదగినవి.

లగ్నములు.

ద్వ్యంగజే స్థిరేవా భవనే విలగ్నే సౌమ్యగ్రహైర్యుక్తనిరీక్షితేవా,
కర్మస్థితైర్వీర్యయుతైశ్చసౌమ్యైర్నిర్మాణమాహుర్గృహవస్తుసంతః.

టీ. సౌమ్యగ్రహైః=శుభగ్రహములచేత, యుక్తనిరీక్షితేవా=కూడఁబడినదియు చూడఁబడినదియు, అథవా=అలాగుగాకపోతే, వీర్యయుతైః=పద్బలములతోఁగూడిన, కర్మస్థితైః=దశమస్థానమందున్న, సౌమ్యైః=శుభగ్రహములచే నైనబలము

గల, ద్వ్యక్షైర్భవనే=ద్విస్వభావలగ్నమందుకాని, స్థిరేవాపిలగ్నే = స్థిరలగ్నమందు కాని గృహస్య=గృహముయొక్క, నిర్మాణం = ఆరంభమును, సంతః = సత్పురుషులు, ఆహుః = చెప్పుచున్నారు.

పాపైస్త్రిషష్ఠాయగతైస్త్రికోణగైః కేంద్రాశ్రితైస్సాధుభి రాల
యస్య. వదంతి నిర్మాణమిహాష్టమస్థః క్రూరస్తు కర్తుర్మరణం కరోతి.

టీ. త్రిషష్ఠాయగతైః = మూఁడు ఆఱు పదునొకొండుస్థానములను బొందినట్టి, పాపైః = పాపగ్రహములచేతను, కేంద్రాశ్రితైః = కేంద్రములనుపొందినట్టి, త్రికోణగైః = పంచమనవమములనుపొందిన, సాధుభిః = శుభగ్రహములచేతను, ఆలయస్య = గృహముయొక్క, నిర్మాణం = ఆరంభమును, సంతః = సత్పురుషులు, వదంతి = చెప్పుచున్నారు. ఇహ = ఈ వాస్తుప్రకరణమునందు, అష్టమస్థః = ఎనిమిదవస్థానమునందున్నట్టి, క్రూరస్తు = పాపగ్రహమైతే, కర్తుః=గృహకర్తయొక్క, మరణం = మరణమును, కరోతి = చేయుచున్నది.

ఋక్షం ప్రజాపతేశ్ఛాద్యం తల్లగ్నే వేశ్మకం శుభమ్,
తన్నక్షత్రే విశేద్గేహం శుభం శంసన్తి సూరయః. 440

టీ. ప్రజాపతేః=బ్రహ్మదేవతాకమైన, ఋక్షమ్ = నక్షత్రము, ఛాద్యమ్ = కప్పు కప్పుటకు తగినది. తల్లగ్నే = ఆవృషభలగ్నంబున, వేశ్మకం = వెన్నుగాడి, శుభమ్=శుభప్రదమైనది. తన్నక్షత్రే = ఆరోహిణీనక్షత్రమునందు, గేహం=గృహమునుగుఱించి, విశేత్ = ప్రవేశింపఁదగినది. ఇతి=ఈలాగున, సూరయః=విద్వాంసులు, శుభమితి = శుభంబని, శంసంతి=చెప్పుచున్నారు.

స్తమ్భం చన్ద్రోదయే స్థాప్యం వేశ్మారోహం బుధోదయే,
శుక్రోదయేతు సంఛాద్యం న చాగ్నిభయమాప్నుయాత్. 441

టీ. చన్ద్రోదయే=చంద్రలగ్నంబున, స్తంభం = శంకువు, స్థాప్యం=నాటఁదగినది. బుధోదయే = బుధలగ్నంబున, వేశ్మారోహం = వాసపోయుట శుభం = శుభప్రదమైనది. శుక్రోదయే=శుక్రలగ్నంబున, సంఛాద్యం=కప్పుకప్పుట, శుభం = శుభప్రదమైనది. ఏవంచేత్ = ఈలాగునైనచో, అగ్నిభయం = అగ్నిభయమును, నాప్నుయాత్ = పొందరు.

త్రికోణకేన్ద్రగాస్సౌమ్యాః పాపాస్త్ర్యాయారిగాస్తథా,
గృహప్రాగల్భ్యలగ్నోత్థదోషాన్ ఘ్నన్తి నసంశయః. 442

టీ. త్రికోణకేన్ద్రగాః = త్రికోణకేంద్రములనుఁబొందిన, సౌమ్యాః = శుభగ్రహంబులును, తథా=ఆప్రకారంబుగ, త్ర్యాయారిగాః=మూఁడు పదునొకండు ఆఱు

స్థానము-ను బొందిన, పాపాః=పాపగ్రహంబులును, గృహప్రారంభలగ్నోత్థదోషాణ్ =గృహారంభలగ్నమువలనఁ బుట్టినదోషములును, ఘ్నన్తి = పోఁగొట్టుచున్నారు. నసంశయః = సంశయములేదు.

గురౌవా భార్గవే వాపి చన్ద్రేణ సహ లగ్నగే,
తత్ర స్థాపితం వేశ్మ వహ్నినా చ న బాధ్యతే. 443

టీ. చన్ద్రేణసహ=చంద్రునితోఁడ, గురౌవా = బృహస్పతియైనను, భార్గవే వాపి=శుక్రుండైనను, లగ్నగేసతి = లగ్నంబును బొందినవాఁ డగుచునుండఁగా, తత్ర = అట్టిసమయంబున, సంస్థాపితం=ప్రారంభింపఁబడిన, వేశ్మ=ఇల్లు, వహ్నినా= అగ్నిచేత, నచబాధ్యతే = దహింపఁబడదు.

భృగౌ లగ్నగతే జీవే మధ్యాహ్నేఽస్తమయే సతి,
గృహసంస్థాపనం యోగ్య మాయుష్యం చ శతాబ్దకమ్. 444

టీ. భృగౌవా=శుక్రుఁడైనను, జీవేవా=గురువైనను, లగ్నగతేసతి=లగ్నమును బొందినవాఁడగుచునుండఁగా, బుధే=బుధుఁడు, మధ్యాహ్నే=మాధ్యాహ్నికలగ్నంబునను, అస్తమయే=గోధూళికలగ్నంబునను, సతి = ఉన్నవాఁడగుచునుండఁగాను, గృహసంస్థాపనం=గృహారంభము యోగ్యం=యుక్తంబైనది. ఆయుష్యంచ=గృహాయువును, శతాబ్దకం=నూఱువర్షములమితమైనది, భవేత్ = అగును.

## గృహప్రవేశవిషయము

అథ ప్రవేశో నవమందిరస్య సౌమ్యాయనే జీవసితౌ బలాఢ్యౌ,
సితేచ పక్షే శుభవాసరేచ వాస్త్వర్చనం భూతబలించకుర్యాత్.

టీ. శుభవాసరే=శుభగ్రహవారమందును శుభదినమందును, సితేపక్షేచ=శుక్లపక్షమందును, జీవసితౌ=బృహస్పతిశుక్రులు, బలాఢ్యౌ=బలయుక్తులై యుండగాను, (అనఁగా మౌఢ్యబాల్యవార్ధక్యావస్థలును లేకుండవలెననుట.) సౌమ్యాయనే=ఉత్తరాయణమందు, నవమందిరస్య=నూతనగృహముయొక్క, ప్రవేశః=ప్రవేశము, శుభః= శుభప్రదమైనది. అథ=అటుతర్వాతను, వాస్త్వర్చనం-వాస్తు=వాస్తుపురుషునియొక్క, అర్చనం=పూజయును, భూతబలించ=భూతబలిని, కుర్యాత్=చేయవలయును.

మాఘఫాల్గునవైశాఖ జ్యేష్ఠమాసాశ్శుభప్రదాః,
సహ ఊర్జశ్చ విజ్ఞేయౌ మధ్యమౌ తు ప్రవేశనే. 446

టీ. మాఘఫాల్గునవైశాఖజ్యేష్ఠమాసాః=ఈమాసములు, శుభప్రదాః=శుభము నిచ్చునవి, భవంతి=అగుచున్నవి, సహఊర్జశ్చ=మార్గశీర్ష కార్తికమాసములు, ప్రవే

శనే = గృహప్రవేశమందు, మధ్యమా = మధ్యమఫలమునిచ్చునట్టివిగా, జ్ఞేయా = తెలుసుకొనఁదగినవి, భవతః = అవుచున్నవి.

వ్యర్కార్కిరవారే తిథిషు రిక్తామావర్జితాసుచ,
దివావా యదివా రాత్రౌ ప్రవేశో మంగళప్రదః. 447

టీ. వ్యర్కార్కిరవారే=భానుభౌమవారములనువిడిచిగురుశుక్రశనిబుధసోమవారములయందును, రిక్తామావర్జితాసుచ=చతుర్థినవమిచతుర్దశి అమావాస్యలచే విడువఁబడినట్టి, తిథిషుచ=దినములయందు, దివావా=పగటియందేకాని, రాత్రౌవా=రాత్రియందేకాని, ప్రవేశః=నూతనగృహప్రవేశము, మంగళప్రదః=శుభమునిచ్చునట్టిది, భవతి = అవుచున్నది.

చంద్రజీవబుధశుక్రవాసరే శ్రీకరస్సుతమహార్థలాభదః,
సూర్యసూనుదివసే స్థిరప్రదః కింతు చోరభయమత్ర విద్యతే.

టీ. చంద్రజీవబుధశుక్రవాసరే=సోమగురుబుధశుక్రవారములయందు, గృహప్రవేశః=నూతనగృహప్రవేశము, శ్రీకరః = సంపదను జేయునట్టియు, సుతమహార్థలాభదః-సుత=పుత్రులయొక్కయు, మహార్థ=అధికధనముయొక్కయు, లాభదః = లాభమునిచ్చునట్టిది, భవతి = అవుచున్నది. సూర్యసూనుదివసే = శనివారమునందు, గృహప్రవేశః = గృహప్రవేశము, స్థిరప్రదః = స్థైర్యమునిచ్చునట్టిది, భవతి=అవుచున్నది. కింతు = అయితే, అత్ర = ఈశనివారమునందు, చోరభయం = దొంగలభయము, విద్యతే = కలదు.

రిక్తావమాదగ్ధతిథిర్దినేశభూసూనుషడ్వర్గమినేందుదృష్టమ్,
క్రూరగ్రహాధిష్ఠితవిద్ధభంచ భం వర్జనీయం త్రివిధం ప్రవేశే. 449

టీ. రిక్తావమాదగ్ధతిథిః-రిక్త = చతుర్థి నవమి చతుర్దశులును, అవమా = దినత్రయమును, దగ్ధతిథిః = శూన్యతిథులును, దినేశభూసూనుషడ్వర్గం = సూర్యాంగారకషడ్వర్గమును, ఇనేందుదృష్టం = సూర్యచంద్రులచేతఁ జూడఁబడినదియు, క్రూరగ్రహాధిష్ఠితవిద్ధభం=పాపగ్రహములున్నట్టియు, ప్రవేశింపఁబోవునట్టి, భంచ=నక్షత్రమును, త్రివిధంభం = ఈలాటితిథిషడ్వర్గనక్షత్రములు, ప్రవేశే = గృహప్రవేశమందు, వర్జనీయం = విడిచిపెట్టఁదగినవి.

రోహిణ్యాం త్రిషు చోత్తరాసు శుభదో గేహప్రవేశో నవః
పౌష్ణే వాసవమిత్రయోశ్చ విహితస్స్వస్మిన్పురాణే గృహే,
ఆద్యే హస్తహరిజ్యభే నవగృహేఽశస్తః పురాణే తథా
కుంభే కర్కిణి భాస్కరేచ యుతౌ నింద్యః ప్రవేశో గృహే.

టీ. రోహిణ్యాం=రోహిణియందును, త్రిషు=మూఁడైన, ఉత్తరాసు=ఉత్తరోత్త

రాషాఢోత్తరాభాద్రలయందును, నవః=నూతనమైన, గేహప్రవేశః = గృహప్రవేశము, శుభః=శుభప్రదమైనది. పౌష్ణే=రేవతియందును, వాసవమిత్రయోశ్చ-వాసవ=జ్యేష్ఠయందును, మిత్రయోశ్చ=అనూరాధయందును, పురాణే=పాతదియైనట్టి, స్వస్మిన్గృహే=తనగృహమందు, ప్రవేశః=ప్రవేశము, విహితః=యుక్తమైనది. ఆద్యే = అశ్వినియందును, హస్తహరీజ్యభే = హస్తశ్రవణపుష్యములయందు, నవగృహే = నూతనగృహమందు, ప్రవేశః=ప్రవేశము, అశస్తః = మంచిదికాదు. తథా=అలాగు నచే, పురాణేచ=పాతయింటిలోను, అశస్తః=మంచిదికాదు. భాస్కరే=సూర్యుడు, కుంభే=కుంభరాశియందును, కర్కిణి=కర్కటరాశియందును, యువతౌచ=కన్యారాశియందున్నవాడౌచునుండగా, గృహే=గృహమందు, ప్రవేశః=ప్రవేశము, నింద్యః = నిందింపదగినది.

అర్కానిలార్యదితిద స్రవిష్ణుకుక్షి ప్రవిష్టం నవమందిరం యత్, అబ్ద
త్రయాత్తత్పరహస్తయాతం శేషేషుధిష్ణ్యేషుచమృత్యుదంస్యాత్.

టీ. అర్కానిలార్యాదితిదస్రవిష్ణుకుక్షిప్రవిష్టం = హస్తస్వాతి పుష్యపునర్వస్వశ్వినిశ్రవణములందు ప్రవేశించినటి, యత్ =ఏ, నవమందిరం=క్రొత్తయిల్లుగలదో తత్ =అది, అబ్దత్రయాత్ = మూడేండ్లపైనను, పరహస్తయాతం = పరులచేజిక్కును. శేషేషు = తక్కిన, ధిష్ణ్యేషుచ=నక్షత్రములయందును, మృత్యుదం=మృత్యుప్రదమైనది, స్యాత్ = అగుచున్నది.

స్థిరవారుణమైత్రేందుత్వాష్ట్ర పౌష్ణవసూడుషు,
ప్రవేశశ్శ్రీకరో జ్యేష్ఠ పుష్యర్క్షే మధ్యమస్స్మృతః. 452

టీ. స్థిరవారుణమైత్రేందుత్వాష్ట్రపౌష్ణవసూడుషు = రోహిణ్యుత్తరాత్రయ పూర్వాషాఢానూరాధమృగశిరచిత్తరేవతి ధనిష్ఠలయందు, ప్రవేశః=గృహప్రవేశము, శ్రీకరః=సంపదనుజేయునట్టిది, స్యాత్ =అగుచున్నది. జ్యేష్ఠపుష్యర్క్షే=జ్యేష్ఠపుష్య నక్షత్రములయందు, ప్రవేశః=గృహప్రవేశము, మధ్యమః = మధ్యమమైనదిగాను, స్మృతః= చెప్పఁబడినది.

కేంద్రేషుసౌమ్యే గురుశుక్రలగ్నే
పాపేషు కేంద్రాష్టమవర్జితేషు,
గ్రామే స్థిరేవాథ వనే పిలగ్నే
గృహం విశేచ్ఛీతకరేఽనుకూలే. 453

టీ. కేంద్రేషు=లగ్నచతుర్థ సప్తమ దశమములయందు, సౌమ్యే=శుభగ్రహము, స్థితేసతి=ఉన్నవాడౌచుండఁగాను, పాపేషు = పాపగ్రహములు, కేంద్రాష్టమవర్జితేషు=కేంద్రములయందు నష్టమమందును, లేకపోవుచుండఁగాను, గురుశుక్రలగ్నే=

తులాకృపభధనుర్మీనములలోనొకలగ్నమందును,అథవా=అట్లుగాదేని,స్థిరేవిలగ్నే=స్థిరలగ్నమందును, శీతకరే=చంద్రుఁడు, అనుకూలేసతి = బలవంతుఁడైయుండఁగా, గ్రామే=గ్రామమందును, వనేవా=తోఁటయందుగాని, గృహం=గృహమును,విశేత్=ప్రవేశింపవలయును.

జన్మభే జన్మలగ్నే వా తాభ్యాముపచయేఽపి వా,
ప్రవేశః పుత్రధనదస్త్వన్యథా శోకహానిదః. 454
వ్యాధిసాధనదశ్చైవావిత్తదో బంధునాశకః,
సుతహాఽశత్రుహా స్త్రీఘ్నః ప్రాణహా పీడనప్రదః. 455

టీ. జన్మభే=జన్మనక్షత్రమందేని, జన్మలగ్నేవా=జన్మలగ్నమందేని. తాభ్యాం=ఆరెంటికంటె. ఉపచయేపివా=మూఁడాఱు పది పదునొకొండింటనేని, ప్రవేశః = గృహప్రవేశము, పుత్రధనదః=సంతానమును ధనము నిచ్చునట్టిది, భవేత్=అగును. అన్యథా = జన్మనక్షత్రలగ్నములకు మఱియొక నక్షత్రలగ్నముల యందైతే, శోకహానిదః = దుఃఖమును కీడును నిచ్చునదియు, వ్యాధిసాధనదశ్చైవ = రోగాస్పదమైనట్టిదియు అవిత్తదః=దారిద్ర్యము నిచ్చునట్టిదియు, బంధునాశకః = చుట్టములను నశింపఁజేయునట్టిదియు, సుతహా = సంతానహాని సేయునట్టిదియు, అశత్రుహా = మిత్రహాని చేయునట్టిదియు, స్త్రీఘ్నః=కళత్రహాని సేయునట్టిదియు, ప్రాణహా = మృత్యుప్రదమైనదియు, పీడనప్రదః = కీడు సేయునట్టిదియు నౌను.

సిద్ధికృద్ధనకృచ్చైవాభయకృజ్జన్మరాశితః,

టీ. జన్మరాశితః=జన్మరాశియందలి గృహప్రవేశము, సిద్ధికృత్=సకలకార్యసిద్ధి సేయునట్టిదియు, ధనకృత్ = ధనమును జేయునట్టిదియు, అభయకృత్=భయనాశనమును జేయునట్టిదియు, భవేత్ = అగును.

అకవాటమనాచ్ఛన్నమదత్తబలిభోజనమ్. 456
గృహం న ప్రవిశేదేవం విపదామాకరం హి తత్,

టీ. అకవాటం=తలుపులులేనిదియు, అదత్తబలిభోజనం = బలిహరణబ్రాహ్మణభోజనములు సేయకున్నదియు, అనాచ్ఛన్నం = పైకప్పులేనిదియునగు, గృహం = గృహమును, నప్రవిశేత్=ప్రవేశింపఁగూడదు. ఏవం=ఈప్రకారముగాఁ బ్రవేశించెనేని, తత్ = ఆమందిరము, విపదాం=ఆపత్తులకు, ఆకరంహి = స్థానమేకదా.

ఇతి గృహప్రవేశవిషయము.

---

కూపారంభవిషయము.

రేవత్యుత్తరభాద్రా చ హస్తమైత్రే పితా తథా. 457
బ్రహ్మే తిష్యం చ శ్రవణం కూపారంభే ప్రశస్యతే,

టీ. రేవతీ = రేవతియును, ఉత్తరభాద్రాచ = ఉత్తరభాద్రయును, హస్తమైత్రే=హస్తానూరాధలును, పితా=మఘయును, బ్రహ్మే=రోహిణియును, తిష్యంచ=పుష్యమియును, శ్రవణం = శ్రవణమును, కూపారంభే = బావిత్రవ్వుటయందు, ప్రశస్యతే = ప్రశంసింపఁబడుచున్నది.

మత్స్యే కుళీరే మకరే బహూదకం
కుంభే వృషే చార్ధజలప్రమాణమ్,
అళ్యాంచ తౌళ్యాం మిథునేచ పాదం
శేషే తు రాశౌ జలనాశనం చ. 458

టీ. మత్స్యే=మీనరాశియందును, కుళీరే = కర్కాటరాశియందును, మకరే= మకరరాశియందును, బహూదకం = పూర్ణజలము, అనఁగా నివి పూర్ణజలరాసులనుట. కుంభే = కుంభరాశియందును, వృషేచ = వృషభరాశియందును, అర్ధజలప్రమాణం = అర్ధజలము; ఇవి యర్ధజలరాసు లనుట. అళ్యాం=వృశ్చికమందును, తౌళ్యాం = తులయందును, మిథునేచ = మిథునరాశియందును, పాదం = పాదజలము, ఇవి పాదజలరాసు లనుట. శేషే = తక్కిన, రాశౌ = రాసులయందు, జలనాశనం = ఉదకాభావము. ఇవి నిర్జలరాసు లనుట.

కేంద్రేషు పాపయుక్తేషు కృచ్ఛ్రేణాపి న సిధ్యతి,
చన్ద్రశుక్రయుతే కేన్ద్రే పర్వతేచ జలం భవేత్. 459

టీ. కేంద్రేషు = కేంద్రములు, పాపయుక్తేషు = పాపులతోఁ గూడినవై యుండఁగా, కృచ్ఛ్రేణాపి=కష్టముచేతనైనను, జలం=ఉదకము,నసిధ్యతి=దొరకదు. కేంద్రే=కేంద్రము, చంద్రశుక్రయుతే=చంద్రశుక్రులతోఁ గూడినదై యుండఁగా, పర్వతేచ=పర్వతమందైనను, జలం = ఉదకము, భవేత్ = దొరకును.

అర్కరాశౌ జలం శూన్యం పాషాణశ్చాపి దృశ్యతే,
జలరాశిగతే చన్ద్రే శుక్రేవాపి విశేషతః, 460

టీ. అర్కరాశౌ=సూర్యుఁడున్న రాశియందు, జలమ్=ఉదకము, శూన్యమ్= శూన్యము, పాషాణశ్చాపి = చాపరాయియు, దృశ్యతే = కనఁబడును. చంద్రే = చంద్రుఁడును, శుక్రేవాపి=శుక్రుఁడైనను, జలరాశిగతేసతి = పూర్ణజలరాశియందుండఁగా, విశేషతః=విశేషముగా, జలమ్=ఉదకము, దృశ్యతే= చూడఁబడును.

బీజావాపవిషయము.

షష్ఠ్యమీసప్తమీచైవ పౌర్ణమాసీ త్రయోదశీ,
తృతీయైకాదశీ చైవ ప్రశస్తా బీజకర్మణి. 461

టీ. పంచమి, సప్తమి, పూర్ణిమ, త్రయోదశి, తదియ, ఏకాదశి, ఈతిథులు, బీజకర్షణే=విత్తులువిత్తుటయందు, ప్రశస్తాః = యోగ్యమైనవి.

అర్కోదయే సూర్యవారే సర్వబీజాని వాపయేత్,
సోమవారే మిథోలగ్నే జలపుష్పాంకురాన్ న్యసేత్. 462

టీ. అర్కోదయే = సింహలగ్నమందును, సూర్యవారే = ఆదివారమందును, సర్వబీజాని=ఎల్లవిత్తులును, వాపయేత్=వెదజల్ల వచ్చును. సోమవారే = సోమవారమందును, మిథోలగ్నే = మిథునలగ్నమందును, జలపుష్పాంకురాన్ = రాజనపువిత్తులను, న్యసేత్ = వెదఁజల్లవచ్చును.

కుజస్య వారే తల్లగ్నే కోద్రవాన్ వాపయేద్బుధః,
బుధవారే సౌమ్యలగ్నే క్రముకస్థాపనం వనమ్. 463

టీ. కుజస్యవారే=మంగళవారమందు, తల్లగ్నే=మేషవృశ్చికములయందును, కోద్రవాన్=కొఱ్ఱధాన్యములను, బుధః=బుద్ధిమంతుఁడు, వాపయేత్=వెదజల్లదగినది. బుధవారే=బుధవారమందు. సౌమ్యలగ్నే = మిథునకన్యలయందును, క్రముకస్థాపనం=పోఁకచెట్టుపెట్టునట్టి, వనం=తోఁటను, స్థాపయేత్ = ఉంచవలయును.

స్థాపయేత్ఫలవృక్షాంశ్చ తల్లగ్నే దివసే గురోః,
శుక్రవారే తదుదయే స్థాపయేత్కుసుమాంతరమ్. 464

టీ. గురోః=బృహస్పతియొక్క, దివసే=వారమందును, తల్లగ్నే=ధనుర్మీనముల యందును ఫలవృక్షాంశ్చ=మామిడిచెట్టుమొదలయిన ఫలవృక్షములను, స్థాపయేత్ = ఉంచఁదగును. శుక్రవారే=శుక్రవారమందును, తదుదయే=తులావృషభములయందును కుసుమాంతరం=మల్లెలుమొదలయిన పూవుఁదీఁగెలను, స్థాపయేత్ = స్థాపింపవలెను.

మన్దస్య లగ్నే మన్దాహే కృష్ణధాన్యాని వాపయేత్.

టీ. మన్దస్య = శనైశ్చరునియొక్క, లగ్నే = మకరకుంభములయందును, మన్దాహే = శనివారమందును, కృష్ణధాన్యాని = నువ్వులుమొదలయినధాన్యములను, వాపయేత్ = వెదఁజల్లవచ్చును.

స్వాతీపుష్యమఖాప్రజేశవరుణాస్వాన్త్యాన్త్యమిత్రోత్తరా
మూలాధోక్షజహస్తభాని సతతం బీజస్య వాపే శుభాః,
ఆదిత్యైన్దవవాసవాస్తురగా వాపే సదా మధ్యమాః
శుక్రేన్దోర్బుధజీవయోశ్చ దివసాశ్శస్తాశ్చ నాన్యే పరాః. 466

టీ. స్వాతీపుష్యముఖా ప్రజేశవరుణాః=స్వాతీపుష్యముఖరోహిణీపూర్వాప లును, సార్యాంత్యమిత్రోత్తరాః = ఆశ్రేష రేవత్యనూరాధోత్తరలును, మూలాధోక హస్తభాని=మూలశ్రవణహస్తనక్షత్రములును, సతతం=ఎల్లప్పుడును. బీజస్య=వి నముయొక్క, వాపే=వెదజల్లుటయందు, శుభాః=శుభప్రదములైనవి. సతురగా అశ్వినితోఁగూడిన, అదిత్యైందవవాసవాః=పునర్వసు మృగశిర జ్యేష్ఠలును, వాశే విత్తుటయందు, సదా=ఎల్లప్పుడును, మధ్యమాః=మధ్యమఫలము నిచ్చునట్టివి, శుక్రే ద్వోః=శుక్రచంద్రులయొక్కయు, బుధజీవయోశ్చ=బుధబృహస్పతులయొక్కయు దివసాః=వారములు, శస్తాశ్చ=ప్రశస్తములయినవి. అన్యే=తక్కినవారములు, నవరా పనికిరానివి.

ముహూర్తదర్పణము

సంపూర్ణము.



Sri Gopalakrishna Press, Madras-21

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| బ్రహ్మసూత్రములు, మూలము | ... | 0 | 4 |
| ,, తెనుఁగువచనము, రెండు సంపుటములు | ... | 15 | 0 |
| ,, శంకరభాష్యము (సంస్కృతము) | ... | 10 | 0 |
| భగవద్గీతలు, మూలముమాత్రము | ... | 0 | 12 |
| ,, ఆంధ్రతాత్పర్యసహితము | ... | 2 | 0 |
| ,, అనిబిసెంటుగారి ఇంగ్లీషు తర్జుమా | ... | 0 | 12 |
| ,, శ్రీరామచంద్రసరస్వతీకృత ఆంధ్రటీకా తాత్పర్య వివరణసహితము | | 6 | 0 |
| వ్యవహారపంచకము, సాంధ్ర తాత్పర్యము | ... | 0 | 4 |
| హఠయోగప్రదీపిక ,, | ... | 3 | 8 |
| శంకరవిజయము, సవ్యాఖ్యానము | ... | 4 | 0 |
| భక్తిఫలనముక్తి | ... | 0 | 1 |
| భగవద్గీతాసారసంకీర్తనలు | ... | 0 | 4 |
| నైష్కర్మ్యసిద్ధి, సురేశ్వరాచార్యకృతము, ఆంధ్రటీకా తాత్పర్యము | ... | 5 | 0 |
| పంచీకరణము, ఆంధ్రతాత్పర్యసహితము | ... | 0 | 4 |
| ,, తెనుఁగువచనము | ... | 0 | 4 |
| భగవద్గీత, శంకరభాష్యము (సంస్కృతము) | ... | 4 | 0 |
| వాసుదేవమననము, తెనుఁగువచనము | ... | 2 | 8 |
| శుకాష్టకము | ... | 0 | 2 |

# జ్యోతిషగ్రంథములు

| | | | |
|---|---|---|---|
| అష్టకవర్గు, సాంధ్ర తాత్పర్యము | ... | 0 | 8 |
| ఆరూఢరత్న సిద్ధాంజనము | ... | 0 | 12 |
| ఉత్తరకాలామృతము, టీకా తాత్పర్యసహితము | ... | 2 | 8 |
| కాలామృతము, సవ్యాఖ్యానాంధ్ర తాత్పర్యసహితము | ... | 3 | 0 |
| కృష్ణవాస్తుశాస్త్రము, అనువాస్తుసార సంగ్రహము | ... | 1 | 0 |
| కేరళప్రశ్నము, సాంధ్ర తాత్పర్యము | ... | 0 | 4 |
| గోచార రత్నాకరము | ... | 1 | 8 |
| గౌళిశాస్త్రము, తెనుఁగువచనము | ... | 0 | 4 |
| ఛప్పన్నము, ప్రశ్నశాస్త్రము, తాత్పర్యసహితము | ... | 0 | 8 |
| జలార్గళశాస్త్రము, ఆంధ్రటీకాసహితము | ... | 0 | 6 |
| జాతకచంద్రిక, గోపాలరత్నాకరము ,, | ... | 1 | 0 |
| జాతకపారిజాతము, క్రొత్తకూర్పు ,, | ... | 6 | 0 |
| జ్యోతిషార్ణవనవనీతము ,, | ... | 3 | 0 |

| | | ప్రతి 1-కి రు. | అ. |
|---|---|---|---|
| నక్షత్రచూడామణి, (సంస్కృతము) | ... | 0 | 8 |
| పుట్టుమచ్చల శాస్త్రము | ... | 0 | 8 |
| యవనజాతకము | ... | 0 | 8 |
| బృహద్యోగరత్నాకరము, తెనుగువచనము | ... | 1 | 0 |
| బృహజ్జాతకము, సాంధ్రటీకాతాత్పర్యము | ... | 5 | 0 |
| భృగుసూత్రములు ,, | ... | 0 | 8 |
| భావార్థచంద్రిక, ఆంధ్రతాత్పర్యసహితము | ... | 1 | 0 |
| భూగర్భజలజ్ఞానశాస్త్రము ,, | ... | 0 | 8 |
| మయవాస్తువు, సాంధ్రతాత్పర్యము | ... | 0 | 4 |
| ముహూర్తమార్తాండము | ... | 3 | 0 |
| రెట్టమతశాస్త్రము, తాత్పర్యసహితము | ... | 1 | 8 |
| లఘుజాతకము, సాంధ్రతాత్పర్యము | ... | 2 | 8 |
| లగ్నసర్వస్వము ( పాతప్రతి) | ... | 1 | 8 |
| వనమాల (వర్షఫణి) ,, | ... | 0 | 4 |
| వాస్తుసర్వస్వము ,, | ... | 0 | 8 |
| వృద్ధపారాశర్యము, సాంధ్రతాత్పర్యము | ... | 1 | 0 |
| శకునశాస్త్రము, (శిఖినరసింహశతకము) | ... | 0 | 8 |
| షోడశప్రశ్నరత్నావళి, నెపోలియన్ అనుష్ఠించిన ప్రశ్నగ్రంథమునకు తెనుఁగు | ... | 0 | 4 |
| సనత్కుమారగృహవాస్తువు, సాంధ్రతాత్పర్యము | ... | 0 | 4 |
| సనత్కుమారశిల్పశాస్త్రము, సాంధ్రతాత్పర్యము | ... | 0 | 8 |
| స్వప్నశాస్త్రము ,, | ... | 0 | 4 |
| సర్వార్థచింతామణి, సాంధ్రతాత్పర్యము | ... | 5 | 0 |
| సంఖ్యాశాస్త్రము (Numerology) | ... | 2 | 0 |
| సకలశుభఫల అదృష్టదీపిక | ... | 1 | 0 |
| సారావళి, సాంధ్రతాత్పర్యము | ... | 6 | 0 |
| సాముద్రిక శాస్త్రము, సటీక | ... | 0 | 8 |
| ,, తెనుఁగుపద్యకావ్యము | ... | 0 | 8 |

☞ ఇవిగాక మావద్ద సంస్కృతాంధ్రగ్రంథములు, నాగరలిపి గ్రంథములు, అరవగ్రంథములు, ఇంగ్లీషుగ్రంథములు దొరకును.

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,

పోస్టుబాక్సు 1372. 292, ఎస్ప్లనేడ్, చెన్నపురి. 1